# భారతి

సాహిత్య మాసపత్రిక



వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1955



త్రివర్ణ చిత్రము : పృథ్వీపుత్రి—చిత్రకారుడు: హెచ్. వి. రామగోపాల్

# అనుభవశాలురను అనుసరించండి




## వీనినే ఎల్లప్పుడూ కావాలని కోరండి

ద్విశక్తిగల

# మోబిల్‌గ్యాస్

★ దీనిలో మోబిల్ పవర్ కాంపౌండ్ కలదు—ఈ కాంపౌండ్‌ను అల్లరి పిల్లల అడిటివ్ అనుకోకండి. ఇది ఏ పెట్రోలులోనూ యిప్పటివరకు చేరని అడిటివ్‌ల అత్యధిక శక్తిగల మిశ్రమము.

★ ఇది మీరు కొనగలిగే ఏ యితర రకపు పెట్రోలు కన్న ఎక్కువ ఇంజను బాధలను సరిచేయుట మీరు గమనించగలరు.

ద్వివిధ రక్షణ యిచ్చే

# మోబిలాయి

★ రెట్టింపు శుభ్రపరచే గుణము—దీనివలన మీ కారు యింజను అతి సున్నితముగ నడచును, అధిక శక్తి కలుగును మరియు ప్రతి గాలను పెట్రోలుకు ఎక్కువ మైళ్లు యిచ్చును.

★ అఱుగుదల నుండి రెట్టింపు రక్షణ—కారు ఇంజను ఆయుస్సు ఎన్నో ఏళ్లు వృద్ధిచేయును, ఓవర్‌హాల్‌ల అవసరము తగ్గించును.

## ఎగురుచున్న ఎఱ్ఱని గుఱ్ఱపు చిహ్నముగల చోట దొరకే వీనిని వాడుట నేడే ప్రారంభించండి!



స్టాండర్డ్ - వాక్యూమ్ ఆయిల్ కంపెనీ
(కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము)

V. 1873



పృథ్వీపుత్రి

చిత్రకారుడు : శ్రీ హెచ్. వి. రామగోపాల్

# ఉషోగి

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

ఉషోరేఖ ! ఉషోరేఖ !
ఉదయభాను జయపతాక !
ఉషోరేఖ ! ఉషోరేఖ !

స్వర్ణనగ సువర్ణభూష
స్వర్గంగా వీచిఘోష
సప్తర్షి ప్రకృత్యుపా
సనా పవిత్రమంత్రభాష
ఉషోరేఖ !

చలజ్జ్వల ద్బడబానల
గళజ్జలమయ జ్వాలా
విలయతాండవావేశో
జ్జ్వలమణీ కిరీటరేఖ
ఉషోరేఖ !

పురాజననదుష్టకర్మ
పరామృశన్నికృష్టరోగ
భయంకర వికారాపహ
భవ్యసౌఖ్య సుకృతవర్మ
ఉషోరేఖ!

అరుణారుణ కిరణాంచిత
తరుణాకృతి ధర్మమూర్తి
స్మరణాభినివేశ శుభం
కరణోన్నత ఫలస్ఫూర్తి !
ఉషోరేఖ !

స్వర్గనదీ తటోచ్చల తృప్తి
భాస్కరాశ్వ పిపాసార్తి
నిర్గమన విధాన దివ్య
నిర్మల జలదాళికీర్తి
ఉషోరేఖ !

తిగ్మభాను వాజిఖురో
ద్రేకనాట్యరంగతలో
దీర్ణ కనకచూర్ణ కలిత
దివ్యధామ జగద్రేఖ
ఉషోరేఖ !

## భా ర తి

తరుసంతతి కిసలయమై
సరోజముల పుష్పొవడియై
జలనిధి అంతఃపురాన
చలత్ప్రవాళ వల్లియైన
ఉషోరేఖ !

నిశాలతా విచ్ఛేదన
నిశిత పరశు రూపంబై
భువన త్రయ దివ్యాంగణ
పుణ్యరత్న దీపంబౌ
ఉషోరేఖ !

ప్రాతస్సంధ్యావందన
చేతః పద్మవికాశిత
చైతన్య జ్ఞానదీప
జగదారాధ్యంబైనది.
ఉషోరేఖ !

పాపాటవ్యుత్పాటన
కోపోగ్ర రవిప్రభా వి
రూపాక్షి స్ఫుటప్రణవ
దీప్రదీప మాలికయౌ
ఉషో రేఖ !

త్రయీధర్మ శాసనముల
నయాంచిత సుభాషణముల
ప్రకృష్టార్థ దివ్యప్రభ
సుకృత ఫలిత చిత్రప్రభ !
ఉషోరేఖ !

ఆర్షతత్వ బోధమహా
శీర్ష లసద్బ్రహ్మమూర్తి
సప్తలోక సంచారక
సప్తసప్తి విమల కీర్తి
ఉషోరేఖ !

ఉషోరేఖ ! ఉషోరేఖ
ఉదయభాను జయపతాక
ఉషోరేఖ ! ఉషోరేఖ ! ! !

# పరీక్ష

'బాలకృష్ణ'

రైలుకట్ట ప్రక్క, ఆ వాలుక్రింద దట్టంగా మొలచి ఉన్న రెల్లు దుబ్బుల్లో పడిఉంది ఒక మొండెం. రక్తం చారలు ... గట్టువాలుపై గడ్డిపైన—ఆప్యాయంగా ఒకకుక్క నాకుతోంది. కాకులు పొడుచుకు తింటున్నాయి వాటి విందుకు అడ్డువస్తున్నాయి రాబందులు. పట్టాలమధ్య ఉన్నతల; మెడదగ్గిర రక్తం గడ్డకడ్తోంది. అదంతా నెత్తురు మడుగు.

కొద్ది గంటలక్రితం ఒక వ్యక్తి రైలుక్రింద పెట్టాడు తల. ఈబాధ అంతులేనిది అనుకున్నాడు. భరించలేననుకున్నాడు రైలు క్రిందపడితే ఒక్క క్షణం. ఒక్క క్షణం. అంతే ఇంక అంతా సుఖం. అదీ అతనుకన్న స్వప్నం. ఈపరిస్థితుల్లో జీవించడం కన్న అదే మేలనిపించింది. గుండె రాయి చేసుకున్నాడు.

స్కూలు ఫైనలు పరీక్ష పోయింది రామానిది. 'ఫరవాలేదు నాయనా' అన్నాడు తండ్రి. తల్లి 'ఏం చేస్తాం నాయనా' అంది.

భార్యనంబరు కొట్టవచ్చినట్టుంది పేపర్లో. తనను చూసి, స్కూలు ఫైనలు ప్యాసవలేనివాణ్ణిచూసి నవ్వుకుంది ప్యాసయినభార్య. ఫరవాలేదన్న తండ్రి మాటల్లో 'చవటా' అనే ధ్వని వినిపించింది. 'ఏం చేస్తాం' అన్న తల్లి నిట్టూర్పులో—యీదద్దమ్మ నాకెందుకు పుట్టాడు అన్న స్ఫురణఉంది. 'ఛీ అల్లా అంటారా?' తల్లిదండ్రులు అల్లా ఆలోచిస్తారా? అదంతా తనభావన అనుకున్నాడు. కాదు. ఒకసారా రెండుసార్లా ఇది మూడోమారాయె.

"చట్టి వెధవలంతా ప్యాస్ అవుతున్నారు మీవాడు అవకపోవడం...."

ఆమాట అంటున్న దెవరవుతేనేం. వెధవలకంట వెధవ్వి, చవటలకంట చవటవు. అనే సూచన ఇమిడే ఉంది అందులో. ఇటువంటి సూటిపోటీ మాటల్ని రాము తట్టుకోలేకపోయాడు.

పేపరుకోసం కళ్లు కాయలు కాసేట్టు ఎదురు చూశాడు. ఈమారు తప్పకుండా దాటగలననే ధీమా ఉంది.

అత్తవారి ఇంటికి వెళ్లినప్పుడు 'ఏమోయ్ ఈమారు ఎల్లా రాశావు?' అంది అత్తగారు.

రూప ఆత్రంగా ప్రక్కనుంచి వింటూ ఉండడం తను గమనించక పోలేదు.

'ఈమారు చాలా బాగా రాశాను' అనబోయాడు.

కాని ప్రశ్నలోనే నువ్వు 'ఘోరీ'వి అన్నది స్ఫురించి ఆగిపోయాడు. ఈమారు తప్పకుండా ప్యాస్ అవుతాడు తను.

సగర్వంగా చెప్పాడు 'మాస్టారు గారేప్రు' అని.

గర్వంగా మెరిశాయో—మాద్దాంగా ఏమాత్రం దాటతారో అని సవాలుచేశాయో తేల్చుకోలేక పోయాడు రూపకళ్లు చూసి.

సాయంత్రం ఇంక షైరు వెళ్దాం అనుకుంటున్నాడు. రామం ఏమంత చిన్న వయసువాడు కాదు. అది కోర్కెలు తలలు ఎత్తే వయసు. పంధొమ్మిది. రూపకి పదహారు. స్కూలు ఫైనలు పరీక్షలు రాసింది. అడుగుదాం అనుకున్నాడు ఎల్లా రాసిందో. తను—అడగడం. ఇంతకుముందు రెండుమూడుమార్లు ప్రయత్నించాడు. అడగలేకపోయాడు. ఎల్లాగ—తనేం పెద్దచదువు చదువుతున్నాడా? — ఎల్లా రాశావని పిల్లాన్ని అడిగేందుక్క — రూపను ఎన్నోసార్లు అడుగుదాం అనుకున్నాడు తను అయిదవఫారంలో రూప ఉన్నప్పుడు అడిగినట్టు అడుగుదాం అని.

లెక్కల పేపరు పుచ్చుకునేవాడు! ఏదీ యిది బజారు బిల్లు—చెయ్యి తే...ఇదే చెయ్యలేదూ?—ఇల్లా అంటూ పెద్దరికం వెళ్లబోసేవాడు.

అత్తగారు, అల్లుడు కూతురు చదువులో అంత శ్రద్ధచూపించడంచూసి చాలా సంతోషించింది. అసలు రామం ఇంచుమించు పెళ్లి చేసుకునేప్పుడే నిశ్చయం చేసుకున్నాడు. తను కాలేజీలో చదివేప్పుడు

రెండేళ్లు హాస్టల్లో ఉండి - తర్వాత దాన్ని స్కూలు ఫైనలుకాగానే తనదగ్గిర్కి తీసుకువెళ్ళి కాలేజీలో చేర్పించాలని.

డబ్బుకేంలోటులేదు. తను తండ్రికి ఒక్కడే కొడుకు. అది వాళ్ళకు ఒక్కతే కూతురు. డబ్బు యిద్దరూ సమానంగా ఇళ్లదగ్గర్నుంచి తెచ్చుకుంటూ ఇద్దరూ హాస్టల్లో ఉండడమా? లేకపోతే కాపరం పెట్టి యిద్దరూ ఒకచోటే ఉండడమా?

'వివాహం విద్యా నాశనం ... శోభనం సర్వ నాశనం'—అది పూర్వం...

తల దువ్వుకుంటున్నాడు. రూప అలంకరించుకుని ఎందుకో వసారాలోంచి వెళ్తోంది. ఎల్లా రాసిందో పేపర్లు అడుగుదాం అనుకున్నాడు.

రూపను చూడగానే ఇంకేదోలా అనిపించింది. పిలిచాడు. ఎల్లా రాశావన్నాడు.

"ఏమో—నాకు తెలియదండి. ఏదో రాసి వచ్చానంతే—ఏం జరుగుతుందో—"

ఈ ధోరణిలో చెప్పింది. ఆడవాళ్ళే యింత. వెట్టి మోహాలు. ఏం రాశారో తెలియదు. ఏ ఫలితం వస్తుందో తెలియదు. తెలివి ఇలాగే ఉంది. 'ఏం రాశావో తెలియదూ !'

పెద్దరికం చూపించాడు.

చూపించి ఏదో ఉడికి వస్తున్న కోర్కె... గడువు మీద నుంచి దృష్టి మరలించగానే...

"కాలేజీకి వెళ్తారు కదూ..." అటువంటిమాటే అంది. ఈ మాటే కాకపోయినా. ఈ ప్రశ్నకు అర్థం అపడాలలో ఉన్నది కాదు మరేదో—

"నే నొక్కణ్ణే వెళ్లనే బెంగపెట్టుకోకు... నిన్నూ..."

సిగ్గు పడింది.

ఒక్క ఉదుటు తిరిగి వేసింది.

ముఖం దాచుకుంది.

రామం ముందుకు వేశాడు అడుగు.

రూప స్కూలు ఫైనలు ప్యాసయింది. తన నంబరు లేదు. రూపనంబరు వెక్కిరించింది రామాన్ని.

"ఏరా రామూ....పోయిందిట్రా?"

పరామర్శ—వాడు పట్టె పికొక్కాడు. తెలుగులో కూడా రెండు మాటలు కలిపి రాయలేదు. ఇంటరు ప్యాసవలేదు ఫస్టుక్లాసులో రామం సహాధ్యాయి

కళ్ళ నీళ్ల పర్యంతం అయింది.

"పోన్లేరా యీమారు—అక్టోబరుకు ప్రయత్నం చెయ్యి తప్పకుండా ప్యాస్ అవుతావు—మరేం ఫరవాలేదు. వెధవలంతా ప్యాసవుతున్నారు..."

"ఇదుగో...పిలక మాష్టారున్నారు చూశావ్. ఆయనకు పిలకుంటే మన నేంచేసింది కానీ—గొప్పగా కోచింగ్ యిస్తారులే..."

ఎక్కడకో పరుగెత్తుకు పోయాడు రామం.

ఆ శవం దృశ్యం ఎదురయింది.

*  *  *  *

ఆ రాత్రి పడుకున్నాడు. కళ్ళ వెంట నీళ్లు రాడల్లేదు కాని ఏమిటో నోరు తడారి పోయినట్టు ఉంది. బ్రతుకు బీడు వారినట్టు ఉంది. భవిష్యత్ శూన్యంలా ఉంది. ఒకొక్కళ్ళే—అంతా తనని వెక్కిరిస్తున్నారు. ఒక్కళ్ళలోనూ మానవత్వంలేదు.

తను కష్టపడి చదివిన చదువు ఒక్కళ్లకీ అక్కర్లేదేం ? తెల్లవార్లూ చదివిన రోజులు ఉన్నాయి.

రామం చదువుతూఉంటే—చెప్తే వినకపోతే తండ్రి బలవంతాన కేకలు పెట్టి పడుకోమన్న రోజులు ఉన్నాయి. ఇల్లా ఎందుకు జరుగుతోంది. అసలు మెదడనేది తనకు లేదా? లేమా. గాలంటే—ఏ జంతువు లాగుతుందనో ఆలోచించే రూపపాటి తెలివి లేదూ తనకి? చక్కటి పద్యం కనపడితే భావంమాట అటుఉంచి అర్థంకోసమే నిఘంటువుల్ని ఆశ్రయించేవాళ్ళపాటి బుర్ర లేదూ? బజారుకు వెళ్తే అరవీశ వంకాయలు కొనేంతుక్కా పెన్సిలూ కాగితం తెచ్చేవాళ్ళకంటే తీసిపోయాడా?...

ఏదో యిందులో ఉంది. ఈ పరీక్షలు తెలివికి కొలతబద్దలా?...

రామం ఆలోచించుకుంటూ పడుకున్నాడు బాహ్యప్రపంచాన్ని మరచిపోయి. ఎవేవో ఆలోచనలు తిరుగుతున్నాయి.

ఆ శవం — ఆ మొండెం — (భయంకర దృశ్యం...)

రామం తనూ ఆత్మహత్యే శరణ్యం అనుకున్నాడు.

పరుగెత్తుకు వెళ్ళాడు. అంతా తనని వెంటాడుతున్నారు. అంతా వెక్కిరిస్తున్నారు. రైలుక్రింద పడడం సుఖం అనుకున్నాడు.

ఆ తలను రక్తాన్ని చూడగానే తల తిరిగి పోయింది. ఆ మొండెం...

# పరీక్ష

పడిపోయాడు నేలమీద. ఆ వాలుమీదుగా దొరిపోయాడు.

తలకు దెబ్బ తగిలి సొమ్మసిల్లిపోయాడు.

చీకటి ఆవరించుకుంటోంది. రైలు కూత దిగంతాల తాకి ప్రతిధ్వనించింది. రామం భయంతో వణికిపోయాడు. అది ఒక రాక్షసి. చప్పుడు గుండెమీద సమ్మెటతో కొట్టినట్టు ఉంది. రైలు కాంతి ఆ పట్టాల మీద పడి—తెలుపు కత్తివాలుపై తళుకులా ఉంది. భయంతో కళ్ళు మూసుకున్నాడు.

లేద్దాం అనుకున్నాడు. నిస్సత్తువ ఆవహించుకుంది.

రైలు గుండెలమీదనుంచిలా దొర్లిపోయింది. పెనుభూతం గుండెలమీదనుంచి దిగిపోయింది.

తను చచ్చిపోతే?...

అమ్మ నాన్నా!...

రూప!...

ఒక్క కొడుకు రామం. గారాంగా చూసుకుంటున్నారు. జ్వరం వస్తే ఒక్క క్షణం వదలక—అమ్మ...

జ్వరం వచ్చింది. అమ్మ రాత్రి అనక పగలనక అల్లా కూర్చునిఉండేది తలాపుదిక్కున తల తిప్పాడు ఎందుకో ఏదో అమ్మతో చెప్దాం అని. అమ్మ కన్నీరు చూసి చాలా బాధ అనిపించింది.

'ఎందుకమ్మా ఏడుస్తావు?' రామం కడుపు తరుక్కుపోయింది.

తల్లి, నుదుటిమీద చెయ్యి వేసి

"అబ్బే, కంట్లో నలక పడ్డేను..."

అమ్మ చెయ్యి చేతుల్లోకి తీసుకున్నాడు.

"అమ్మా.. నాన్నగారు" అని తను ఏదో చెప్పబోతూ ఉంటే...

"ఏమండోయ్...మిమ్మల్ని పిలుస్తున్నాడండి"

అది అర్థరాత్రి వేళ.

వెంటనే వచ్చారు నాన్నగారు

"ఏం కావాలి నాయనా" అంటూ.

నాన్నగారు కూడా కునుకు లేకుండా కూర్చున్నారా తనకోసం.

"నాకు నిద్దర వస్తోంది. మీరుకూడా పడుకోండి"

"నిద్దర రావడల్లే నాయనా... పగలు పడుకున్నాదూ..." అంది అమ్మ. అది అబద్ధం. అమ్మ అసలు కతవదగ్గర్నుంచి కదలందే.

తను చచ్చిపోతే అమ్మ ఎంత బాధ పడిపోతుంది. తను సుఖపడ్డాడు ఆత్మ హత్య చేసుకుంటే. మరి అమ్మమాట. పంధొమ్మిదేళ్లు హృదయం యిచ్చి ప్రేమించి పెంచిన నేరాన్న నిక్రృష్టమయిన బాధలు పడుతుంది. ఇంక ప్రేమించేందుకు ఎవరున్నారని. ఎవరిని చూసుకుని బ్రతుకుతుంది?

'అమ్మకూడా నాకుమల్లే నే...'

గుండె గుభేలుమంది.

ఇంటి దగ్గర ఏం జరుగుతోందో...

తలంతా దిమ్ముగా ఉంది. మైకంగా ఉంది. భూమంతా తిరుగుతున్నట్టు. నీరసం కదలనివ్వనట్టు. బహుకష్టంమీద చేతులుఆన్చి లేవగలిగాడు. మెత్తగా తగిలింది ఏదో.

అది శవం.

ఇతను చేసినపనికి ఎంతమంది గుండెలు పగిలి ఏడుస్తున్నారో! ... ఇతనికి రూపవంటి భార్య ఉందేమో!

తన జీవితాన్ని, భర్త జీవితంతో పెనవేసుకుని ఉన్న ఆమెను కూడా హత్యచేశాడు నీచుడు—

తల్లిదండ్రులు ముసలివాళ్ళేమో. ఇతనే ఆధారమేమో వాళ్ళకి.

పైకి వచ్చి ఉద్ధరిస్తాడని ధైర్యంతో వేలు అప్పులు చేసి చదివిస్తున్నారేమో-

వాళ్ల పీకలు చేతులారా నులిమాడు.

చిన్న బాధను తట్టుకోలేని పిరికిపంద.

బలవంతాన చచ్చిన వాళ్లు భూతాలవుతారు ఒక్కమారు భయం ఆవరించుకుంది.

దూరంగా కాంతి. కాంతిలో నలుపు. పెద చప్పుడు. చప్పుడు నుంచి భూతం ఆవిర్భవించింది.

"ఏమిటన్నావ్ పిరికిపందనా?"

దబాయిస్తోంది.

కాదని నోటి చివరవరకూ వచ్చి ధైర్యం చేసి 'అవును. అతురాలా' అన్నాడు రామం.

"నువ్వు చెయ్యబోయిన ఘనకార్యం ఏమిటిది?" ముదలకించింది భూతం.

అవును తను చెయ్యబోయింది ఏమిటి?

"లేదే నిన్నుతప్పించాను. లేకపోతే యిందాకే రైలు క్రింద పడేవాడవు. నాలాగే నువ్వూ చచ్చేవాడవు!

కాదనలేక పోయాడు రామం.

"స్వార్థం చూసుకున్నాను...

మానవుడిలా మాట్లాడుతోంది భూతం. భూతాల్లో కూడా మానవత్వం ఉంటుందన్నమాట, మానవుల్లో భూతాల తత్వం ఉన్నట్టే—

"ఏబాధలూ అట్టేఉండవు. ఏగాయం మానక పోడంలేదు. అది కొత్తలో చచ్చేబాధ వేస్తుంది. చద్దాం అనిపిస్తుంది. కాని కాలం మాన్పితీరుతుంది ..."

రామానికి అంతే అనిపించింది.

"స్వార్థంకోసం క్షణం బాధ అనుభవించలేక చచ్చాను రైలు క్రిందపడి. సూర్కాలు ఫైనలుపోయింది. నా అభిమానం దెబ్బతింది. అల్లాచూడు నేననుకునే నేను, ఎల్లా తూట్లు పడిపోయానో; ఆ నేను నేను కాదు. ఆ శవాకారమే నేనయితే ఇంక నేను ఎల్లా రాగలిగాను. ఆ నేను, నేను కాను. ఇప్పుడు కనపడే నేను, నేను. ఆ భౌతికదేహాన్ని చంపేస్తే యింకసుఖం అనుకున్నా....

కాదామరి అనుకున్నాడు రామం.

'చావడం సుఖవే. ఇంజక్షను చురుక్కు మన్నట్టే, అంతే. చురుక్కుమనగానే చచ్చిపోయి ఉంటాం. అందులో బాధ ఏంలేదు .."

అన్నీ మర్చిపోయి—తనసంగతి జ్ఞాపకంవచ్చి చచ్చిపోతే బాగుండు ననుకున్నాడు రామం...

"కాని ఇప్పుడే మాయింటికి వెళ్లివచ్చా. ఆ దేహంతో మనం నాశనంకాం అసలు 'నేను' ఇల్లా ఉండిపోతుంది మా అమ్మ గుండెలు పగిలేట్టు ఏడుస్తోంది. నా భార్య శోకాలు పెడ్తోంది. ఇంకా నే నీ ఘన కార్యం చేశానని తెలియదు. పాపం వెతుక్కుంటున్నారు. ఈవిషయం తెలియగానే..."

"రామం—యింక అల్లా స్థాణువులా ఉండలేక పోయాడు.

భూతం కళ్ల వెంట నీళ్లు పెట్టుకుంది.

కన్నీళ్లు తుడుద్దాం అనుకున్నాడు. చేతులుతీసి తన తలవర్కువంగి, ఏదో చెప్పబోతున్న భూతం కళ్లనీళ్లు తుడవబోయాడు. ఏదో తడిలా తగిలింద.

రామం తలనుంచి కారిన నెత్తురు గడ్డ కడ్తోంది.

నీరసంగా లేవబోయాడు.

లేచాడు కష్టంమీద.

భూతం మాయమయింది. కనపడకపోయినా ఏవో అస్పష్టంగా చెప్తూనే ఉంది. వినపడ్తూనే ఉన్నాయి.

"అన్ని పాపాలకంటే మహాపాపం, దారుణం, పిరికితనం కల్గిఉండడం. మన పిరికితనంవల్ల యితరులని బాధలు పెట్టడం. చిన్నబాధల్ని ఓర్చుకోలేని మనం ఎందుకు పనికివస్తాం. కష్టసుఖాలు వస్తూ ఉంటాయి —పోతూ ఉంటాయి.

క్షణం బాధ ఓర్చుకోలేక—మనసారా మన కోసం ప్రాణాల్ని అర్పించే వ్యక్తుల్ని బాధపెట్టడం కంటే అన్యాయంఉందా ?

నువ్వు బాధపడ్డా నువ్వు ప్రేమించేవ్యక్తిని సుఖపెట్టు. నీశరీరం కష్టపడ్డా, నీ అహం దెబ్బతిన్నా, నీ దేహంపోయినా, మిగిలిపోయిన నేను సుఖపడుతుంది..."

అల్లా భూతం గొణుగుడు వినపడుతూనే ఉంది.

అది వింటూ పోతున్నాడు రామం.

ఎదురుగొప్పి తగిలింది. పడ్డాడు. అయినా పెద్ద దెబ్బేంతగల్లా.

ఇంటిదగ్గర తనకోసం ఎంత కంగారుపడు తున్నారో.

అమ్మ తను ఏదో అయిపోయాడని ఆత్మ హత్య...

రామం పరుగెత్తాడు.

తడబడుతున్నాయి కాళ్లు. పడుతున్నాడు. లేస్తున్నాడు.

వెలుతురు మీదపడింది.

వెంటనే 'యిరుగోరా అబ్బాయిగా' రనే పాలేరుమాట—దెబ్బ అనే పొలికేకలు వినపడ్డాయి.

ఒక్కమారు నీరసం ఆవరించుకుంది. కూలి పోయాడు కుప్పలా.

*        *        *        *

జ్వరం—పేలాపన. అందులోనే ఆలోచన. అందరికంటె తను తీసిపోయాడా?...

భూతాన్కి తలలేదు. ఒకోమారు తలతోటే ఒకోసారి తలలేకండానూ కనపడుతోంది. తల ఉన్నప్పుడయినా తల మొండెం వేరుగా కనపడ్తున్నాయి.

"తీసిపోయాం అనుకుంటాం—మనం ఏమీ తీసిపోలా ఎవరికన్నా—"

నిక్కచ్చిగా, తీర్పుగా, బల్లగుద్ది చెప్పింది భూతం.

"మరి నేనెందుకు యిల్లా తప్పిపోతున్నాను?"

# పరీక్ష

భూతం ఏదో చెప్పబోతోంది.

తల్లి తట్టి లేపింది.

'ఇదుగో చూడు నాయనా...అదే ఆలోచనా. అనేదో అనబోతోంది.

భూతం సమాధానంకోసం ఎదురుచూస్తున్న రామం నెమ్మదిగా కళ్లు తెరిచాడు.

'కలొచ్చిందా నాయనా?'

నీరసంగా ఉన్నాడు. విసుపు వచ్చింది. ఏమిటో మాటిమాటికీ కొంప మునిగినట్లు లేపుతుంది. అదే అనేశాడు.

"ఎందుకు అస్తమానూ మాట్లాడిస్తావు యిల్లా పడి ఉండనివ్వక?"

తల్లి చిన్నబోయింది. పాపం నీరసంగా ఉండి అసలు మాట్లాడలేకపోతున్నాడు కాబోలు ఎందుకు మాట్లాడించానా అని బాధపడింది.

కళ్లుమూసుకు పడుకుంటే నిస్త్రాణ వచ్చిందేమో అనే భయం.

గ్లూకోజు ఇస్తే కొంచెం తగ్గుతుందనే ఆశ.

ఏమిటో మాట్లాడకుండా అల్లా కొడుకువైపు చూస్తూఉంటే ఏదో ఆదుర్దా.

డాక్టరు ఏం ఫరవాలేదని చెప్పారు. రక్తం కొంచెం నష్టం అయిందని అంటేట—

ఉండుండీ ఉడికుండీ ఏమిటో 'నేనెందుకు ఫెయిల్ అయాను' అంటూఉంటాడు.

అదేదో మానసిక వ్యాధిగా పరిణమిస్తోందని తల్లి భయం.

తండ్రి భయం.

కళ్లుమూసుకున్న రామానికి మళ్ళీ తలలేని భూతం సాక్షాత్కరించింది.

'తెలివికి ఈ పరీక్షలు కొలతలు కావు. నేను చక్కటి బొమ్మలు గీసేవాణ్ణి. నా అంత తియ్యగా కబుర్లు చెప్పగలవాళ్లు లేరు నా ముందు ఇంగ్లీషు మాట్లాడడం అంటే నే దడగా ఉండేది మాష్టార్కి!....

"మరెందుకు పోయిందీ..."

"నాయనా...యిదుగో......" మళ్ళీ వెన్ను రాస్తూ లేపింది తల్లి. "కొంచెం గ్లూకోజునీళ్లు ఇమ్మంటావా?"

"అబ్బబ్బ....కొంచెంసేపు ప్రశాంతంగా పడుకోనివ్వవు కదా కర్మ వచ్చింది...వచ్చినా సుఖపడి ఉంధును..."

ఆ తల్లిగుండెల్లో బాకులు దూసుకున్నాయి ముఖం వివర్ణమయింది.

తన ప్రశ్నకు, సమాధానం రాకుండా, భూతం మాయం అవడానికి కారణం అమ్మ ఆ భూతం తనకు దైవం. తను ఆత్మహత్య చేసుకోకుండా కాపాడింది. ఇప్పుడు తనకి ఒక దారిని చూపిస్తుంది. అది రామం ఆశ. అమ్మ ప్రతీసారీ అడ్డుపడ్తోంది పానకంలో పుడకలా. రెండు మూడుసార్లు ఇల్లా జరుగుతే భూతంగారికి కోపం వచ్చి మళ్ళీ రారు కూడాను.

రంగు రంగుల చోటులు. రంగురంగుల బాటలు. బాటల్లో వింతవింత ఆకర్షణలు. వాటిలో ఒకచోట ఒక దేవకన్య.

ఎవరా అని పట్టిపట్టి చూశాడులనుకుంటూ.

రూప!...

రూప స్కూలుఫైనలు పాస్ అయింది.

తనూ!...

పకపకా నవ్విందిరూప.

తనని వెక్కిరిస్తోంది

చాలా కోపం వచ్చింది. కొట్టాలనిపించింది.

సిగ్గేసింది.

భూమిలో కూరుకుపోవాలనిపించింది.

భూతం వచ్చింది దైవంలా.

"అన్నీ నువ్వే అనుకుంటున్నావు. నీ మానసిక స్థితిలో ఉంది. ఏదృష్టితో చూస్తే — అన్నీ అల్లాగే కనపడతాయి, కామెర్లవాళ్లకి కనపడ్డట్టు..."

"మరి రూపెందుకు నవ్వుతోందీ...?"

తల్లి, రూపనుగురించి పలవరించడం వింది. లేపుదాం అనుకుంది. వద్దనుకుంది. ఆథోరణి మారింది కదా అని సంతోషించింది.

"నిన్ను సంతోషపెడ్దాం అని నవ్వుతోంది. వెక్కిరిద్దాం అనికాదు. నువ్వే అనుకుంటున్నావు అల్లాఅని."

'కాదు' అన్నాడు రామం...

రూపని చేత్తో లాక్కొచ్చింది భూతం తీసుకొచ్చి ప్రక్కన కూర్చోపెట్టింది. మీ ఆయన పరీక్ష తప్పాడు. నువ్వు పాస్ అయావు. నువ్వే తెలివయిన దానవు—అని పకపకా నవ్వింది భూతం.

రామం రూప ముఖం జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

రూప ముఖం కందిగడ్డ అయింది. ప్రక్కనున్న బత్తాయి చాకు విసిరింది. అది భూతం హాసంలో కలిసిపోయింది.

అప్పుడు భూతం చూశావా రామం అన్నట్టు చూసింది. వారిస్తూ రూప చెయ్యిపట్టుకున్నాడు.

"చూడండి ఏమంటున్నాడో" అంది.

"తమాషాకి అన్నాడు మన స్నేహితుడేలే" అన్నాడు రామం.

"అవుతేమాత్రం" అని విస్సావాటంగా చూసింది.

"ఇటువంటివాళ్లతోనా వేళాకోళం. మీగోరికి పోలరు ఎవరూ. మీరు గొంతెత్తితే భువనాలే పులకిస్తాయి..."

"నిజంగా అది నీ ఉద్దేశ్యమా?" రామం అడిగాడు నమ్మలేనట్టు...

"కాక...." ఓరగా చూసింది.

"రూపా..." గుండెలకు హత్తుకున్నాడు.

పులకించింది మేను.

ఇద్దరూ చిన్మయానందంలో లీనమయ్యారు.

నిద్రపోయాడు రామం

రామం తల్లి అక్కడ కూర్చుని ఉంది, బొట్టు చమటకు బారలు కడ్తూండగా.

తండ్రి రామందగ్గర కూర్చుని ఆమెను నిద్ర పొమ్మన్నారు.

'కోడలుమాట పలవరిస్తున్నాడండీ' అంది.

* * * *

రామాన్ని చూడగానే రూపకు చాలా బాధ అనిపించింది. ఇల్లా అయిపోయారేమిటి? తలకు కట్టు అక్కడక్కడ ప్లాస్టరు. నీరసపు దృక్కులు. తిన్నగా రామం దగ్గరకు వచ్చింది.

రామం కళ్ళు మూసుకుని ఉన్నాడు.

"నేనండి..." అంది తలవంచుకుని నిలబడి.

ఆనాడు కలలో కనపడ్డ రూప యిల్లానే ఉంది. 'కూర్చో' ప్రక్క చూపించాడు.

సిగ్గుపడింది.

"ఫరవాలే" అన్నట్లు చూసింది.

ఆ చూపులోనే మత్తెక్కించేదేదో ఉంది.

'కూర్చో చెప్తా..'

కూర్చుంది.

"ప్యాసయ్యావుకదూ. చాలాబావుంది' అన్నాడు ప్రశాంతంగా.

'ఉ' అంది వినపడీ వినపడకుండా.

"కాలేజీలో చదువుకుంటావా?".

ఏదో మాట్లాడలేని స్థితిలో అల్లా కూర్చుని ఉంది.

"ఫరవాలేదు రూపా. చదువుకో వస్తూంటే మానడం ఎందుకు. నాకు ఆ యోగ్యత ఎల్లాగూ లేదు..."

నోటికి చెయ్యి అడ్డం పెట్టింది.

తల్లి వచ్చింది.

లేచి నుంచుంది రూప.

నవ్వుకుంది తల్లి.

బల్లమీద పెట్టి "సగ్గుజావ తీసుకోమన్నారమ్మా డాక్టరుగారు. కొంచెం చల్లార పెట్టి..."

రూప జారుకుంటోంది మాట్లాడకుండా.

"ఇల్లా చూడు, అమ్మాయి. నాకు పనుంది..."

అంటూ తనే ముందు వెళ్ళిపోయింది.

రామం తల్లివంకకు. భార్య వంకకు చూపులు మళ్ళిస్తున్నాడు.

ఇద్దరూ తనని ప్రేమిస్తున్నారు.

కాని యిద్దర్లోనూ తేడా ఉంది.

తను ప్రేమించక పోయినా ప్రేమిస్తుంది అమ్మ. తననుంచి ఏమీ ఆశించదు. కాని తనకి ఆమె ప్రేమలో ఏదో కొరత కనిపిస్తుంది. అది తనకు చాలదు. ఇంకా ఏదో కావాలి. అది అమ్మదగ్గర లేదు. అది ఆమె యివ్వలేదు.

రూప....

రూప...జావ చల్లారి పోతోంది.

"అంత యివ్వడం యిష్టం లేకపోతే అమ్మనే యిమ్మన లేకపోయినావ్?"

చురుగ్గా చూసింది రూప. అదే సమాధానం. అది అంత నేనిస్తే పుచ్చుకోడం యిష్టం లేకపోతే ఆవిడ్ని యిమ్మని పట్టుపట్టకపోయారూ అన్నట్టు; చాలెంజి కొంటెతనం—అన్నట్టు; పోదురూ—అని విదిలించి సిగ్గుపడ్డట్టు ఎన్నో చెప్పింది ఆ చూపు.

ఎంతో తృప్తిగా వుంది ఎందుచేతో.

ఎన్నో విషయాలు ఆలోచించడం మానేశాడు రామం.

చెంచాతో తీసి నోటికి అందివ్వబోయింది.

"ఇల్లా పడుకుని తాగడం కష్టమండి..."

'అన్నీ మతిమరుపు' అని నొచ్చుకున్నట్టు చూసి—లేచి కూర్చోండి అన్నట్టు, అవ్యక్త సంజ్ఞతోటి వ్యక్తం చేసింది.

"మాట్లాడితే ముత్యాలు ఒలికిపోతాయా?"

ముక్కు మీద వేలు వేసుకుని, వరండాలోకి చూసింది. ఏదో వుందని చూశాడు, నాన్నగారు...

మారాం చేస్తుంటే భయపెడ్తే బుద్ధిమంతుడయిపోయిన పిల్లాడిముఖం పెట్టి లేచి కూర్చోబోయాడు.

చేయూత ఇచ్చి కూర్చో పెట్టింది.

రామానికి ముద్దోవికారాలు కలుగుతున్నాయి.

చంటిపిల్లవాణ్ణి సాకే తల్లిలాగుంది రూప.

జావ ఒక్కొక్క చెంచాయే పట్టింది.

మధ్య మధ్య గుటకలు వేస్తూ "చాల్లే యింక చాలు" అంటూ బ్రతిమాలించుకుని, బామాలించుకుని, జావ త్రాగాడు రామం.

నీళ్ళతో మూతి కడిగింది.

తొంగు అందుకుని తుడుచుకున్నాడు.

నాన్నగారు కొడుకు తొంటెతనం చూసి నవ్వుకున్నారు. అన్నీ మర్చిపోడం చూసి సంతసించారు.

మామగారు యిదంతా చూశారని గ్రహించి సిగ్గుపడిపోయింది కోడలు.

*         *         *         *

'అమ్మా' అది రామం పిలుపు.

జారుముడి వేసుకుంటూవచ్చింది రూప. తలంటు పోసుకుంది. మల్లె మొగ్గలాగుంది.

"నిన్నెవరు రమ్మన్నారు?"

"మరే పాపం మీరు రమ్మంటే వచ్చానేమిటి?"

"మరెందుకు వచ్చావు?"

"నాఅంతట నేనే వచ్చాను. ఏమన్నా అవసరం ఉంటుందీ అయ్యగార్కి అడిగిపోదామని...."

'మా అమ్మని పిలవడం అవసరం...'

"మీ అమ్మగారు రారు..."

"ఏం"

సంజ్ఞ చేసింది. నాన్క్కి నీళ్లుపోసుకుంటున్నారు అని అర్థం. కొన్ని కొన్ని విషయాలు సంజ్ఞలో చెప్తూ ఉంటుంది. ఆ సంజ్ఞాపరిచ్ఛేదం అంతా వచ్చేసింది రామానికి.

నాన్నగార్ని పిలు..."

"ఆ...తగినవారే..."

"ఏం..."

తల అడ్డంగా ఊపింది.

"పోనీ—నువ్విల్లారా..."

"మడి..."

"మడికేం భంగం రానివ్వనులే ... కూర్చొ ...చాలా ముఖ్యమయిన విషయం మాట్లాడాలి .."

దూరంగా ముక్కాలిపీటమీద కూర్చుంది.

"కాలేజీలు తెరుస్తారు..."

"అంటే...?"

"కాలేజిలో చదివేమాటుంటే వెళ్తుగాని..."

అది రోజూ అనే మాటే...

"మీరు వండి పెడ్తా రాకూడావచ్చి ..."

కనపడీ కనపడకుండా కదులుతున్నా, ఆమె హృదయాన్ని అర్థం చేసుకున్న రామం పరిహాసంలోని పరిమళాన్ని ఆస్వాదించగలిగేడు.

"పెద్దప్లాను వేశాను. నీసలహాకూడా కావాలి ."

"నే నేం యివ్వలేను సుమండీ..."

"అమ్మాయి తలుపుతియ్యమ్మా..." అది నాన్నగారి పిలుపు.

వెళ్లిపోయింది రూప.

బుక్ పోస్టు వచ్చిందని తెచ్చియిచ్చారు నాన్నగారు.

"నాన్నగారు—నేను యింక యీ సూక్కలు పైవలు మానేసి..."

"శుభ్రంగా మానెయ్యి..."

"సంగీతం సాధకం చేద్దామనుకుంటున్నా. ."

"అల్లాగే" అన్నారు...

అంతకంటె ఆయనకు కావల్సింది ఏముంది. రామం ఎల్లాగయితే సుఖంగా ఉంటే అదేచాలు.

విజయనగరం ప్రయాణంఅని, ఎప్పుడా ఎప్పుడా చెప్పడం అని ఉరకలు వేస్తోంది అతనిమనస్సు.

నాన్నగారు అటువెళ్లారు — యిటువచ్చింది రూప.

"కాలేజీలు తెరుస్తారు" అంది.

"అంటే...?—రామం

"కాలేజీలో చేరేమాటుంటే వెళ్లురుగాని.. " రూప.

"మీరు వండిపెడ్తారా కూడావచ్చి.." రామం.

కిలకిలా నవ్వింది రూప.

నవ్వుకున్నారు యిద్దరూ.

# ఆనందత్రయము

## లౌకికానందము-కావ్యానందము-ఆత్మానందము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

### లౌకికానందము

మన మొక కొంపెనుగాని కోరిన వస్తువునుగాని చూచి సంతసింతుము. పసిపాపల పలుకులు గాని కోయిలల యెలుగులు గాని విని సొగియుదుము. అగలు పొగలు గాని పూతావిగాని మూర్కొని మురియుదుము. తేనియలు క్రోలిగాని భక్ష్యముల నారగించిగాని తనియుదుము. మలయమారుతస్పర్శవల్ల గాని మిత్రుల యాలింగనమువల్ల గాని మేమరతుము. ఈ సుఖమెల్ల జ్ఞానేంద్రియములవల్ల.

కర్మేంద్రియములచేగూడ నిటులే మనకు సుఖము కలిగించు వస్తువులు విషయములు. కాగా మన మనుభవించునది విషయసుఖము. లేక లౌకికసుఖము.

ఇంద్రియములగుండ మనస్సునకు విషయములతో గలుగు సంబంధమునకు వృత్తి యని పేరు. విషయముల కింద్రియములతో సంబంధమున్నను మనస్సు వేరొకచో నుండెనేని విషయజ్ఞానమే కలుగదు. ఇక సుఖమెట్లు కలుగును? దీనివల్ల సుఖమనుభవించునది మనస్సని తేలినది.

అన్ని వస్తువులవలనను అందరకును సుఖము కలుగదు. జంతుభేదమువలన స్వభావభేదమువలన కొన్ని వస్తువులవల్లనే కొందరికే సుఖము కలుగును. 'తలకొక బుద్ధి; నాల్కకొక రుచి' అని సామెత. మరియు విషయము లేనిదే లౌకికసుఖము లేదు.

“గోవిందా యనుకొందమా గొబ్బరి తినుకొందమా, నారాయణాయంచు నమలికొందమా” అను పాటలో చెప్పినటులు సుఖసాధనమగు ఆహారమును ప్రీతితో నమలి భుజింతు మనుకొందము. నములుటతో పాటు ఆహారము స్వాద్యమై నమలినకొలది సుస్వాద్యమై రసమగుచున్నది. అపుడు రసముగాని సత్త్వముచే పడునై ఏకాగ్రమైన చిత్తమునందు స్వాత్మానందము ప్రతిబింబించును. విషయోపభోగమునం దెల్లెడ నిదేరీతి.

వేరొకరీతి—విషయలబ్ధి కలిగి కోరిక తీరగా చిత్తవృత్తి సాత్త్వికమై యేకాగ్రత చెందును. అపుడు దానియందు స్వాత్మానందము ప్రతిఫలించును. ఈ ప్రతిబింబానందమే విషయానందము. అనుభవసమయమునందు చిత్తవృత్తికిని చైతన్యమునకును సంబంధముండును గాన ఆ సుఖము అంతఃకరణవృత్తితో గూడిన చైతన్యస్వరూపము. తాతగారి మాటలలో నిది యిటుల చెప్పబడినది:—

శా. ‘ఎందే డెందము గందళించు రహిచే, నేకాగ్రతన్
నిర్వృతిం జెందుం గుంభగత ప్రదీపకళికాశ్రీ దోఁప
నెందెందుం బోకెందే నింద్రియముల్ సుఖంబుగను...’

ఈపద్య మింతవరకే ఉపయోగించుకొనవలెను. ఈసుఖము ‘పంచకోశవివేకముచే మిథ్యాత్వది యగునా కాదా? ఇది అంతర్బుద్ధి నూహింపుమా’ అని ఆవరూధినికే వదలుము.

సుఖమందరకును అనుభవమే. కాని దానికి లక్షణము చెప్పుమన్న చెప్పుటకు తటపటాయించవలెను. ‘యదర్థమ్ సర్వమ్’, యచ్చనాన్యార్థమ్, తత్ సుఖమ్’ అని సుఖమునకు లక్షణము. ‘మన ప్రవృత్తి యంతయు దేనికొరకో అది సుఖము. ప్రతివాడును ఏపని చేసినను అది సుఖముకొరకే కదా. మరియు ఏది మరొకదానికి ఉపాయము కాదో అది సుఖము.’ అనగా సుఖమే ఉపేయము. అనగా ప్రాప్యము. దానికి మరియొక ప్రాప్యము లేదు.

ఈ విషయసుఖాతిశయమును (ముక్తిగా మోసగించుచు) తెనాలి రామకృష్ణకవి—

సీ. కీలారమునునుండి పాలింటికే తేర
బహుధాన్యములు చేలఁబండి యొఱఁగ
యొడనెడఁ బెండ్లిండ్లు వడుగులు వోడముఁ
గృతార్థులై యర్థించు నర్థులలరఁ
బరిచారికాకోటి పనిపాటు పాటింపఁ
జుట్టంపు సందడి నెట్టుకొనఁగ
గ్రామమెంతయు నిజప్రాభవంబున మన
సత్యనిష్ఠకుఁ దన్ను సాక్షిగొర
గీ. నిత్యనైమిత్తికములు నిశ్ఛిద్రబుద్ధి
నాచరించుచు హరిభక్తి నాత్మభార్య
భక్తినిడ భుక్తిఁగొను మక్కి ముక్తిగాని
నిదురవంటిది రాతివంటిదియుఁ గాదు

అని ఒక కరణము సుఖమో — దేశపాండ్యా సుఖమో గొప్ప ఆనందముగా చెప్పెను. (ఇది గౌణాత్మ) తైత్తిరీయ మిట్టుల చెప్పెను— ఆరోగ్యము బలము దార్ఢ్యము, చదువు, ఇవి కల పిన్నవానికి పృథివి యెల్ల యున్నచో నొదవు ఆనందము ఒక మానుషానందము. ఈ యానందము గూడ ఆరోగ్యాదులలో నేవి పోయినను పోవును గాన అల్పము. దాననే — 'యోవైభూమాతత్ సుఖమ్, నాల్పే సుఖమస్తి' అని సనత్ కుమారుడు. అనగా ఏది పరిపూర్ణమో అది సుఖము; అల్పము సుఖము కాదు. కాన దీని తెలియుటకు ముందు కావ్యానందం లేక రసానందము కనుగొందము.

## కా వ్యా నం ద ము

పూర్వమొక పండితుడు — 'ఇంతమంది పండితులు రసమును గూర్చి తలాయొక రీతిగా తట్టెడు గ్రంథములు వ్రాసిరి. నేను సులువుగా చెప్పెదను వినుడు—

గీ. 'పాలు గ్రోలెడు మార్జాల పరివృఢుండు'

అని చెప్పెనట. 'ఇందు రసమేమి కలదండీ ?' అని అడుగగా 'పాలకు మించిన రసమెక్కడ నున్నదయ్యా?' అని అనెనట. 'సరే పద్యమునకు నాలుగు పాదము లుండవలెనే' అని అడుగగా 'పిల్లికి లేవటయ్యా' అనెనట? కాగా రసమీమాంస పిల్లి పాలు కావలసివచ్చెను అది యటుండె.

మనకిపుడు తీరికయు ఓపికయు లేదు గాన కావ్యాంగణములో గాక నాటకరంగములో ప్రవేశింతము. పుష్పోద్యానములో అదుగో ఇరువురు. ఒకడు యువకుడు, ఒకర్తు యువతి. ఆమె తళుక్కను క్రీజూపునే అతనిపై తూపుగా విసరెను. అతని నెమ్మోము పనసకాయ యాయెను.

వీరు వలపుగొన్నారని మన కొకరు పాఠము చెప్పవలెనా!

అదుగో—ఇరువురు! కన్నులలో నిప్పులు! కంఠములలో పిడుగులు! వారుగో మల్లసరచుచున్నారు! వీరు క్రుద్ధులని వార్తాపత్రికలు చూపవలెనా! నిట్టూర్పులతో విరిసిన వెంట్రుకలతో కన్నీటితో మింటి మోమై ఇతర మెరుగని ఒక డిదుగో! ఇతడు శోకదగ్ధుడని రాలకు రప్పలకును దెలియును. ఇతడింకొకడు. విప్పు కనులు. ప్రసన్నమగు మోము. రెప్పార్పని చూపు. ఆనందాశ్రువులు. పులకలు. అనిశ్చలత. ఇతడు విస్మయావిష్టుడు కాడా? మేన చెమరుతో కదలు కనీనికలతో ఎండిన ఓష్ఠములతో గద్గద కంఠములో వడవడవణకుచు ఇదె పోవువానిని చూచి—మన మాట వినిపించుకొనకున్నను 'భయము వలదని' ఆశ్రయమీయకుందుమా?

వీడుగో ఒక మీసము పైకి మరొకటి క్రిందికి! పాగాపై రొట్ట, మోకాల సొట్ట! ముక్కుమీద బొట్టు, ఎగుడుదిగుడు కట్టు! ఇట్టి ఇతనితో మనము శ్రుతి కలుపకున్న నవ్వపోరా?

అదె బూడిద బుస్సను నేల! గద్దలు, గోళ్లకు మెలివైచిన ప్రేవులను ముకుపట్టుకొరులతో లాగుచున్నవి! కాలుచున్న తలనుండి మెదడు, నురుగువలె వెలికుబుకుచున్నది! ఈ స్థితి చూచి నీ వేమగుదువో! ఓహో! ఎట్టి జుగుప్స నీకు!

సముద్రమువలె గంభీరతా రామణీయకము లితనిలో! ఎదిరిని చూచి 'నీకీ భ్రాంతి యేల? నేటికే నీ మంచిదారికి రా! రానిచో ఇదె నా భుజము కోరలు లేని త్రాచు' అని అనుచున్నాడు. కర్తవ్యార్థములందితడు పట్టినపట్టు విడువడని ఉడుములకును తెలియును!

ఓహో మనుష్యరూపమగు నిదెక్కడి తేజము! గోచిపాతరాయడు. ఏకాగ్రదృష్టి! పిల్లలు వెంటబడుచున్నారు! ఇతనికి చేతులు తమంత తామే మోడ్చును.

పరుల మనోవికారములకు స్పందించుట అనగా హృదయసంవాదము చెందుట మానవస్వభావము. దీనికి సంస్కారము బీజము.

శబ్దశక్తియు అర్థశక్తియు మనకు తెలియు ననుకొనుడు—భావనాశక్తియు వానికి తలకట్టుగా గలదు—ఇట్టి మనము ఒక కవి చక్కని సన్నివేశములచే నాయికాదులను, కటాక్షపాతప్రపాతాదులను, హర్షచింతాదులను, వర్ణింపగా, నటీనటుల వాగంగసత్త్వాభినయద్వారమున, వినుచు కనుచు—న్నాము. వీనిలో నాయికానాయకాదులు, వారి కటాక్షాదులు, ఉద్యానాదులు, మన హృదయమున ప్రతిబింబించుటతో పాటు రస మంకురించెను. అనగా మనలోని రాగాది వాసన మేలుకనెను. ఇపుడు సీతారాములో శకుంతలా దుష్యంతులో వారివారి కటాక్షాదులో అశ్రుపాతాదులో కార్యకారణములతో తమతమ సంబంధమునకు చెల్లుచీటి యిచ్చిరి. ఇపుడు వీనిని విద్వాంసులు విభావములనియు అనుభావములనియు నందురు. రాగాది సహకారులగు హర్షామర్షాదులు విభావానుభావములచే వ్యక్తములగుచో వ్యభిచారులందురు. మనము వీనిని విభావనము అనుభావనము సంచారణము చేయుదుము. ఇవి అలౌకిక వ్యాపారములు. వీనికే సాధారణ, చర్వణ, స్వదన, భావన, వ్యంజన అని పేళ్లు. మన మిపుడు రసానందములో మునిగితిమి. ఇపుడు నాయికాదులందును, వారి చేతలందును, చిత్తవృత్తులందును పరత్వముగాని, మమత్వముగాని, పరకీయత్వముగాని స్వకీయత్వముగాని లేదు. మన యీ రసానుభవ వేళ విభావాదిత్రయము రత్యాదివిశిష్టమై మిలితమై అభిన్నమై యున్నవి. ఇచట ఈ ఉద్దాలకుని మాట గమనింతము—'తేనెటీగలు నానాపుష్పముల నానారసముల నేకరసత్వ మొడగూర్చుచున్నవి. ఆ తేనియలో ఇది మావిపూరసము, ఇది మాలతిపూ రసము, అని వేరుపరుప లేము'—'యథా సోమ్య మధు మధుకృతో నిస్తిష్ఠంతి నానాత్యయానాం వృక్షాణాగ్ం రసాన్ సమవహార మేకతాగ్ం రసం గమయన్తి। తే యథా తత్ర న వివేకం లభన్తేఽముష్యాహం వృక్షస్య రసోఽస్మ్యముష్యాహం వృక్షస్య రసోఽస్మీతి [ఛాం.-6 9]

ఈ రాగక్రోధహర్షామర్షాదులు వాసనలు. ఇవి సాక్షిభాస్యములు. లౌకికములగు రాగక్రోధ హర్షామర్షాదులో చిదాభాసభాస్యములు. కావున వానిలోని క్రోధామర్షాద్యనుభూతిలో క్రోధాదులే గాని ఆనందము లేదు. లౌకిక రాగహర్షాదులం దేని కావ్యానందమువంటి ఆనందము లేదు.

మంచి నాటకము చూడ మొదలిడుటతో ఇతర వృత్తులు పోయి హృదయసంవాదము కలిమి నాయికానాయకులయు గాని నాయక ప్రతినాయకులయుగాని అనురాగక్రోధములచే మనలోని అనురాగక్రోధములు మేలుకొనును. ఇచట మనము ప్రేమించుటకు స్త్రీలును ద్వేషించుటకు శత్రువులును లేరు. కవి పుణ్యమా యని స్త్రీలు, శత్రువులు మొదలగువారు లేకుండనే కవి ప్రవేశపెట్టిన బొమ్మలమాటున మనలోని రాగ క్రోధ హాస శోక భయోత్సాహజుగుప్సావిస్మయ నిర్వేదాదు లుద్బుద్ధములై మేళకర్తలగుచున్నవి. ఇవి మాత్రమే యేల? రసానుభవ విశ్రాంతి ప్రధానముగా ఇట వేగమక. ఎంత వింత! ఈ యలౌకిక వ్యాపార మావరణమును తొలగించినది. ఇపుడు స్వప్రకాశమగు ఆత్మ సాక్షియై యీ అలౌకిక రాగాదులను ప్రకాశింపజేయుచున్నాడు. అలౌకిక మగు ఈ రత్యాదికము సాత్త్వికముగాన స్వస్వరూపానందముతో కలిసి మనకు గోచరమైనది. భక్ష్యభోజ్య చోష్య లేహ్యములను నమలి ఆస్వదించి రసముగొని ఆనందించినట్లు విభావాదులచే అంకురితమైన కావుననే అలౌకికమైన యీ రత్యాది స్థాయిభావములను అనుభావసాత్త్విక భావ సంచారిభావములతో నమలి—భావనచేసి—చర్వణ మొనరించి రసముగొని మన మానందించుచుంటిమి.

ఈ రసము జ్ఞాప్యమును కార్యమును నిత్యమును అనిత్యమును భానము కలదియును లేనిదియును వర్తమానమును భూతమును భవిష్యమును సవికల్పక నిర్వికల్పక జ్ఞానవిషయమును పరోక్షమును ప్రత్యక్షమును కాదు. లోకమం దిట్టిది లేదు. పోనిండు! అసలిది లేదందమా? కలదనుటకు సహృదయుడెల్ల సాక్షి. కాన నిది అలౌకికము. విషయానందముకంటె భిన్నము. విషయములు లేకుండ నీలోని రాగాదులను నీవు చర్వణ మొనరించి సాక్షివై ఆనందించుచుండుట లేదా? ఇక జాలు.

ఈ యానందముగూడ చర్వణావసానంతరముననే అంతమగునుగాన నిదియు నల్పము. కాన నిపు డాత్మానందమును అన్వేషింతము.

# ఆనందత్రయము

## ఆత్మానందము

బృహదారణ్యక మీయాత్మానందము నెంతో సుందరముగ నిరూపించెను. యాజ్ఞవల్క్యుడు అమృతత్వమును గోరు మైత్రేయి కిటులు చెప్పెను — పత్నికి పతి ప్రియుడంగురు. దానికి కారణము పతి కాడు! మరి యేమి? పతిలో పత్ని తన స్వరూపము చూచుకొనును గావున నే పతి ప్రియుడు. ఇటులే పతికి పత్ని ప్రేయసి అనిఅంగురు. దానికి కారణము పత్ని కాదు. మరి యెవరు? పత్నిలో పతి తనస్వరూపమును చూచుకొనును గావున నే పత్ని ప్రేయసి. కాగా తేలిన దేమి? 'ఆత్మయే ప్రియతమ మని' ఆత్మ సంబంధము లేనిచో నేదియును ప్రియము కాదు' అని. ఆత్మప్రీతి కొక కారణము లేదు. విషయప్రీతికో సుఖము కారణము. అది ఆనందముయొక్కయే ప్రకాశము.

విశ్వ మెల్ల తన రూపరాశిచే మన ఆత్మలోని ఆనందమును మేలుకొల్పును. ఈ రూపరాశిలో మనము విశ్వాత్మనే చూడబడగునది. కావున ఈ రూపరాశి ఆత్మయొక్కయే విశ్వరూపము.

ఏ యానంద మీ విశ్వమూలమునందో ఆ యానందమే మన హృదయారవిందమందు — 'కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాద్య దేష ఆకాశ ఆనందో న స్యాత్' హృదయగుహాయం దానందము లేనిచో ఎవడు ఊర్చును? నిట్టూర్చును? అనగా బ్రతుకును? అని తి త్తిరి. ఆ యానందమే ఇటు రమాత్మ.

'ఆత్మ ఆనందము కావుననే దాన నిరతిశయ ప్రీతి. ఆ యానందమే ఆత్మ. ఇటులు పరమాత్మ.

ఆత్మ ఆనందము కావుననే నిరతిశయప్రీతి! మన కానందము వలయును! ఏల? మన స్వరూపము ఆనందము కావున.

ఆత్మని విశ్వరూపము విశ్వప్రీతికి నిదానము. విశ్వప్రీతి కాత్మప్రీతి పునాది. కాన ఆత్మ అందరి కంటె అంతరతరము. దాన ఆత్మపుత్రునికంటె విత్తము కంటె మరి యన్నిటికంటె ప్రియతరము. ప్రియతరము కావుననే ఆనందము.

మనకు బాహ్యవిషయములతో సంబంధము కలిగినపుడు ఆయాయీ వస్తువుల జ్ఞానము చిద్రూప మని తెలియవచ్చును. ఆత్మ ఆనందరూపమేని ఈ చిత్తవృత్తులలో చిద్రూపము తెలిసినటులు ఆనందరూపము ఏల తెలియదు?

మన యింద్రియము లేకైక గుణగ్రాహులు కన్నే రూపము గ్రహించును చెవియే శబ్దము నెరుగును. అటులే చిత్తము సత్త్వవృత్తిచేతనే ఆనందమును పొందును చిత్తమునందు సత్వరజస్తమస్సులు చక్రనేమిక్రమమునను, అక్రమముగను తిరుగుచుండును. సత్వవృత్తి కాదాచిత్కము. అది మాత్రమే ఆనందగ్రాహకము. రజోవృత్తి మలినము. కాన ఆనందాంశము తిరస్కృతము. సత్వవృత్తిలో ఇచ్ఛ లేదు. అది శుద్ధము. కాన అందు చిదానందైక్యము గోచరించును.

'రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి' అని తిత్తిరి. అనగా—అతడు రసమే. జీవుడు రసమును పొందియకదా ఆనంది యగుచున్నాడు.

సారము, లేక స్థిరాంశమే, రసము; దాని గ్రోలియే మన మానందింతుము. విషయసుఖమునం దిది విశ్వజనీనము.

నిద్రలో విజ్ఞానఘనోపాధికుడగు ఆనందమయుడు సూక్ష్మములగు అజ్ఞానవృత్తులచే ఆనంది యగును. అపుడతడు సాక్షియు భోక్తయు. కావుననే అతడు—'సుఖముగ నిద్రించితిని; ఏమియు నెరుగను' అని మెలకువ గలిగి అనును. 'సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్ చేతోముఖః' (మాం—1 5)

ఆవరణము లేమియే ఆనందము. ఆనందసంవేదన మిందు లేదు. అదియు ఆనందస్వరూపము. కాగా ఆవరణము లేని ఆత్మ ఆనందము. కావున ఆత్మనే ఉపాసింపవలెను—'ఆత్మాన మేవ ప్రియ ముపాసీత' [బృ—1 4 8]

ఇటులు కాక 'నేను వేరు, దేవుడు వేర'ని తలచువాడజ్ఞుడు; వాడు దేవతలకు పశువు—'అన్యోఽసా వన్యోఽహ మస్మీతి, న స వేద, యథా పశురేవం స దేవానామ్' [బృహ 1 . 4 . 10] ఇటులు ఆత్మయే బ్రహ్మము ఆత్మానందమే బ్రహ్మానందము. అఖండమగు ఆత్మాకారచిత్తవృత్తి కలుగుటయే ఆవరణనాశము. ఆ చిత్తవృత్తి క్రమక్రమముగా ఆత్మహత్య చేసికొనుడు నిర్మలమును నిస్తరంగమును అగు ఆనందము! విషయలబ్ధివల్ల చిత్తము సాత్త్వికమై ఏకాగ్రత చెందగా, అందు ప్రతిబింబించిన స్వాత్మానందమే విషయానందము లేక లౌకికానందము

విషయములవల్ల చిత్తము సత్త్వము చెంది ఏకాగ్రత పొందగా అందు ప్రతిబింబించిన స్వాత్మానందమే లౌకికానందము.

కవివ్యాపారముచే ఏకాగ్రమైన చిత్తమున మేలుకనిన రాగాదివాసనలతో కలిసి భాసించు శుద్ధచైతన్యానందమే రసానందము, లేక కావ్యానందము.

చిత్తవృత్తులు భస్మీభూతములు కాగా ఉన్మన్యవస్థలో శేషించిన ఆనందమే ఆత్మానందము.

# భ్రాంతి

శ్రీ జో. రమాకాంత్

కాన్వకేషన్' వట్టి పనికి మాలిన లాంఛనమని, మూర్తి తీవ్రముగా వాదించువాడు. తన బి.ఏ. డిగ్రీ పంతమునకు 'పోస్టు' ద్వారా తెప్పించుకొనెను. ఈసారి వెడలినచో స్నేహితులెగతాళి చేయుదురేమోనని కూడ స్ఫురించలేదు. ఎందుకు స్ఫురించును? తానేమియును మారలేదు. 'కాన్వకేషన్' ఒక సాకు మాత్రమే...తన ప్రయాణము తనకే హాస్యాస్పదముగా నుండెను.

మృదంగ నినాదముతో రైలు సాగిపోవుచుండెను. ఆ పెట్టెలో యితరులెవ్వరును లేరు. అది యాషాఢమాసము. శుక్లపక్షము. ఆకాశము మేఘావృతమై యుండెను. అప్పుడప్పుడు సన్నని తుప్పర పడుచుండెను. నీటి తెరలవెనుక ప్రకృతి నగ్న సౌందర్యము మిక్కిలి ముచ్చటగ నుండెను. ఆ వాయువుల వెట్టి మైకములో లీనమై యాతడు ప్రస్తుతమును మఱచి పూర్వమును తలచుకొనుచుండెను...

ఆతనికి చిన్ననాటి నుండియు స్నేహితులు తక్కువ. నిత్యము సముద్రమున కేగెడివాడు. దూరమున నున్న గుట్టలలో నొక బండపై గూర్చుని యేవేవో, యెన్నెన్నో ఆలోచించెడివాడు. వానిలో చాలభాగము లోకము కసితీరా నిర్మూలించెను. మిగిలిన వాటిని జీవితము బలికోరెను .. ఆ ప్రాంతములకే కమల కూడ వచ్చెడిది. ఇసుక తిన్నెలపై యొంటరిగ గూర్చొని యేదో దీర్ఘముగ యోచించుచుండెడిది. మొదటిలో నటువైపు తిరుగుటకే బిడియపడువాడు. ఆవిడకూడ చూడనట్లు ప్రవర్తించెడిది. త్వరలోనే లజ్జపోయెను. అప్పుడప్పుడామె రానిచో కొఱతగానుండెడిది. కాని యా కొఱత యెటువంటిదోనని తర్కించలేదు...ఒకనాడు ఆమె అకారణముగ, హఠాత్తుగ, చిలిపిగ నవ్వెను. నరములన్నియును సర్దుకొనుటకు గాబోలు, యొడలంతయు విఱచుకొనెను. చెరగని పాపటను సవరించెను సరిగానున్న పైటనే సర్దెను. మూర్తి యొడలు జలదరించెను. మనస్సనేక వికారములు చెందెను అంతులేని యాలోచనలెన్నియో చెలరేగెను.

“పురుషుడు స్త్రీని చూచిన వెంటనే పొందు అసంపూర్ణ భావ రాగానుభూతియే ప్రేమయనియు, యయ్యది క్షణికమైనను పరిపక్వము నొందజాలకపోయినను, జంతు ధర్మము నతిక్రమించు నొక మనోభావమని జ్యూలె రోమె ( *Jules Romain* ) నిర్వచించెను. ఈ భావము పురుషునకు ప్రతి స్త్రీయందును జనించదు. నాగరికరైన యందకత్తెను చూచినచో కలగవచ్చును. మూర్తి కమలను నిత్యము చూచుటలో చూచి ముచ్చటపడుటలో నాశ్చర్యములేదు కమలనాతడు ప్రేమించెనా? దానికి సమాధానము లేదు. ఆమె యెవరో తెలిసికొన యత్నించెను. అవివాహితయో, వితంతువో గావలెనని యూహించెను. కాని యనుభవము లేకనో, ధైర్యము చాలకనో, సిగ్గువల్లనో యామెను పలుకరించలేదు. ఆమెను వాంఛించెనా? ఔననుటకు వీలులేదు కాదనుట సత్యముకాదు. మరి యిప్పుడు వికారమేల చెందవలెను? సాధారణముగా నొక వ్యక్తిని చూచినపుడు, యాతని వేషభాషలను బట్టియో, యాతని ప్రవర్తన, పగపతి, గౌరవము, తదితరలక్షణములనుబట్టియో, స్థూలముగ నిట్టివాడనుకొందుము. కొన్ని గుణములను కల్పింతుము. వాని సత్యాసత్యములతో నిమిత్తములేదు. భావనాప్రపంచమున నొక మూర్తిని సృష్టింతుము. ఆతడు యీమూర్తి కెంత భిన్నముగ ప్రవర్తించినను, పోలికలనుజూచి మురియుదుముగాని సామాన్యముగ తొలిభావమును సంస్కరింప సాహసింపము. ఇది మానవప్రకృతి. కాదు వికృతి. ఈ భిన్నత్వమే మూర్తికి హఠాత్తుగ గోచరించెను. కాని నమ్మలేదు. సత్యమును నమ్ముట యంత సులభముగాదు. దాని కనుభవ ముండవలెను. ఆతనికి సంశయముమాత్రము పొడచూపెను. దిగ్భ్రాంతి నొందెను. ఆమెను మఱల చూడనెంచెను.

సంధ్యచీకట్లు క్రమ్ముచుండెను. ఆమె చిరునవ్వు నవ్వుచున్నట్లు చూచాయగ నగుపించెను.. కాదు కాదు. ఇదియంతయు తన భ్రాంతియే! ఏదియో కీటకము ఆమె తలపై బడవచ్చును. వీపుమీదికి దూకవచ్చును. పయ్యెదపై వ్రాలవచ్చును. దానికామె నవ్వవచ్చును... కాదు. ఆమె తొలుతనే నవ్వెను... ఆమెదసలు నవ్వుముఖము... చీకట్లు ముదిరెను. కాని మనశ్శాంతి కుదురలేదు. ఆమెవద్దకుబోయి పరీక్షింపవలెనని బయనమయ్యెను. కమల యచ్చటలేదు.

ఆనాటిరాత్రి యాత డొకచిత్రమైన కలగనెను. అదొకయడవి. గాలివాన. అక్కడక్కడ చెట్లనీడను కొందరు తలదాచుకొనుచుండిరి. ఆతడు ఒంటరిగ సాగిపోవుచుండెను. బాటయంతయును నీటితోడను విరిగిపడిపోయిన చెట్లతోడను నానాభీభత్సముగ నుండెను. ఇంతలో పిడుగుపడెను; ఒక చెట్టు దానియందున్న వారిమీదకి కూలెను. తప్పించుకు బయట బడగల్గిన దొక్క స్త్రీమాత్రమే! సహాయార్థ మామె కడకు పరుగెత్తెను. పరీక్షించిచూడ యామె కమల! వెంటనే చేతులలోనికి తీసికొనెను. ఆమె గుర్తుపట్టెను గాబోలు, చిరునవ్వు నవ్వెను. మరుక్షణ మేమి తోచెనో యేమో, చేతులు వదల్చుకొని యడవిలోని కదృశ్యయయ్యెను. 'కమలా' యని యులికిపడి మేల్కాంచెను. ఆరాత్రియంతయును కలతనిదురే.

మరునాడు యథాప్రకారము సముద్రతీరమున కరిగెను. సూర్యాస్తమయము సరికి కమలకూడ వచ్చెను. చిరునవ్వు నవ్వుచు యాతనివద్దనున్న వేరొక బండపై జతికిలబడెను. ఆతనికి ముచ్చెమటలు క్రమ్మెను. ఏవగించుకొనెను. ఒక వస్తువును కాంక్షింతుము. దానిని పొందుటకు ప్రయత్నించెదము. విచారించెదము. బాధపడుదుము. తుదకు సాధించినపుడు ఆనందింతుము. అయ్యది యప్రయత్నముగ లభించినచో నిరసింతుము. అంత సులభసాధ్యముగుదాని నాశించినందుకు సిగ్గుపడుదుము. మూర్తి యామె స్నేహము వాంఛించెను. కాని తనకు తానై వచ్చినపుడు జుగుప్సాభావము కలిగెను. ఆ భావ మామెయందు కలిగెనో లేక తన యూహాప్రపంచపు కమలకును, యీ ఆమెకును గల ప్రస్ఫుటభేదమును గుర్తించుటవలన కలిగెనో యనిశ్చితము... ఆమె చిరునవ్వు నవ్వుచుండెను. ఏమనుటకును నోరాడలేదు. ఏమి చేయుటకును తోచలేదు. వెంటనే యటనుండి వెడలిపోయెను.

తరువాత మరల సముద్రమునకు పోలేదు.

*   *   *

...మధురస్మృతుల మైకములో తన యొంటరితనమును గూడ మరచెను.... ఈ సంవత్సరపు జీవిత మాతని బూర్తిగ మార్పివైచెను. తానభిలషించిన స్త్రీ కలచివచ్చినపుడు పిచ్చిభ్రమలుపడి బెదరిపోయిన మూర్తికిని యీతనికిని పోలికలేదు. ఈతడు స్త్రీ కుతూహలమును మిక్కిలి సులభముగ పసికట్టగలడు. చాకచక్యముతో యభీష్ట కామమును సాధించును. 'కాన్వకేషన్' అని తెలిసినవెంటనే కమల జ్ఞాపకమువచ్చెను. ఏ వేవో కలలు! ఎన్నెన్నో భ్రమలు! ప్రయాణ సం      ను. ఈమార్పునకు కారణము గలదు. ఏవూరియందైనను తన స్నేహము నాశించువా రనేకులుండెడివారు. అట్టి యొకడు తటస్థించెను. వానిలోను వాని భార్యతోడను యేవేవో కబురులు చెప్పుకొనుచు 'టీ' సేవించెడివారు. తాను మాటలాడునపుడు యువతి శ్రద్ధగ వినుచుండెడిది. వెకిలిగ వ్యంగముగ నవ్వుచుండెడిది... ఒకప్పుడామె కాలు తగిలెను. వస్తుతః నమాయకుడు, వెంటనే తన కాలు వెనుకకు లాగుకొనెను. ఆమె బిగ్గరగా చిలిపిగా నవ్వెను. ఆతనికి చెప్పరానంతభయము వైచెను. గుండె దడదడలాడెను. తన స్నేహితునిజూడ నాతనికిది తెలియునో తెలియదో నిర్ణయింపరాకుండెను...... తరువాత కాలు తగులుచునే యుండెడిది. ఒకనాడు చీకటిపడినపిదప యెందులకో మూర్తి వారింటికి పోయెను. ఆయన 'సినిమా'కు వెళ్లిరని చెప్పెను. తిరిగివచ్చుచుండ 'పోతున్నారా' యని దీనముగ ననెను. ఆతడు వెనుకకు తిరిగిచూచెను. ఆ క్రీగంటి చూపులు, తొలికిరణముల వెలుగుతో మందహాసము తాండవించుచున్న చిరుపెదవులు, భీతితో, ఆసక్తితో, యానందముతో యదరుచుండిన డెందము ఆతని హృదయాంతరాళమున దాగియున్న బడబాగ్ని నొక్కపెట్టున రెచ్చగొట్టి, రక్తము నుడికించి, యున్మత్తుని గావించెను......

మూర్తి వట్టిపిరికివాడు. ఆపిరికి తన మెందు బోయెను. పూర్వము కమల యాతనిపొంత గూర్చుండుటయే నసహ్యించుకొనెను. ఆ యసహ్యమేది? ఈ తారతమ్యమేమి? వీనికి సంబంధము గలదా?

కమలవద్దనుండి తానెందుకు వెడలిపోయెను? ఇంటికి పోయినపిదప తాను ప్రవర్తించిన విధానమంతయును సావధానముగ విమర్శించి యుండవచ్చును. హఠాత్తుగ సంభవించిన సంఘటనకు భీతినొంది, తబ్బిబ్బైన నొక యనుభవశూన్యుని వెంగలితనమని భావించి యుండవచ్చును. జరిగినదానికి విచారించి యుండవచ్చును. అవగా యింకొకసారి యన్యథాప్రవర్తింప వలెనని తనలో తాను నిశ్చయించుకొనెనన్నమాట. ఇప్పుడు సాహసించెను. నిద్రాణమైయున్న ఆతని కోరికఫలించెను.

* * *

...రైలు వేగము తగ్గెను. ఎఱ్ఱనిది పచ్చనిది దీపము లగుపించుచుండెను. ఈ 'స్టేషన్'లో నైనను యెవ్వరైన వత్తురని యాశపడెను. కొంతసేపటికి రైలాగెను. చింపిరితల, ఎఱ్ఱకళ్లు, గుండీలు లేని చొక్కా, మాసిన ధోవతితో యెవ్వడో ప్రవేశించెను. మూర్తి కాతని నెక్కడో చూచినట్లనిపించెను. పలుకరించి తెలుసుకొననెంచి, 'ఎక్కడిదాకా నండీ?' యనెను. వెంటనే యాతడు చిరాకుగా మురమురా చూచుచు, మూటముల్లెలు సర్దుకొని వెడలిపోయెను. మూర్తి కొంచెము భయపడెను.

ఆతని ముఖ మచ్చుగుద్దినట్లు కమలదని, హఠాత్తుగ స్ఫురించెను. దిగి చూచెదమనుకొనుచుండగనే రైలు బయలుదేరెను.

రైలుబండి యథాప్రకారము సాగిపోవుచుండెను. జరిగినదంతయును కలయేమో ననిపించెను. కిటికీనుండి వెనుకకు చూచెను. దూరమున నున్న 'స్టేషన్' లాంతరుతప్ప మరేమియు నగుపించుటలేదు. అప్పటికి చంద్రుడస్తమించెను. కారుచీకట్లలో నా సన్ననిదీప మాతనికేవో యసంపూర్ణ భావములు రేకెత్తించెను. ఇంతలో దీపము రెపరెపా కొట్టుకొనెను. మఱల ప్రకాశించెను. అసందర్భముగ నారిపోయెను —రైలు కంపుతిరిగెను.

సాయంకాలమే చేరవలసిన రైలు, ప్రొద్దుపోయిన పిదప కాని గమ్యస్థానము చేరలేదు. త్వరత్వరగ సామానంతయును విశ్రాంతి గదిలోనికి చేర్చి, మూర్తి, యత్యంతమైన ఆశతోను, ఉత్సాహముతోను బయలువెడలెను. అవి వెన్నెలరోజులు. కమల మేడపైనుండి వీధివంక చూచుచుండెను. దూరముననుండియే మూర్తిని గుర్తించెను. మత్తుగ కన్నులుమూసి తల వాల్చెను. లేవెన్నెల విరజిమ్మ చిరునవ్వులు వెదజల్లెను. ఆతడు పట్టరాని సంతోషముతోను, ఉద్రేకముతోను తబ్బిబ్బయ్యెను. రెండంగలలో కమల యెదుట వ్రాలెను.

కమలనుచూచి తన దృష్టిని తాను నమ్మలేకపోయెను. ఆమె ముఖము చాల కటువుగాను, తీక్ష్ణముగానుండెను. పొఱపాటు జరిగినదేమోనని తడబడెను. ఇంతలో 'ఎవరు మీర'ని యామె సూటిగా ప్రశ్నించెను

నిజమే! తనెవరు? ఇంతమటుకు నాతని నట్లు ప్రశ్నించినవారు లేరు. తానెవరో తెలియదా? ఎట్లు మఱచిపోగలదు ఐనను తానెవ్వరైననేమి? దానితో నిమిత్తములేదుగదా. కాని సమాధానము చెప్పవలెను. జంకుచు 'నేనెవరో తెలియదా' యనెను.

ఆమె కలవరపడెను. తెలియకేమి. తెలియును. పాపము తన కర్మ కాతడెట్లు బాధ్యుడు. ఆతని బెదురుచూచి కరగిపోయెను. తన తొలి సన్నివేశములు జ్ఞప్తికివచ్చెను. తన చరిత్ర యంతయు కన్నుల యెదుట తాండవించెను. చెప్పరానికోపము పట్టరాని యావేశము, ఆపలేని దుఃఖము కలిగెను. 'మీరు పొరబడ్డారు. వెళ్ళిపొండి. వెళ్ళిపొండి' యని చకచకా లోనికిపోయెను. మూర్తి కంతయు నగమ్యగోచరముగ నుండెను. కాని యామెను వెంబడించెను.

వసారా పడకగది దాటి యామె సరాసరి వెరాండాలోనికి పోయెను. దీక్షముగ నేలవంక చూచుచు నిలుచుండెను. మూర్తి వసారా ప్రవేశించి నలుమూలల చూచెను. ప్రసిద్ధ చిత్రకారులు గీచిన బొమ్మలతో నలంకరింపబడియుండెను. ఆతని దృష్టిని తూర్పుననున్న నొక చిత్ర మాకర్షించెను. అది నట్టడివి. కారుచీకటి. వర్షము కురిసి వెలిసినట్లు ఆకు లన్నియును వాలియుండెను. ఒక చెట్టుక్రింద సమిథల మీరుమంటకు యిరువురు వ్యక్తులు చలికాచుకొనుచుండిరి. ఒక పిట్ట మంటలో మసిచాయగ నగుపించుచుండెను. ఇంకొకటి యందు దుముకుచుండెను... మైమఱచి కొంతతడవట్లే చూచుచు నిలుచుండెను... బల్లమీద నొక చిత్రపటముండెను. అందలి స్త్రీ కమల కావచ్చును. బాలుడు ఆమెను పోలియుండెను.

కొడుకో తమ్ముడో కావలెను దానిపై నీటిచుక్కలుండెను!...

ప్రకృతికంతయు వెండిపూసినట్లు చంద్రుడు ప్రకాశించుచుండెను. చిరుగాలికి కమల ముంగురులు నాట్యమాడుచుండెను. మూర్తి దేహము పులకించెను. ఆమె బుజములపై చేతులు వేయుచూ 'ఎంత హాయిగా ఉన్నదీ వెన్నెల' యనెను. పురుష స్పర్శవలన కలుగు శారీరిక మనోవికారముల కలవాటుబడిన ప్రాణి! త్రుటిలో మైకము క్రమ్ముకువచ్చెను. వెఱ్ఱిగ యాత్రముగ నాతనివంక చూచెను.

మూర్తి యభీష్టము సిద్ధించెను.

ప్రయాణ బడలిక చే యొడలెరుంగక నిద్రించెను. తెల్లవారుఝామున చల్లని వస్తువేదో తగిలినట్లై మేల్కొనెను. ఆతని ప్రక్క కమల నిద్రించుచుండెను. ఆమె నైఖరి యసాధారణముగ గన్పించెను. ఆమెను తాకెను కొయ్యబారినట్లుండెను. కదపెను. కట్టె వలె కదిలెను. ఉలికిపడి దీపము వెలిగించెను ఆమె తలవద్ద నొక కాగితముండెను. తాను శయనించినపుడది యుండలేదని గుర్తుకువచ్చెను అవిగా? — మూర్తి కంపించిపోయెను. ఛీ ఛీ! పాడు ఆలోచనలు, నిగురముత్తున వచ్చినవి కాబోలు. అమంగళము ప్రతిహతమగుగాక!...ఆ కాగితమునందేమున్నదో జూడవలెననిపించెను. అందిట్లుండెను.

“నీకీ ఉత్తరం అందేప్పటికి నేనీ లోకంలో ఉండను. నువ్వన్న మాటలన్నీ అసత్యాలనుకొన్నా; నిజంగా నన్ను నేనే మోసపుచ్చుకొన్నా! ఇవ్వాళ్ళ ఋజువైంది...కాని నేనీ వృత్తి నవలంబించింది మటుకు నీకొఱకే. అది పరమ సత్యం...భగవంతుడు నిన్ను నా కప్పగించి నాన్నను అమ్మను ఎత్తుకుపోయాడు. ఉన్న ఎకరంన్నరలో వచ్చే గింజలు మూడునెల్లకు చాలవాయె. ఏ ఉద్యోగానికైనా నాకు చదువూ సంధ్యా లేదాయె.. నీకోసమే చావును కూడా బలిచేశా, ఇక శరీర మొక లెక్కా!...నా త్యాగానికి నేనే మురిసిపోయినా. గర్వించా. అది అహంకారమో, మూర్ఖతో, ఆనందమో కాని కామేచ్ఛ మటుకు కాదు. అదే శరీరాన్ని పరికరంగా చేసికొని నన్ను బానిసను చేసుకుంది. మూర్ఖురాల్ని మోసగించింది. సత్యాన్నసత్యంగా మార్చింది... శారీరక వాంఛకులొంగి నీకు కళంకంగా, నీ ఆశయాలకి విశ్వాసాలకి విరుద్ధంగా నేను బ్రతుకబోను .. నన్ను మఱచిపో బాబూ!....”

మూర్తికి మతిపోయినట్లయ్యెను. ఆమెను తాకుటకు కూడ భయపడెను. అంతలో యింకొక గంటకు తన యూరికి రైలుండెనని జ్ఞప్తికివచ్చెను. రెంపేసులు ముంగుకునైచెను. చేత నా యుత్తరముండెను. దాని నేమిచేయుటకును తోచలేదు. తాను వచ్చునప్పటికి ప్రొద్దుపోయెను. తనకు తెలిసినవారెవ్వరికిని తా నగుపించలేదు. తానీ రైలుకు పోయినచో తన రాకపోక లెవ్వరికిని తెలియవు. కర్మముచాలక యెవ్వరైనను తన్ననుమానించినచో ఈ కాగితము తన రాకను నిరూపించును. ఆమె పుణ్యమాయని తన పేరు నుదహరింపలేదు. ఉత్తరమును తీసినచోటనే పదిలముగ నుంచి చరచర వెడలిపోయెను.

...నాటికి నేటికి, కమల ఆత్మహత్యకు తానెంతమటుకు బాధ్యుడో మూర్తికి బోధపడలేదు!

# క్రీడాభిరామము

శ్రీ కె. ఎల్. నరసింహారావు

## సమకాలిక సాంఘిక జీవనము

ఈ అనంత విశాల విశ్వములో కవి యొక ప్రత్యేక వ్యక్తి. తన శేముషీనైపుణ్యముతో, వాగ్దేవి కరుణా కటాక్ష వీక్షణలతోనూ తన కావ్యజగత్తును నిర్మించగల మహాధీరుఁడు. కాని కవికూడా సంఘములో నొక వ్యక్తి. సంఘజీవి. ఊహా డోలికలలో, భావనా ప్రపంచములో స్వైరవిహారము చేయగల ధీరుఁడైనప్పటికి, తన పరిసరములను, నిత్యజీవిత విషయములను, ఒక్కసారిగా మరచి, మించిపోయి కేవలము కల్పనాచాతురి నే ఆధారముగ గ్రహింపజాలడు. తనకు దెలిసియో, తెలియకయో, సమకాలీన జీవిత పద్ధతులు, విలాస చాతురీ విశేషములు కవి కావ్యమునందు ప్రతిబింబించును. మనుచరిత్రయందు హిమాలయమందలి గారుడోత్కీర్ణ భవనములు, జటిల ద్రాక్షాగుళుచ్ఛములు, 'చెంగలువ కేదారములు' మున్నగునవి విజయనగర పరిసరములందు పెద్దన ప్రతినిత్యము జూచునవే గదా! 'ఆముక్తమాల్యద' యందు యామునాచార్యుఁడు కొమరునికి బోధించిన రాజనీతి శ్రీకృష్ణ దేవరాయలు తమ నిత్య కృత్యములందను సరించుచున్నదియేగదా! ఉద్యోగపర్వమునందలి సంజయ, శ్రీకృష్ణరాయబార ఘట్టములందు మూర్తీభవించిన రాజనీతియే యనదగు, తిక్కయజ్వ సాక్షాత్కరించుట లేదా. ఇటులనే ఏ దేశపు సారస్వతమునందైనను ఆయా కాలపు, జీవితపద్ధతులు, సంఘాచారములు ప్రతిబింబింపబడియే యున్నవిగదా! ఆంగ్ల వాఙ్మయమునందు, 'చాసర్ కథలు' పదునాల్గవ శతాబ్ది సామాజిక జీవితమునకు, 'షేక్స్పియర్' నాటకములు పదునారవ శతాబ్ది సామాజిక జీవితమునకు ప్రతిబింబములు గావా! కాన సారస్వతమునకు, జాతీయ జీవితమునకు, అవినాభావసంబంధము గాన్పించుచున్నది. అటులనే ఈ 'క్రీడాభిరామము' గూడ మధ్యకాలపు (పదునైదవ శతాబ్దపు) ఆంధ్ర రాజధాని యగు ఓరుగల్లు నందలి ప్రజాజీవితమును వ్యక్తపరచుట కొక ముకురము వంటిది.

'క్రీడాభిరామ' గ్రంథ కర్తృత్వమొక విషమ సమస్య. గ్రంథమున వినుకొండ వల్లభరామామాత్యుఁడే కృతికర్తగాఁ జెప్పబడియున్నను కొందఱు విద్వజ్జనులు అందలి కవిత్వపుపోకడలను, భావ సామ్యములను బట్టియు, లాక్షణికు లిందలి పద్యములను, శ్రీనాథ కవికృతమగు 'వీధి నాటక' మందలివి గా గుర్తించి యుండుటచేతను శ్రీనాథమహాకవి నే కృతికర్తగా భావించుచున్నారు. ఈ సమస్య ఎటులున్నను ఈ నాటక మింపగు వర్ణనలతో గూడి, నాటి ప్రజల సాంఘిక జీవితమును బహిర్గత మొనరించుటలో మన కమోఘముగ దోడ్పడుచున్నది.

కౌసల్కాటి మాధవుని కుమారుఁడును, మీసాలప్పయ్యగారి మేనల్లుఁడు నగు గోవిందమంచనశర్మ, తన ప్రియురాలును, ఓరుగల్లునివాసియు నగు 'కామమంజరి' పుత్తెంచిన మదనలేఖ సందేశంబును పఠియించి, తన యనుంగుఁ జెలికాఁడగు 'టిట్టిభశెట్టి'తో నోరుగల్లునకు పయనించి, గోధూళికాలగ్నంబున పురప్రవేశంబు గావించి యచ్చటచట జరుగు వింత ప్రదర్శనముల గాంచుచు, సాయంసమయమున కామ 'కామమంజరి' దరిజేరి యా పునర్భువును కామ సౌఖ్యముల దేల్చుట—ఇందలి కథావస్తువు. ఈ కథావస్తువు ఏకశిలానగరవీధులలో గన్పట్టుటను బట్టి, ప్రసక్తాను ప్రసక్తముగ వివిధవిషయములు వర్ణితములయ్యె. అవియే మన కమూల్యములై, నాటి సామాజిక వ్యవస్థను, చక్కగా చాటుచున్నవి.

### నాటి సామాజికవ్యవస్థ :

ఆ కాలమునందు పట్టణములు 'వెలిపాళెము' 'లోపాళెము' అని రెండుభాగములుగ నిర్మింపబడి యుండెడివి. ఇందు 'వెలిపాళెము' పురబాహ్య ప్రదేశమున నుండి 'మేదర' 'మాతంగ' 'కరణ

మొదలగు వెనుకబడిన జాతివారికి నివాసయోగ్యమై యుండెడిది. ఈ 'నలిపాళెము' నకును 'హాలికూటి' యను ప్రదేశముండెడిది. అందు హాలికులు నివసించుచుండెడివారు. తదుపరి 'మోహరివాడ' (యుద్ధభటులుండు స్థానము) యుండెడిది. ఈ పురబాహ్య నివాసులగు మేదర, కరణ, హాలిక మొదలగు జాతులకొఱకు ఒక ప్రత్యేకసంత జరగుచుండెడిది. దీనిని 'మైలసంత'యని యనుచుండెడివారు. ఈ సంతయందు 'జూదము' లుండెడివి. ఇచట కరణకాంతలు 'సంపెగనూనె' నమ్ముట గమనింపదగ్గవిశేషము—

## లోపాళెము :

ప్రాకారమునకు లోభాగములన్నియు 'లోపాళెము' అనబడియుండెను. ఇందు రాజమార్గము వారణఘటాఘోటక శకటికాభటసంకులమై యుండెడిది— ఇందు 'అక్కలవాడ' 'వేశ్యలవాడ' మొదలగునవి ఆయాజాతులకు ప్రత్యేకముగా గట్టబడియుండెను. ఓరుగల్లు పురము మిక్కిలి లోతైన పరిఖను, 'తారకామండల స్తబకావతంసమై కనుమాపుగొనని ప్రాకార రేఖను' కల్గియుండెను. పెద్దగవని తలుపులు అభేద్యములై 'మెఱుఁగుటెక్కలతోడి మేరుశైలము'ను బోలియుండెను.

## వేశ్యావాటిక :

ఆకాలమున పట్టణములందు వేశ్యలొక ప్రత్యేకస్థలమునందుండుట గమనింపదగ్గవిషయము. ఈ ప్రదేశమునకు "వేశ్యవాటిక' యని అనియెడివారు. వేశ్యాంగనాగృహములు సకలసంపత్శోభాభరితములై, రమణీయ చిత్రపటవిరాజితములై యొప్పారుచుండెడివి. ఇందుల కుదాహరణము ప్రప్రథమమున, గోవిందశర్మ, టిట్టిభులు దర్శించిన 'ప్రతాపరుద్ర ధరణీశోపాత్త ప్రతిష్ఠాపారీణ' యను మాచల్దేవి గృహమే. ఈ వేశ్యవాటికయందు గమనార్హములగు విషయములు మరి రెండు గలవు (1) ముకురదీక్షావిధానము, (2) జారధర్మాసనము.

"ముకురదీక్షావిధానంబు మొదలలేక । వెలపడంతికి గారాగు విటునిగవయ" ఇది ఆకాలపు వేశ్యాచారము.

## జార ధర్మాసనము:

ఇందు, పౌరవిటలోకంబు, విటులకు వేశ్యమాతలకు గలుగు కలహంబుల దీర్చుచుందురు. వేశ్యమాతలొనర్చు కల్లలకు ముక్కుసోణంబు దాకను జెక్కుటయు, 'బోసినోరుగ బండ్లూడ బొడచుటయు' 'గూబలంటగ జెవిదోయి గోయుటయు' తగిన శిక్షలట.

## పూటకూటియిండ్లు:

వేశ్యవాటిక తదుపరి ఎన్నదగినవి పూటకూటియిండ్లు. వీనికిని, నేటి భోజనవిశ్రాంతిగృహములకు చాలవరకు సామ్యము గలదు. అవి యిప్పటి వానివలె ఆహారవిహారంబులకుఁ దావలంబులు. కప్పురపు భోగివంటకము, పిండివంటలును, క్రొత్తగాచిన యాలనేయియు గడ్డపెరుగును గల భోజనము నాడొకరూకకు లభించుచుండెను. మరియు సరసులౌ విటరత్నములకందు వారివిహారంబులకుఁ దగిన సౌకర్యంబు లొనర్పబడుచుండెడివి.

## ఆచార వ్యవహారములు:

నేటి ఆచారవ్యవహారములు చాలవరకు నాటి వాటినే బోలుచున్నవి. ఆకాలపువారికి 'శకునము' లందు విశేషమైన నమ్మిక యుండెడిది. 'వామదిక్కున ఘుక్కని మాటిమాటికి గోటుము పల్కుట' విజయసూచకమట. అటులనే 'గేగో'యని లేగొదము నెమలిపల్కుట' గెలుపునకు నిదర్శనము. "క్రోడి యేట్రింత, కొంకనక్క నెమలి, ఈనాలుగిటి దర్శనంబు, వీని తీరుబలుకు, ఉర్వీజనులకుఁ గొంగుబంగారము". గోధూళిలగ్నంబున బురప్రవేశము శుభావహము. ఉషఃకాలము సర్వకార్యారంభములకు ప్రశస్తంబట- ఆ కాలపు శాకునికుల మత మీ క్రిందివిధముగానుండెడిది—

"గార్గ్యసిద్ధాంతి మత ముషఃకాలకలన ।
శకున మూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనః ప్రసాదాతిశయము ।
విప్రజనవాక్యమరయంగ విష్ణు మతము"—

భక్తవరప్రదాయినియగు 'ఏకవీర' ఓరుగంటి ప్రజల యిలువేలుపు. ఈమె 'కాకతమ్మ'కు సైదోడు. ఈ 'కాకతమ్మ' కాకతీయాంధ్రచక్రవర్తుల యిలువేల్పు. 'మైలారదేవర' భైరవుని తోడిజోడట. భైరవునిగుడి, చముడేశ్వరీ మహాశక్తినగరు, వీరభద్రేశ్వరాగార మంటపము, బౌద్ధవిహారము, కొమరసామిగుడి,

తురకమసీదు మున్నగునవి ఓరుగల్లున గలవు. కేశవ, స్వయంభూ దేవాలయము లట ప్రసిద్ధికెక్కినవి— పై వానినిబట్టిచూడ, ఆ కాలమున వీరశైవము, వైష్ణవము, శక్తిమతములు, బౌద్ధము మున్నగునవి ప్రజలయందు వ్యాప్తిగాంచి యుండెడివనియు, ప్రజలు వివిధమతావలంబులైనను, ఐకమత్యమున వర్తిల్లుచుండిరనియు విశదమగును— హైందవనగరమున 'మసీదు' గానబడుట హిందూముస్లిము ఐక్యతకు చిహ్నము.

## వినోదములు:-

ఓరుగంటియందు 'పల్నాటివీరుల' యాలయము గలదు. అచట పల్నాటివీరుల పావనచరితమును తాళలయాదులు తప్పకుండ నటనావిన్యాసపూర్వకముగ పాడుచుండిరి. వారి వీరతకు చిహ్నముగ వారి కాలయములు కూడ నెలకొల్పబడి యుండినవి. అనగా ఆ కాలమున ఇప్పటివలెనే వీరుల స్మృతిచిహ్నముల నెలకొల్పి వారిని ఆరాధించెడి యలవాటుండెడిదని తెలియనగును. మరియు, ఏకవీరా దేవికథలు 'పరశురామవిజయము', 'మాహురమ్మకథలు' మొదలగునవి ఆ నగరమున పాడబడుచుండెడివి. జక్కులపురంధ్రి ప్రసిద్ధికెక్కిన 'కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపు' పాడుచుండెడిది. మైలారదేవరవీరభటులు గొరగ పడతులచే గొండ్లి యాడించుట ఆ కాలపువారి వినోదములలో నొకటి. 'ఆహితుండిక గరళ విద్యాధిరాజగు' పాముల మెంగని నాగస్వరప్రేరితములై ఆడుచుండు భోగీంద్రములు, కంఠగ్రైవేయ ఘంటికారవంబులు చెలంగ యుద్ధసన్నద్ధంబులై ఏలికలవెంట చనుదెంచు మేషంబులు, చరణాంగుళీ కుటిల నఖాశిఖాకోటి కుట్టనంబులం వక్షస్థలంబులు వ్రచ్చి వందరలాడు' కృకవాకంబులు, కాంచీనూపుర కంకణక్వణనములు దమ్మనుసరింప సురపొన్నక్రీడ కందుకక్రీడ యొనర్చు లేబ్రాయంపు పడతులు, నాటి వారి వినోద సాధనములు మరియు 'శ్రీకాకుళపు దిబ్బళ్లు' అందు వర్ణింపబడిన వివిధవర్ణముల గబ్బిమిటారుల యుబ్బులు ఆనాటి వారి కమందానందహేతువులు. వినోద విహార సాధనములు—

పై విధముగ 'క్రీడాభిరామము' మధ్యకాలపు (15వ శతాబ్దమందలి) ఆంధ్ర రాజధానియందలి ప్రజల జీవిత పద్ధతులను, ఆచార వ్యవహార వినోదములను, సాంఘిక కట్టుబాట్లను, మనకు వేయుముఖముల వెల్లడించుచున్నయది.

# విషబీజము

శ్రీ ఓగేటి శివరామకృష్ణ

పుస్తకాలు యింట్లోవుంచి రామం బయటకు వస్తూంటే తల్లి శాంతమ్మ కేక వేసింది.

"ఏం అమ్మా!" — అంటూ ముందడుగు వేసిన రామం వెనక్కు తిరిగి యింట్లోకి వచ్చాడు.

"ఏరా" — శాంతమ్మ రామంవయిపు జాలి గొలిపేట్లుగా చూసింది.

"ఏం అమ్మా"—పితృవాక్యపరిపాలనార్థం అడవికి బయలుదేరిన రాముడిలాగ తల్లివాక్యం శిరసా వహించేతలంపుతో వినయంగా అన్నాడు రామం!

సంగతి చెప్పకుండానే శాంతమ్మ కళ్లు చెమర్చాయి:

రామం గుండె దడదడలాడింది: "ఏమిటమ్మా ఏం జరిగింది?"—ఆదుర్దాగా అడిగాడతడు.

"అది కాదు నాయనా"—శాంతమ్మ మిగిలిన మాటలు చెప్పలేకపోయింది. తల్లిమనస్సులో యేమిటో దాచుకొని బాధపడుతున్నదనుకున్నాడు రామం!

"నీ వుద్దేశ మేమిటో చెప్పమ్మా! తప్పకుండా నీ యిష్టప్రకారం నడుచుకుంటాను. కన్నతల్లి కోర్కె తీర్చటం కంటె మరి నాకు కావలసిందేమిటమ్మా"

శాంతమ్మ, రామంవంక చూసి, చిరునవ్వు నవ్వింది! ఆమె కళ్ళనుంచి ఆనందబాష్పాలు రాలి నేలపడ్డాయి. రామం, తనమాటకు యెదురాడడని, ఆమెకు తెలుసు. అయినా ..

"నాకు తెలుసు నాయనా! నా రామం అందరిలాంటి వాడు కాదు బంగారు కొండ"—అందామె!

"ముందు సంగతేమో చెప్పమ్మా"—ఆదుర్దాగా అడిగాడు రామం.

"మామయ్య వచ్చాడురా" అంది శాంతమ్మ.

ఇప్పుడు రామానికంతా అర్థమయింది.

మేనమామ, రామేశ్వరంగారు పెళ్లికబుర్లు మాట్లాడడానికి వచ్చాడన్నమాట. ఆయన తనకుమార్తె కమలను, తన్ను పెండ్లిచేసుకోమని కోరుతున్నాడు. తన తల్లి అన్నగారిమీదవుండే మమకారంచేత కమలను, తన్ను పెండ్లిచేసుకోమని కోరుతోంది. తానింతవరకూ తల్లిచాటున పెరిగాడు; తాను పుట్టి, పెరిగిన పది సంవత్సరాలకే, తనతండ్రి చనిపోయాడు.

అప్పటినుంచీ తల్లి తన కేటువంటి లోటూ రాకుండా పువ్వుల్లో పెట్టి పెంచింది. ఉన్న ఆస్తి పాస్తులు చూసుకుంటూ, తన భవిష్యత్తుకోసం, కాలేజీ చదువు చదివిస్తోంది ఇంతవరకూ, తాను తల్లిమాటలకు యెదురు తిరిగింది లేదు. ఆమె యిష్టమే, తన యిష్టం. ఆమె యిష్టప్రకారం నడుచుకుంటూంటే—ఆమె మనస్సు సంతృప్తి పడటమే కాదు—తన మనస్సు సైతం తేలిక పడుతుంది.. అయితే—

తన అన్న కూతుర్ని, కమలను పెండ్లిచేసుకోమంటుంది తల్లి — తన కామెను వివాహం చేసుకోవటం యేమాత్రం యిష్టం లేదు.

పుటకనుంచీ — తాను కమల నెరుగును. ఆమె—అందగత్తే—చదువు సంధ్యలు బాగా నేర్చుకొన్నదే! కాని అహంభావం ఆమె కెక్కువ. పుట్టుకనుంచీ యితరులను తేలికగా చూడటం, హేళన చేయటం ఆమె కలవాటయినాయి.

చిన్నతనంలో తాను కమలను ప్రేమించాడు. కానీ ఒక సంఘటనను పురస్కరించుకొని, తాను తన అభిప్రాయం మార్చుకున్నాడు. మేనత్త అనే అభిమానం అయినా వుంచక, ఒకమారు కమల, తన తల్లిని తూలనాడింది; అంతేకాదు-తమకున్న ఐశ్వర్యాన్ని పురస్కరించుకొని "నోరుముయ్యి" — అని తాను అన్నమాటకు బదులుగా "మిమ్మల్ని అసలు యెవరు మా గుమ్మం యెక్కమన్నారు?"—అంది కమల హేళనగా!

ఆ మాటలతో తన తల కొట్టివేసినట్లయింది. తనకు—మరి అక్కడ ఒక్క నిమిషం వుండటానికి యిష్టం లేకపోయింది. ఆ చిన్నతనంలోనే—

"నువ్వు వస్తేరా అమ్మా... లేకుంటే మాను. నేనుమాత్రం యిక్కడ మరి ఒక్క నిమిషం వుండను'-అంటూ తాను బయలుదేరివచ్చాడు తల్లి అన్నమీద ప్రేమచేత—"పిల్లది, రేపు పెళ్ళయిన తరువాత అంటగంటుందేమిటిరా ... మనం సర్దుకుపోవాలి—" అని ప్రథమంలో అన్నా—తనమీద ప్రేమచేత—వెంటనే తనతో వచ్చేసింది. నాటినుండి నేటివరకూ--తాను మామగారియింటికి వెళ్లిందే లేదు. కమలను చూచింది లేదు. కమలమాత్రం—అన్నమాటలు అప్పుడే

మరచిపోయినట్లుగా తర్వాత నాలుగయిదుమార్లు తన యింటికి వచ్చింది. సిగ్గువిడిచి తనతో మాటాడ ప్రయత్నించింది. తాను మాత్రం నోరు మెదల్చింది లేదు...

కాలం తిరిగింది. కాలంతోపాటు తనలో యిప్పుడు మార్పులు వచ్చాయ్. తానిప్పుడు బి. ఏ. చదువుతున్నాడు .. కమల స్కూలు ఫైనలుతో తన చదువు సంధ్యల నాపు చేసింది...కాని—ఒకప్పుడు కమలమీద యేర్పరుచుకొన్న చెడ్డ అభిప్రాయం మాత్రం తననుండి తొలగిపోలేదు. అటువంటి కమలను పెండ్లిచేసుకోమని గత రెండు సంవత్సరాలనుంచీ మేనమామ రామేశ్వరంగారు తెగ వత్తిడి చేస్తున్నాడు. నెలకొకమారయినా—వచ్చి తల్లితో మాటాడి పోతున్నాడు. అన్నమీద అభిమానం కొద్దీ—తన వుద్దేశం ఆమెకు తెలిసివున్నా "మావాడు దాన్ని పెళ్ళిచేసుకోటానికి అభ్యంతరం చెబుతున్నాడ"నే మాట—అనలేకపోతూంది. అందువల్లనే ఆయన ఆశతో రాకపోకలు సాగించటం...ఇంతవరకూ—తల్లి — పెండ్లి సంగతి యెత్తింది కాని—తన అభిప్రాయాన్ని మాత్రం అడగలేదు. కానీ నేడు—

గతాన్ని స్మరణకు తెచ్చుకొన్న రామం — తల్లివయిపు చూస్తూ: "వచ్చి యేమన్నాడమ్మా"—అన్నాడు...

శాంతమ్మ ఆశగా — రామంవంక చూసి: "పెండ్లి విషయం మాటాడాడు" అంది.

రామంకు అంతా తెలుసు—కాని—

"ఏమని?" — అని తల్లిని యెగాదిగా ప్రశ్నవేశాడు.

"కమలను, మరి వుంచటం తన కిష్టం లేదట"

"ఊహూ—"

"అందుకని తొందరగా పెళ్ళిచేసేయాలట.... నీ పరీక్షలయ్యేవరకూ వుండటానికి గూడా వీలు లేదట...."

"అయితే ఆయన యిష్టమొచ్చినట్లుగానే చేసుకోమను"—తన అభ్యంతరం మరో మార్గాన వ్యక్తపరిచాడు రామం.

"అలాగ అంటే యేలగరా నాయనా దాని.... పెళ్లి అంటే —అది మన రెండు కుటుంబాలకూ సంబంధించినది....నీ కభ్యంతరం లేకుంటే చేసేయవచ్చు-కానీ, నా దృష్టికి పరీక్ష లడ్డువచ్చాయ్. ఏమంటావ్?"

"నీ మాటలు నాకేం అర్థం కావటం లేదమ్మా"—అన్నాడు రామం—తన అయిష్టతను వ్యక్త పరుస్తూ.

ఈమారు శాంతమ్మ — తన అభిప్రాయం: "అర్థం అవటాని కేముందిరా .... అది పుట్టిన నాటి నుంచీ—మన రెండు కుటుంబాలూ మీ గురించి నిరయించుకొన్న అభిప్రాయం—వివాహం చేయటం — ఆ మహారాజు బ్రతికివుంటే—అంతా తన చేతులలో చేసుకొని ఆనందించేవారు. కాని"—అని రుద్ధ కంఠముతో కళ్లనీళ్లు పెట్టుకుంది:

"కమలకు నన్నిచ్చి పెళ్ళిచేదామనా!"

"అవున్నాయనా — నీ మేనమామ కూతురు కమల; దాని పుట్టుకతోటే యేర్పరుచుకొన్న అభిప్రాయం అది"—అంది శాంతమ్మ రామంవయిపు చూస్తూ....

"ఒకప్పుడు నిన్ను హేళనచేసిన కమల—మీరు మా యింటికి యెందుకు వచ్చారు?"—అని గర్వంతో మనల్ని అన్న కమల—హు....దాన్ని నే పెళ్ళిచేసుకోవాలా అమ్మా...." —అన్నాడు రామం. కళ్ళు యెందుకో చమర్చాయి....

"అవన్నీ కుఱ్ఱతనంచేష్టలు నాన్నా .... ఆనాడు హేళన చేసినా యీనాడు అది నీ కోసం పలవరిస్తోంది — మీ మామయ్య తలచుకుంటే కోటి సంబంధాలు తీసుకురాగలడు. అది వివాహం చేసుకుంటే—నిన్నే చేసుకుంటానని మంకుపట్టుతో కూర్చుంది."

"అయితే"—

"అందుకనే మామయ్య—గత సంవత్సరంనుంచీ—మన యింటిచుట్టూ తెగ ప్రదక్షిణం చేస్తూంట. తన మాటలుగా చెప్పమని — మామయ్యచేత అది యెన్ని మార్లో కబురు పంపింది. కాని—నిన్ను కలుసుకోనందున మామయ్య ఎప్పటి విషయాలు అప్పుడు నాకు చెబుతూంటాడు" — కుమారుడి అభిప్రాయం మార్చటం కోసం శాంతమ్మ చెప్పబోయింది....

"అయితే మాత్రం" — అన్నాడు ఆ మాటలు అంతగా పట్టించుకోకుండా రామం.

"అందుకనే నువ్వు కమలను వివాహం చేసుకు తీరాలి"—శాంతమ్మ రామం వంక చూసి నవ్వింది:

"నువ్వు కమలనుగూర్చి యేమిటో వూహిస్తున్నావ్ అమ్మా.. కానీ— నేను చాలా దూరం యోచించాను....నీ యిష్టప్రకారం నేను తప్పక వివాహం చేసుకుంటాను....నీ యిష్టప్రకారం యేపిల్లనయినా సరే... కానీ కమలను మాత్రం కాదు. దాన్ని పెళ్లిచేసుకోమని, నన్ను నిర్బంధించకు.... నేను నీవడిలో పెరిగాను. నిన్నువదలి ఒక నిమిషం అయినా వుండలేను. అసూయ, గర్వం, ద్వేషం వీటికి ఆటపట్టు కమల. కేవలం అన్న కూతురు అనే అభిమానంతో నువ్వు దాన్ని పెళ్ళిచేసుకోమంటున్నావ్. కొరివితో తలగోకటం అవుతుంది నేను కమలను పెండ్లిచేసుకోవటం.. ఆ సంగతి గుర్తించమ్మా....ఏమీ తెలియని—చిన్నతనపు అమాయకపు రోజుల్లో వుండిన ద్వేషబీజాలు -

మరి తప్పకుండా అభివృద్ధి పొందుతాయి. అటువంటి వాళ్ళకు పశ్చాత్తాపం వుండదు .. నే సెంతగానో వూహించి, చెబుతున్నానమ్మా .. నా మాటలు సత్యం అయి తీరుతాయి. నే మంచిచెడ్డలు బాగా ఊహించానమ్మా....కమలను వివాహం చేసుకోవటం సుఖంగా చీకూ చింతా లేకుండా బ్రతుకుతున్న మన మధ్య చీలికలు తెచ్చుకోవటం. అంతకంటె మరేం లేదు. నే పరిస్థితులకు వారసుడి నయిపోతాను—నా మాట నమ్మమ్మా. నీ అభిప్రాయం మార్చుకో"—రామం ఉద్రేకంతో యీ మాటలన్నాడు ప్రత్యుత్తరం శాంతమ్మ కళ్లనుండి నీళ్లు!

"ఏం అమ్మా....నా మాటలు నీకు బాధ కల్గించాయా? ఇంతవరకూ నీ యిష్టప్రకారం నడుచుకొన్న నాకు—అలా చేయడంకంటె మరేం కావాలమ్మా? కానీ—యీ సందర్భంలో మట్టుకు"—

"అది కాదు నాయనా...." రామం మాటలకు అడ్డు వస్తూ అంది శాంతమ్మ:

"పేరు ప్రతిష్టలు సంపాదించుకున్న మనరెండు వంశాలమధ్య, జ్యోతుల్లాగ--మన రెండు కుటుంబాలు మాత్రమే మిగిలాయి... రక్తసంబంధం గనుక—అవిధమైన ప్రేమ మాలో వుంటూంటుంది. ముందు రోజు లేవిధంగా వున్నా కమలను పెండ్లి చేసుకోవటమే నా కోరిక ....మామయ్య బోలెడు ఆస్తి సంపాదించాడు—కానీ—ముసలివాడయి పోయాడు. వెనకా ముందూ మనకంటె మరి హితులెవరూ లేరు....ఎంతో ఆశ మన మీద పెట్టుకొని ఆయన జీవిస్తున్నాడు... ఈ వివాహంతో మన రెండు కుటుంబాలూ కలసిపోతాయ్. అటు మామయ్యకుగాని—యిటు నాకు గానీ మరి చింతలుండవు.'కృష్ణా రామా'అనుకుంటూ బ్రతుకుతాం. మీ రేవిధంగా వున్నా నాకు బాధవుండదు. భవిష్యత్తు అలాగా వుంటుందని వూహించి నువ్వు బెంగ పెట్టుకోకు .... మీ రెక్కడ వున్నా యేవిధంగా వున్నా సుఖంగా వుండటమే కావలసింది. కాటికి కాళ్లు చాచుకొని వున్న వాళ్లం మేం...."

"అవేం మాటలమ్మా" — అన్నాడు రామం

"కాక"—అని నవ్వింది శాంతమ్మ.

"అటువంటి మాటలనకమ్మా. భగవంతుడి దయ వల్ల నువ్వు చాలాకాలం వుండాలి...."

"ఇంతకీ నీ అభిప్రాయం..."—అని నవ్వింది శాంతమ్మ....

"నే చెప్పవలసిందంతా చెప్పానమ్మా...ఇక నీ యిష్టం—భవిష్యత్తు సంగతి కొంచెం వూహించి, నీ యిష్ట మొచ్చినట్లుగా చేయమ్మా ..."

"భవిష్యత్తుకేం....చక్కగా వుంటుంది .... మరి కొద్దిరోజుల్లో ఒక శుభముహూర్తాన కమల నీ భార్య అయిపోతుంది. ఎంతకాలంనుంచో వూహిస్తున్న మా ఆశలు ఆనాటికి ఫలిస్తాయి" — అంది శాంతమ్మ.... నవ్వి!

"సరి"—అంటూ రామం బయటకు నడిచాడు!

"నా బంగారు కొండ ఎప్పుడూ యెదురు చెప్పడు"—అని మురిసిపోయింది—చీకట్లో సాగిపోతున్న కొడుకును చూచి శాంతమ్మ.

* * * *

పరీక్షలటు అవటం—యిటు కమలా—రామంల వివాహం జరగటం యించుమించుగా వొక్కసారిగా జరిగాయి. కొద్ది రోజులు గడిచాయ్....కమల కాపురానికి గూడా వచ్చింది....

ఆ వచ్చిన రోజున—

శాంతమ్మ—మందహాసంతో కోడలును పిలిచింది!

"ఏం"—అంటూ అధికారహోదా ప్రదర్శిస్తూ కమల, శాంతమ్మ దగ్గరికి వచ్చింది!

"ఏం లేదమ్మా...నువ్వు యిదివరకటి విధంగా యెదిరించకూడదు. కొంచెం వినయంగా మసులుకు పోతూండాలి..."—అని శాంతమ్మ యింకా యేమో చెప్పబోయింది:

"నాకేం చెప్పక్కరలేదు"—అంది విసురుగా కమల!

శాంతమ్మ నవ్వింది: నవ్వి; "అలాగంటే యేలాగే.... నేను నీ అత్తగార్ని...ఇకమీద నా యిష్ట ప్రకారం నడవాలి. తెలుసా"—అంది!

"నే నడవనవసరం లేదు. నీ యిష్ట మొచ్చినట్లు చేసుకో"—అంది—

శాంతమ్మ మాటలు విన్పించుకోకుండా, మేడ మెట్లు యెక్కుతూ కమల.

శాంతమ్మ తెల్లబోయింది:

రామం భార్యతో యిదిగా మసులుకు పోటం లేదని—పెండ్లినాడే ఆమె గుర్తించింది. నయంగా ఆ సంగతి కోడలితో చెప్పి, కుమారుడి అనురాగం పొందమని చెబుగామని—కమల నామె పిలిచింది. కానీ ఆదిలోనే ఆటంకం యేర్పడింది. చెప్పు దెబ్బకొట్టినట్లయింది. కాని — శాంతమ్మ దాన్ని పట్టించుకోలేదు:

* * * *

ఆ రాత్రి—

పడకగదిలో—

రాముం : "నువ్వు యీ యింట్లో ఆనందంగా జీవించాలనుకుంటే—సుఖంగా వుండాలంటే—మా అమ్మ మాటలకు యెదురాడకూడదు. తెలిసిందా"—అన్నాడు.

భర్త అనురాగం పొందబోతున్న భార్యగనుక—కపటపునవ్వు పైకి నవ్వి: "మీరు నాకు విడిగా చెప్పాలాండీ...ఆ సంగతి నాకు మాత్రం తెలియదూ?"—అని యేలాగో అనగలిగింది కమల!

"ఇదివరకటి విధంగా యెదిరిస్తే మరీ క్షణంలో ఒక్క నిమిషం వుండవ్. తెలిసిందా ..."—అన్నాడనాలోచితంగా రాముం...

"మీరంతగా, నాతో చెప్పనక్కరలేదు. ఏ విధంగా మసులుకుపోవాలో నాకు తెలుసు. అనవసరంగా మీరు నాతో చెప్పకండి"—అంది పెటుకుగా కమల!

"అనవసరమా"—అంటూ కమలను దగ్గరకు తీసుకొన్నాడు రాముం—

"కాక"—పైకి అని, రాముని కి లొంగిపోయి—హఠాత్తుగా భర్తమాటలమూలకంగా—యేర్పడ్డ ద్వేష భావంతో—అత్తను గూర్చి యేమిటో ఆలోచించింది కమల.

కొంతకాలం గడిచింది...

పరీక్షాఫలితాలు వచ్చాయి. రాముం ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు.

ఇదివరకటి విధంగా కాకుండా—రాముం భార్యతో కొంచెం హితవుగా నే మాట్లాడుతున్నాడు...

భర్తయెడ అనురాగం చూపిస్తున్న కమల—అత్తతో పెటుకుగా అప్పుడప్పుడు మాట్లాడుతున్నా—లొంగిపోయి నడుస్తోంది. కాని—అత్త శాంతమ్మపట్ల మాత్రం — అహంభావంతోనూ — ద్వేషంతోనూ ఆమె సంచరిస్తోంది...

ఇంట్లో వలసిన పనులన్నీ శాంతమ్మే చూసుకుంటోంది. కమల చేయవలసిన పని లేదు. ఆ భార్యాభర్తలు ఆనందంగా వుండటమే చాలని భావించే శాంతమ్మ—కమలచేత అసలు పనులే చేయించదు. ఒక వేళ—విపరీతపరిస్థితులు యేర్పడినప్పుడు—తప్పనిసరిగా పిలవటం జరుగుతూంటుంది...

"ఏం కొంప మునిగిపోయిందని పిలిచావ్"—అంటూ విసురుగా వస్తుంది కమల!

నవ్వుతూ పనేమో శాంతమ్మ చెబుతుంది:

"అలాంటి వెధవ పనులు చేయటానికి నాకు తీరుబడి లేదు"—అని పనిచేయకుండా విసురుగా వెళ్లిపోతుంది కమల!

శాంతమ్మ చేసేది లేక దిగాలుగా చూస్తుంది. ఆమె కళ్ళనెంబడి నీళ్లు కారుతాయ్, కమలమీద ఆమెకు కోపం వస్తుంది. కుమారుడితో చెబితే—ఆమె లొంగకుండని — అతను చితకకొడతాడనీ శాంతమ్మకు తెలుసు. కానీ — ఇప్పుడిప్పుడే అనురాగం భార్యయెడల చూపిస్తున్న రాముం—పానకంలో పుడకలాగ — తానేమైనా చెప్పిన పక్షంలో — ఆమె ముఖం చూడటం మానుకుంటాడు:—ఆ విధంగా కుటుంబంలో చిచ్చెత్తి, తాను తీసుకొని వచ్చిన వవుతుంది...

కమల యేవిధంగా మసులుకుపోతున్నా—యే విధంగా మాటలు అంటున్నా — తల ఒగ్గివుండటం చాలా మంచిదని శాంతమ్మ గుర్తించింది.

కమల—తన్ను వంటమనిషికంటె చులకనగా చూస్తూన్నా "పాపం వెఱ్ఱిపిల్ల" — అని జాలిపడుతోంది శాంతమ్మ ...

ఆమె మనస్సు—ఒకప్పుడు పడనిబాధ యిప్పుడు పడుతోంది కాని దాన్ని వ్యక్తపరచకుండా—కుమారుడు పొందే ఆనందాన్ని—తన ఆనందంగా భావిస్తూ—కాలం గడుపుతోంది...

ఈలా వుండగా హఠాత్తుగా—శాంతమ్మ అన్న రామేశ్వరం గారికి జబ్బు చేసింది...

*　　*　　*　　*

శాంతమ్మ, కమలా, రాముం—చేరిన కొద్దిరోజులకే రామేశ్వరం గారు చనిపోయారు.

శాంతమ్మ కిప్పుడు — పెద్దవాళ్లు చుట్టాల్లో యెవరూ లేరు...అన్న తాలూకు కమల, భర్తతాలూకు రాముం ఆమె కిప్పుడు మిగిలారు. అన్న చనిపోయినందుకు—ఒకమూల దుఃఖిస్తున్న శాంతమ్మకు—ఒక దృఢమైన అభిప్రాయం గూడా అప్పుడే యేర్పడింది.

తనకున్న రెండుకళ్ళూ — కోడలూ, కొడుకూను...

తన అన్న చనిపోయాడు: ఇక తన సర్వస్వం—ఆస్తికాదు. కమలా, రాముడూను; వాళ్ళ కెటువంటి బాధలూ కలగకుండా—తాను చూస్తూండాలి. వాళ్ళ ఆనందమే తన ఆనందం: వాళ్ళెవిధంగానూ—అసౌఖ్యం పొందకుండా—తాను చూస్తూండాలి. చివరకు తన ప్రాణాలు పోయినా సరే—

ఈవిధంగా వుంది శాంతమ్మ వుద్దేశం:

కానీ—

రామేశ్వరం గారు పోయిన కొద్ది రోజుల తరువాత:

ఒక దినం—

# విష బీజము

ఎప్పుడూ—మామను గురించి మాటలు రాని-రాముం నోటినుంచి మాటలు వచ్చాయ్:

శాంతమ్మతో అన్నాడు: "అమ్మా! చనిపోయిన మామ యేలాగూ తిరిగి రాడు. బోలెడు ఆస్తిపాస్తులూ, పెద్ద మేడా యిచ్చి..." ఆయన మరణంతో మన కవన్నీ సంక్రమించాయి — ఈ పరిస్థితుల్లో మనం అక్కడికి వెళ్ళిపోతే — యిక్కడ నుంచి చెడ్డలు యెవరు చూస్తూంటారమ్మా? అవి యిక్కడే వుండి పోదామంటూంది... మన పొలం పుట్రలు గూడా యిక్కడే వున్నాయ్—మేడ మినహాయిస్తే—అక్కడ మనకేం లేదు. దాన్ని యెవరికయినా అద్దెకిచ్చివేస్తే మరి గొడవుండదు"—అని.

ఆ మాటలు శాంతమ్మ వింది: ఆమె వదనం వికసించింది. రాముం నోటినుంచి అటువంటి మాటలు వస్తాయని ఆమె అనుకోలేదు—ఎటునుంచి, యెటు వచ్చినా ఆమె వాంఛించేదీ అదే!

"మంచి ఆలోచన. కమల చిన్న పిల్ల అయినా-పెద్ద ఆలోచనలు గల పిల్ల. ఆవిధంగా నే చేయండి"—అంది శాంతమ్మ ఆనందాన్ని వ్యక్తపరుస్తూ — తల్లి అంగీకరించినందుకు రాముం యెంతగానో సంతోషించాడు —

కమల ముఖం మాత్రం గుటుగుటలాడించింది పైగా—ఆ రాత్రి—రాముంతో.

"మీ రావిడను గూడా వుండమన్నారేమిటి" -అంది.

"ఏం?"—ఆవిడ మనతో వుండక యెక్కడను వెడుతుంది?"- -అన్నాడు రాముం

కమల మంచి, చెడ్డ లాలోచించలేదు: "అడ్డమైనవాళ్ళనూ — మేపడానికిక్కడ వీలులేదు అంతే"—అంది కచ్చితంగా!

రాముం: "నోరు ముయ్యి. అడ్డమైన వాళ్ళూ యెవరు వున్నారు? నా కన్నతల్లి నీకు — బయటి మనిషా? మనకు వివాహం చేసిన ఆమె అడ్డమైన వాళ్లతో జమ అయిపోయిందా? పళ్లూడతాయి జాగ్రత్త"—అని తీవ్రంగా అన్నాడు...

కమల భయపడిపోయింది: ఇదేవిధంగా నోరు మెదల్చటానికామెకు ధైర్యం చాలలేదు. "సరే"—అనే మాటలతో ఆమె నోరు మూతపడింది. కానీ భార్యాభర్తల మాటలు విన్న శాంతమ్మ — అప్పటికప్పుడే ఒక నిశ్చయానికి వచ్చింది: యౌవనంలో అడుగిడిన దంపతులు వాళ్లు. వాళ్ళ అభిరుచులను పురస్కరించుకొని—నాగరికతతో వాళ్లు మసులుకు పోతుంటారు. అటువంటప్పుడు — తానిక్కడ వుండటం—పానకంలో పుడకలాగ—అడ్డు తగలటమే ...వాళ్లు యిక్కడ ఆనందంతో వుంటూంటే— తాను స్వగ్రామం పోయి—కృష్ణా రామా అంటూ కాలక్షేపం చేస్తే చాలా బాగుంటుంది...చూడాలని వున్నప్పుడు — వచ్చి ఒకటి రెండు రోజులుండి పోతూండవచ్చు.

ఈ విధంగా నిర్ణయం చేసుకొన్న—శాంతమ్మ మర్నాడు—ఉదయమే—తన బట్టలతో స్వగ్రామానికి ప్రయాణం అయింది: వీధిలో బండివచ్చి ఆగింది. శాంతమ్మ ప్రయాణానికి బండి తెప్పించుకుంది. తల్లిని చూచి రాముం ఆశ్చర్యపోయి: "ఎక్కడికమ్మా ప్రయాణం?" అని అడిగాడు. అంతవరకూ, తల్లి ప్రయాణం సంగతి రామానికి తెలియదు.

శాంతమ్మ నవ్వుతూ: "ఇంటికి"—అంది!

"ఇంటికా!"-మరింత ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తూ అన్నాడు రాముం!

"అవున్నాయనా....మరింక నే నెందుకూ?... మీ రిద్దరూ చిలకా గోరింకలలాగ హాయిగా కాపురం చేయండి. నే నక్కడ కృష్ణా రామా అనుకుంటూ కాలక్షేపం చేస్తాను... నేను తప్పక అపుడపుడూ వస్తూంటానులే"—అంది శాంతమ్మ.

"నువ్వు వెళ్లటం నాకేమాత్రం ఇష్టం లేదమ్మా. అదిగాని యేమైనా అందా? చీలుస్తాను. చెప్పు"—అన్నాడు రాముం.

"అది నన్నేమంటుకంటుంది నాయనా? నేనంటే దానికి చెప్పలేనంత ప్రేమ. కుర్రతనంకొద్దీ అప్పుడప్పుడు యేవో మాటలు అంటూంటుంది అంతే నే వాటినంతగా పట్టించుకోను: నువ్వు అంతే. తెలిసిందా?"—అని నవ్వింది శాంతమ్మ.

రాముం కళ్లల్లో నీళ్లు నిలచాయి: "సరే"—అన్నాడు యేలాగో...

శాంతమ్మ కమలవయిపు చూసింది ... కమల ముఖంలో తీవ్రత కనిపిస్తూంది. శాంతమ్మ మాత్రం నవ్వుతూ: "వస్తాను కమలా...మీ అత్తయ్యను మరిచిపోకు"—అని బయటకు వచ్చేసింది...

కమలనుంచి మాత్రం ప్రత్యుత్తరం రాలేదు:

"బెల్లంకొట్టిన రాయిలాగ పలకవేం" — అని భార్యను మందలించి—రాముం వీధిలోకి వచ్చాడు...

శాంతమ్మ బండి యెక్కింది ... తెచ్చుకొన్న కన్నీళ్లు తుడుచుకు "వస్తాను నాయనా" —అంది...

"అమ్మా" -అని రాముం అంటూండగానే బండి బస్సు స్టాండు వయిపు సాగిపోయింది:

* * * *

తర్వాత అయిదుమాసాల కాలం గడిచింది—

కన్నకొడుకు రామాన్ని చూడకుండా వుండటం శాంతమ్మకు మిక్కిలి కష్టంగానే వుంది.... కాని వాళ్ల సౌఖ్యం మధ్య—తాను బయలుదేరి వెళ్ళి పానకంలో పుడక విధంగా మసులుకు పోవటం ఆమె కిష్టం లేదు. కుర్రవాళ్లు; వాళ్ల వ్యవహారాలు వాళ్లే సర్దుకుపోతూంటారు అని భావిస్తూంది ఆమె...అందువల్ల కొడుకును చూడాలనే కోర్కె మనస్సునిండుగా వున్నా—దాన్నామె మనస్సులో దాచుకునే కాలక్షేపం చేస్తూంది...

అత్తవారింట వున్నా—రామం మాత్రం తల్లిని మరచిపోలేదు.

అతడు—తల్లి వెళ్లిన మర్నాటి నుంచీ — ఒకమారు బయలుదేరి రావలసిందని, వచ్చి నాలుగురోజులుండవలసిందనీ బతిమాలుతూ వుత్తరాలు వ్రాస్తూనే వున్నాడు. "వస్తున్నానుగా"—అంటూ శాంతమ్మ వుత్తరాలతో కాలక్షేపం చేస్తూనే వుంది...

పై అయిదు మాసాల అనంతరం—

రామం వ్రాసిన: "అమ్మా! ఇంత కాలం నుంచీ "వస్తున్నా! వస్తున్నా" అని వుత్తరాలకు ప్రత్యుత్తరాలు రాస్తూ కాలక్షేపం చేశావు. ఈ వుత్తరానికి నువ్వు బయలుదేరి రానిపక్షంలో — అగునులో వున్న వ్యవసాయపు పనులు — యెక్కడివి అక్కడ వదలేసి—నీ దగ్గరకు వస్తాను — తర్వాత యేమనుకొన్నా మరి ఉపయోగం లేదు.

అన్నట్లు యీ మధ్య నీకోడలు అన్నం తిన్నగా తినటం లేదు. తెగడోకుతోంది. నీరసించిపోయింది. నాకేమీ అర్థం కావటం లేదు.

ఈ వుత్తరం అందటంతోటే—తప్పక బయలుదేరిరా అమ్మా!" అన్న వుత్తరంలో వాక్యాలు ఆమెను మహానందాన్ని పొందించాయి ... అంతవరకూ బిగపట్టుకు వుంచుకొన్న కోర్కె — తాళ్లు త్రెంచుకు బయటకు వచ్చేసింది—శాంతమ్మ బయలుదేరి పోటానికి నిశ్చయించుకొంది—కుమారుడు—వ్యవసాయపు పనులు వదిలి వస్తాడనే భయం--ఒక్కదాని మూలకంగానే కాదు-తన కోడలిప్పుడు గర్భవతి....మరి కొన్ని మాసాల్లో తాను మనుమణ్ణి యెత్తుకోబోతున్నది!

ఈ శుభవార్త తనకు హితులనే వాళ్లందరకూ చెప్పింది శాంతమ్మ. అంతేకాదు—కోడలు కమలకు యిష్టమయ్యే పిండివంటలేమో ఆమెకు తెలుసు.

మిక్కిలి శ్రద్ధతో వాటిని చేసుకుని—నాలుగు రోజులు వుండటానికి—బట్టలు తీసుకొని — కుమారుణ్ణీ — కోడల్నీ — చూడాలనే ఆశతో బయలుదేరింది శాంతమ్మ....

* * * *

శాంతమ్మ కారు దిగింది...

ఇంట్లో పనిచేసే వీరాస్వామి — కారు దగ్గర కన్పించాడు...

నాడిని కూరలు తీసుకురమ్మని కమల బజారుకు పంపించింది.

"అబ్బాయి గారు వూళ్లో లేరమ్మా. అనుకోకుండా—యెవరో స్నేహితులు రావటం వల్ల తప్పనిసరి అవటం వల్ల వాళ్లతో పట్నం వెళ్లారు. మరి నాలుగు రోజులవరకూ రారట. ఎక్కడి వ్యవసాయపు పనులు అక్కడే వుండిపోయినాయ్...."—అన్నాడు వీరాస్వామి.

"బాగుంది"—అంది శాంతమ్మ.

వీరాస్వామి, శాంతమ్మ చేతిలో మూట పుచ్చుకొని: "మీరు వస్తున్న సంగతి అమ్మగారికి ముందుగా పోయి చెబుతానమ్మా" — అంటూ వడిగా నడచిపోయాడు.

శాంతమ్మ యోచిస్తూ నడక సాగించింది...

* * * *

శాంతమ్మ...అన్నగారి — గేటు గుమ్మంలో కాలు పెట్టింది. వీధి గుమ్మం తలుపులు మూసివున్నందుకూ—తాను తెచ్చిన మూట అలా అరుగుమీదనే వుంచిపోయినందుకూ ఆమె యెంతగానో ఆశ్చర్యపోయింది:

అలా, ఆశ్చర్యపోతూనే—వీధి గుమ్మం దగ్గరకు వచ్చింది శాంతమ్మ.

తలుపులు తీయబడలేదు సరిగదా—మనుష్యుల అలికిడి గూడా లేదక్కడ.

శాంతమ్మ కళ్లు చెమ్మగిల్లాయి...

తానయితే యెంతో ఆపేక్షతో బయలుదేరి వచ్చింది...కోడలు కడుపు పండినందుకు యెంతగానో మురిసిపోయింది. చిరకాలానికి, తాను గుమ్మం యెక్కుతున్నందుకు—లోపల యేలాగున్నా మనస్ఫూర్తిగా: "వచ్చావా అత్తయ్యా"—అని కోడలు తిన్నగా యెదురువచ్చి తీసుకుపోతుందనుకొంది.

కానీ — యెదురురావటం సంగతి—సరి—తలుపు తెరిచిందిగూడా లేదు. వీరాస్వామి గూడా లేడు!

పది నిమిషాల కాలం — దిగాలుగా అక్కడే నిల్చుండి పోయిన శాంతమ్మ: "కమలా... నేనూ... నీ అత్తయ్యను. తలుపు తీయమ్మా" — అంది బ్రతిమాలే ధోరణిలో.

తిరిగి పదినిమిషాలకాలం గడిచిపోయింది: కానీ తలుపు తెరచింది కాదు: తిరిగి — కళ్ళ నీళ్ళతో: "నేనమ్మా కమలా! నీ కోసం పనికట్టుకు వచ్చాను. అబ్బాయినీ, నిన్ను చూడాలని..."అంది-శాంతమ్మ

ఈ మారూ అంతే!

విసిగిపోయిన శాంతమ్మ యీమాట: "సరి తెరవకమ్మా! అబ్బాయి వచ్చేదాకా నే యిక్కడే ఉంటాను. వాడు వచ్చిం తరువాత — నీ సంగతి చెబుతాను" — అంది: కోడలు సంగతి కుమారుడితో చెప్పాలని శాంతమ్మ కోరిక కాదు. అలా అంటే కోడలు లొంగివస్తుందేమోనని—అమాయకంగా ఆమె భావించింది—

కానీ—దానికి జవాబుగా—

హఠాత్తుగా కమల తలుపు తెరచుకు బయటకు వచ్చి ఎంతో ఆపేక్షతో—కోడలునూ—కుమారుణ్ణీ చూదామని వచ్చిన శాంతమ్మ మాటను యెత్తి—దూరంగా పారేయటం జరిగింది.

శాంతమ్మ తెల్లబోతూంటే: "ఊఁ నీగతీ అంతే. ముందు కదులు" అని గర్జించింది కమల.

శాంతమ్మ వణికి పోయింది. ఏమిటీ విపరీతం? కోడలు తనమీద అలా కక్ష యెందుకు తీర్చుకుంటున్నది? తానేం తప్పు చేసింది? సుముఖంగా లేని కుమారుణ్ణి వివాహం చేయించింది తాను కాదూ? వాళ్ల ఆనందం కోసం—దూరంగాపోయి వుంటున్నది తాను కాదూ? వాళ్ళ ఆనందమే—తన ఆనందం—అని తాను భావించటం లేదూ?

వణికిపోతున్న శాంతమ్మ: "ఎందుకమ్మా...నీ కంత కక్ష. నేనేం తప్పు చేశానని?"—అని అడిగింది!

కమల విజృంభించింది: "నువ్వా? చేసిన తప్పా? నాకు అత్తవవటమే! నడు—మరి యిక్కడ వుంటే నౌకర్ల చేత గెంటిస్తాను తెలుసా"

శాంతమ్మ కృంగిపోయింది!

తన గారాల బిడ్డ రాముంభార్య అంటున్న మాట విని!

"ఎందుకు గెంటిస్తావ్? ఇది నా యిల్లు. నా కొడుకునూ, నా కోడల్నీ చూడడానికి వచ్చాను"—అంది శాంతమ్మ.

కానీ — ఆ మాట లామె అంటూండగానే "ఎందుకా? ఇందుకూ—"—అంటూ అత్త దవడ సాపుచేసింది కమల!

అంతే!

అంతటితో బ్రతికివున్న శాంతమ్మ చచ్చిపోయా ననుకొంది. అంతవరకూ—కోడలు మాటలు ఓర్పుతో భరించి "చిన్నపిల్ల"—అని, తనలో తాను అనుకొని సర్దుకుపోయే శాంతమ్మకు బ్రతుకుమీద ఆశ సన్నగిల్లింది!

శాంతమ్మ మరో నిమిషం అక్కడ వుండలేక పోయింది! గద్గదస్వరంతో: "పోతున్నానమ్మా! మీ రయినా పదికాలాలపాటు సుఖంగా వుండండి"—అంటూ వెళ్ళిపోయింది శాంతమ్మ.

లోపలనుంచి బయటకు వచ్చిన వీరాస్వామి, అక్కడే నిల్చుని అంతా చూశాడు! వాడి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి—కానీ వాడేమీ చేయలేకపోయాడు.

* * * *

మరి నాలుగు రోజులకు—పట్నం నుంచి తిరిగి వచ్చిన రాముంకు అన్ని సంగతులూ తెలిసినాయి: "మనకోసం దూరంగా వుండి మన ఆనందమే, తన ఆనందంగా భావించే నామాతృదేవత నావిధంగా అగౌరవ పరిచావా...పాపిష్టి ముఖమా..." అని భార్యను చావమోది, అప్పటికప్పుడే బయలుదేరి—స్వగ్రామం తల్లికోసం వచ్చాడు.

రామం అయితే, తల్లికోసం ఆశతో వచ్చాడు—కానీ అతడు చూచింది తల్లిని కాదు. అంతి క్రితమే నూతిలోంచి తీయబడిన ఆమె శవాన్ని — వంకర టింకరగా, ఆమె చేత వ్రాయబడి, టేబులుమీద వున్న వుత్తరాన్నిని.

నాయనా రామం!

నిన్ను చూదామనుకొన్నాను. కానీ చూడలేక పోయాను. ఈ పాపిష్టి ముఖం చూపకుండటమే — మంచిదని, నాకు తోచింది.

నే పోతున్నందుకు నువ్వు విచారించకు.

నిన్ను చూడలేకపోయాను. కానీ నీవు ఆనాడన్న మాటల్లో నిజం — నే యింతక్రితం చూశాను.

ఏమైనా కమల నీ భార్య. అది దుడుకు పిల్ల. నీకు నామీద యేమైనా ప్రేమవున్నపక్షంలో — దానిమీద నువ్వు చేయి వేయకూడదు.

అవమానం మీద పడింది. మరి బ్రతకలేక యీ పని చేశాను. మీరు కలకాలం హాయిగా బ్రతకండి.

నీ తల్లి,
శాంతమ్మ.

"అమ్మా! నీ విలువ గుర్తించని యెటువంటి మూర్ఖుడనమ్మా..." అని తల్లి శవంమీద పడి రామం బావురుమన్నాడు!

# ఏమనో భావా

శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

కరవీర కుసుమమూ, గులాబీపూవూ కళ్లు తెరిచాక దాదాపు ఒకే మోస్తరులో ఉంటాయి! మొగ్గలుగా ఉన్నప్పుడు చూస్తే, ఒకటి గుడీ, ఒకటి గోపురంలా అనిపిస్తై! దీని లోతు కనుక్కుందామని అన్వేషణ కోసమే కాచుక్కూచుంటే మటుకు ఇంద్రజాలంవలె ఎప్పుడో ఒక అదృష్ట గడియలో అకస్మాత్తుగా అవి రవసెల్లాలలోనుంచి తొంగిచూసి కిలకిలా నవ్వే ముగ్ధవధువు వలె ప్రఫుల్ల నేత్రాంచలాలను రెపరెపలాడిస్తవి! మనం ఆ సమయానికి కునుకు తీస్తోనూ ఉంటాం! ఈ సమన్వయం ఎట్లాగు? దారిన పోతోంటే కాలికి ముల్లూ గుచ్చుకోవచ్చు!- అనిమిష సౌందర్యవతీ కనిపించవచ్చు!!—దానికీ దీనికీ ఏం లంకె న్యాయానికి?! — కాని విచారించండి. కలి పాడా లేదా మహాకవి ఈ సూత్రాన్ని ?? — ఒక వాక్యం ఒక్కసారే అతకదు! ఒక అర్థం ఒక్కసారే పొసగదు! ఒక భావం ఒకేసారి రాదు! రసం విషయంలోనూ అంతేనా ?......రసానికి స్థాయీభావమంటూ ఉంటుంది అసలు రసాన్నే స్థాయీభావంగా తీసుకుంటే !!—ఉచ్చారణ ఆదిగా భావాంత పర్యంతమూ ఉన్న జీవశక్తులన్నీ విభావాదుల వలె ఔపచారికంగా కూడి రసాన్ని రసంగా చేస్తవి! ఇది ఆలంకారిక మతానికి విరుద్ధమో, అనుబద్ధమో నాకైతే తెలియటం లేదు! నా ఉద్దేశం, ఆశా, ఏమిటంటే రస విశ్వసృష్టైన కవికి అలంకారాదులు ఐచ్ఛికమైన ఆభరణాలు కావాలె గాని, తుచ్ఛమైన బానిస సంకెళ్లు కాకూడదు. అని!;—ఏతావతా ఈవిధంగా రసమే స్థాయి అయిందనుకుందాం, అయితే అది మటుకు ఒక్కసారే దిగుబడీ అవుతుందా ??—

నా చేతిలో కలం లేదు. ఇది రాస్తున్నప్పుడు కాదు సుమండీ! ఎప్పుడో! అప్పుడప్పుడూ! అప్పుడు మాత్రం కవిత్వం రాదూ!? తీగ కదిల్తే ప్రాణం కదుల్తూనూ ఉంది, దివాంధాలు పాడితే ఆవేళ మధుపూర్ణంగానూ ఉంటున్నది!— మే మేమన్నా పాడినా అవి కవులమాటల్లేండి అంటారు! ఏం పాడినా కవిత్వాలు అంటారు! నిజమే. కాకుండా ఎట్లాపోతై! కాని ఆ మాటలు సహృదయునివేనా అని నాప్రశ్న? అవునంటున్నారూ,...నా మనసునెంట రాండి రకరకాల రంగులూ చూపిస్తా మీకు!

అవిగో! అవి కాకులు. ఆ యేటిలో చూడండి! నీటిదరినే అన్నీ కూచున్నై! ఒక్కొక్కటే, రెండు రెండూ ఇట్లా వెళ్ళి జలకాలాడి మళ్లా వచ్చి ఆ తీరంలోనే వాల్తున్నాయి! ఎంత శుభ్రంగా స్వచ్ఛంగా ఉన్నాయో వాటి ఒడళ్లు!!...నే నన్న ఈ శుభ్ర స్వచ్ఛపదాలు విని మీరు కాకు లెక్కడైనా తెల్లగా ఉంటాయా, ఉన్నాయా! ఇవన్నీ కవుల మాటలు అని ఇట్టే ఎట్లాగో అని పోతారనుకుంటాను! మీరు మంచివారు గనక అట్లాగూ అనరు! ఇప్పుడు మీ యెదుట లేనిదీ—నా కళ్లలో ఆడేదీ ఒక చిత్రాన్ని నిదానించండి!—

అది కొబ్బరిచెట్టు. దానికి వంపుగా సొంపుగా, వాలి కదిలేమట్టలూ, ఆ కొమ్మకు వరసగా, కుదురుగా తోరణంవలె కూర్చిపెట్టున్న ఆకులూ, వాటిమీద:— ఉదయాన్నే ప్రసరించుకొంటి, మలిసంజనే మనసుకు తెచ్చుకోండి — బాల సూర్యుడి సుకుమార అరుణ హస్తకిరణాలు గానీ, వృద్ధభానుడి పండిన ఎఱ్ఱని చేతుల రక్తకాంతి పడిగానీ, ఉన్నప్పుడు కోమల మలయ సమీరానికి ఒకటొకటే క్రమంగా కదుల్తూ వస్తోంటే ఉంగరాల చేయి మెట్లమీద సంచలించే నవకం స్ఫురించి, 'అరుణాంగుళీచ్ఛాయ దంతపు సరకట్టు లింగిలీకపు వింత రంగులీన!' అన్న అక్షర వీణాతంత్రి మీకు కనబడుతుందనుకుంటా!— శరద్రాత్రుల్లో ఐతే చీకటిలాటి గోపాలకిష్టమ్మ ఎక్కడో నక్కివుండి వేణుదండంమీద గర్భకేతకీ దళంవంటి వన్నెల వేళ్లతో చాలనం చేస్తున్నట్టు, ఈ దృశ్యాన్ని ఊహిస్తాం చటుక్కున! ఆ ఊహ అంతటితోనే ఆగితే బాగుండు! ఆగదు! అవ్యక్తంగా ఆ వీణా వేణుగానాలు మనః కర్ణాలలో నదించుతూ, గుండెకు రెక్కలు తొడిగి ఏ గంధర్వలోకాల్లోకో తీసుకుని

పోతే! అక్కడ ఏ రంభైనా ఏ అలకాపట్టణోపాంత ఉద్యానవనంలాంటిచోటనో అవుపించి అది ఈ నిసంగీతాన్నే మరపించగా రావణుడు చేయిజేసుకోబోయి పరాభూతుడే అయినా, బడాయికోరు బావగారిలాగా స్వస్థలం చేరుకోవడమో — లేక అక్కడ ఏ వరూధినైనా రత్నసానువుకోనలో, భోగమంటపంలో కనిపించి, లోకాలకి దారే తోచకుండా చేసి ప్రవరాఖ్యుడిమీదపడగా ఆ బ్రాహ్మడు 'హా శ్రీహరీ' అంటూ ఆమెను వెనక్కి నెట్టి నివీతి చేసుకుని, గంగాజలంలో తనవంటి కంటుకున్న కస్తూరీ కర్దమాన్నీ గంధచందనాల్నీ ప్రక్షాళించుకుని, గండూషించుకుని దేముడిదయవల్ల కొంపకి చేరుకోవటంతో, నీవు మళ్ళా నీ కాళ్లకింది భూమ్మీద నిల్చి నిట్టూర్పు పుచ్చుటందాకా సాగుతుంది ఆ భావం! దీన్నింకా సాగించి చూస్తే రామాయణ భారతాలు గిర్రున తిరుగుతై! కాని—నీ భావం పైకెగిరి స్వేచ్ఛావిహారంజేసి భూమ్మీదికి దిగేదాకానే దాని రమ్యత! అంతవరకే అది కవిత్వమౌతుంది పాకంబడితే! మిగతాది పాండిత్యమే అవుతుంది పట్టుబడితే!! కవిత్వం కాంతా సమ్మితంగా ఉండాలా ? చండామార్కులవారిబడిలాగుండాల్నా !

ఫలితార్థం: ఇప్పుడు నేను చూపిన ఘాతప్రతిఘాతాలవల్ల భావంవలె-ద్వారా-రసమున్నూ దిగుమతీ అవుతుంది అని;

ప్రస్తుత వక్తవ్యాంశం రసచర్చ గాదు — కలం చేతులో లేనప్పుడు కవి మనోభావాలు ఎల్లాగుంటాయో చూడటం!

చెరువుగట్టున్నే వెళ్ళి కూచున్నాం స్నేహితులం నలుగురం! అలలు అడ్డంగా మా వేపుకి ఉరికివస్తున్నాయి! సర్పయాగంలో ఆహుతి నిమిత్తం ప్రేషయిచ్చేసరికి నాగసంతానమంతా కదిలిపోతున్నట్టు అనిపించింది నాకు. ఆపుకోలేక దగ్గరేఉన్న మిత్రుడితో అనేశా ఈ భావం! వాడు: పందెపు గుర్రాలలా దౌడుతీస్తున్నై అని ఎందుకనుకోగూడదు? అన్నాడు, — ఇంకో నేస్తం అన్నాడు స్నేహితులంతా కలిసి ఈతకొడుతున్నట్టు ఎందుకు భావించరాదు? అని. నాకైతే సొగసుగావున్న దనిపించింది ఇదంతా! ఒక్క వస్తుసందర్శనం చేతే ఎన్ని లోకాలు వచ్చాయిరా భావనకు' అని;—పద్యం అల్లుకుంటూనూ వుంది లోలోన! "పడుచుపాముల మోస్తరు పరువులెత్త-—నొకటికంటెను ముందుగా నొకటి ఉరికి" రాతామంటే చేతులో కలం లేదు, ఇంటికి వెళ్లేదాకా ఈమూల ఈ పరువంగానే ఉంటుందా వాడిపోకుండా? అసలుంటుందా అని ? కర్పూరపుదండలా హరించిపోదూ!!......

నిజంగా ఇదీ ఒకందుకు మంచిదేనేమో!... ఎప్పుడూ కలం కాచుకునుంటే తోచిన భావాన్నల్లా రికార్డు చేస్తూపోతే, ఇప్పటికప్పుడే సవాలక్షగ్రంథం పెరిగి దారిని పోయేవాడు సైతం తప్పుకు తిరగాల్సొచ్చేది ఈ దస్తరంలో చిక్కేమూ అంటే దాటటం కష్టంరా అని; ఇలా ప్రతీ కవీ రచనచేస్తూపోతే గ్రంథభాండాగారాల్లో కాలుబెట్టేసందు దొరక్కపోవటం సంభవించి — సత్యాగ్రహోద్యమాల్లో జైళ్లు చాలకుంటే, ఎక్కడెక్కడి బంగళాలూ, భవనాలూ చెరసాలలైనట్టు, కాగా 'అనంతావై వేదాః' అనే స్థితిలోపడి కవిత్వం, —కొన్నాళ్లకు ఏ ఋషికల్పుడో ఆ సందోహంలోంచి ఓ గుప్పెడు దీసి బైటపెట్టటం, ఇంకొన్నాళ్ళకు అంతకుమించిన మహర్షోకడు బైల్దేరి, ఈ కాస్తనే ఇదే బ్రహ్మాండం అని చెప్పి దాన్ని వివిధవిభాగాలుగా చేసి, శంఖంలో నీళ్లుపోసి 'తీర్థం' అంటే, నెత్తినో రెండు చినుకులు దులపరించుకుని తలా ఉద్ధరిణెడూ పుచ్చుకోటంవరకూ వచ్చి, మిగతా రైళ్లకొద్దీ ఉన్న గ్రంథమంతా అడివో అగాధమో అయి గప్‌చిప్‌గా మూలుగుతోండేది!!... మూలిగేనక్కమీద తాటిపండు పడ్డట్టు—ఇప్పుడేదో ఒక మహోగ్రర్మదేశం పాతసాహిత్యం కొత్తసాహిత్యాన్ని తన పాషాణహస్తాన్ని చాచి గొంతు నులుముతుందని అబాపతు పుస్తకాలూ, పుస్తకాలయాలూ అర్ధణా అగ్గిపెట్టెకు అప్పజెప్పారుట!—అల్లా మన దేశంలో జరగటానికి వీలే లేదనుకోండి. కాని అడియేం దాసోహమని అయ్యగారి పాదాల్ని గట్టిగా పట్టామా అంటేమట్టుకు, ఇప్పటి అర్ధణా అగ్గిపెట్టె సగం ఔతుందని అశించవచ్చు గనక మనం, కానీనిప్ప పెట్టె కడుపులో ఆ గుప్పెడూ, ఈ గుండిగెడూ, కరిగిపోతే!! ... అటువంటవకాశాన్ని కవులియ్యకుండా కలం కొంత కాపాడుతోందనుకుంటూ సమయానికి హాజరుగా నుండనందువల్ల!!—

అనేక సందర్భాల్లో, స్థలాల్లో, అకస్మాత్తుగా మెరుపు పురుగువలె మనోభావం విస్ఫురగానే ఒక గుర్తు వేసుకోకపోతే అది అల్లానే మాయమైపోదూ!! అలాగా చిహ్నం చిత్రించుకోటానికి కలం లేకపోవటం నష్టం గాదూ!! ఈ వాదమూ సత్యమైందిగానే కన్పిస్తోంది!

వెనకటికి 'గాలీబ్' అనే ఒక ఉర్దూ మహాకవి కలం చేతిలో లేనప్పుడు ఏవో భావాలు పుడితే పద్యంగానో, పాటగానో, మనసులోనే రెట్టించుకుని గుణించుకుని దగ్గర దస్తీవుంటే దస్తీనో, లేదా తాడుంటే దాన్నో లేదా చొక్కా అంచుల్నో ఆ పద్యాన్ని మనసులోనే పాడుకుంటూ, చూసుకుంటూ గుర్తుగా ముడి వేసే వాట్ట! ఆ రకంగా ఎన్ని పద్యాలు వస్తే అన్ని ముళ్ళు! షికారు వెళ్ళినప్పుడుగానీ, పడుకుంటే నిద్రపట్టనప్పుడు గాని, బైటికి పోయినప్పుడు గానీ, ఎప్పుడైతే గానియ్యండి కలం చేతిలో లేనప్పుడు!! తర్వాత ఎప్పుడో, తీరికా — ఓపికా చిక్కాక తాపీగా ఒక్కొక్క ముడినీ జాగ్రత్తగా చూసుకుంటూ, విప్పుతూ ఒక్కొక్క పద్యం ఏమాత్రం భాషా—భావమూ దసలకుండా, మాచిరాత మాదిరిగా రాసేసేవాట్ట!! — 18 శతాబ్దంలో 'వాల్టైర్' అనే ఫ్రాన్సుదేశపు కవిశ్వరుడూ భావవిప్లవం లేవదీసిన నేరానికి జైల్లో పెడితే, అక్కడ అతనికి కాయితాలూ—కలాలూ ఎక్కణ్ణించి వస్తై? భావాలు ఎల్లా ఉద్బుద్ధం కాకుండా ఉంటై!! శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు ఉండనే ఉన్నాయిగదా? అచ్చుపుస్తకాల్లో పంక్తి పంక్తికీ మధ్యనవున్న స్థలంలో అక్కడ ఏ రెక్కకు, ఏ బొక్కకు ఉంటే సంగ్రహించేవాడో సీసపు పేకుల్ని! వాటితో సంక్షిప్తంగా రాసిపెట్టుకుని, విముక్తుడైనాక చక్కగా తీర్చిదిద్దుకుంటే వాడట! ఇల్లా ఎంతో గ్రంథజాలాన్ని!! సరేనా. ఇది వినండి. నమ్మతగిందిగా అయితే అనిపించదు! నన్నయ్యగారి భారతం చదివాక ఈ హోదాలో మన తిక్కన్నగూడా రాయగలడా అని ఒకపద్యం అందులోది రాసి భటునితో పంపించినాడట మనుమసిద్ధి మహారాజు — ఆ సమయంలో వేశ్యాగృహంలో ఉన్నారట తిక్కన సోమయాజులు! ఈపద్య లేఖనం చూశారు. రాయటానికి అక్కడ లేఖిని ఏదీ!? నోట్లో తాంబూలం ఉన్నది. చేతిలో పలుగుట్టుకునే పుల్ల ఉంది. ఆ తమ్మరసంతోనూ అదే పుల్లతోనే జవాబు పద్యం రాసి పంపారట! అది చూసి రాజుగారు సర్వకళామూర్తి—భారతరచనకు అర్హుడని ఉప్పొంగిపోయి మర్నాడు సభలో తాంబూలజాంబూనదాగ్రహారాదులిచ్చాడట కవికి! ఇది పండితజన పరంపరాశ్రుతి!—అందాకా ఎందుకు మన అల్లసాని కవీంద్రుడు ఏమని ఆరాటపడ్డాడు. ఈయనకు కలం చేతబట్టి రాయటం అలవాటుండేదిగాదు. రాజకవి గదండీ!! 'ఊహ తెలియంగల లేఖకు' డుండాలిట! అలా దొరక్కనే కాబోలు ఒక్క మనుచరిత్రంతోనే కిక్కురుమనకుండా ఊరుకున్నాడు! ఈనగారి లేఖకుడుంటే, మనకు లేఖిని అన్నమాట. వీరందరికీ, ఎప్పుడు బడితే అప్పుడు కలం ఎదురుగా సిద్ధంగా వుంటే ఇంకెంత అమృతభాండారం బద్దలయ్యేదో!!

పుష్పబాణుడు మనసిజుడైతే, భావసుందరి మనసిజ కాదూ!! ఒక్క రుద్రుడిపేరు చెబితే మన్మథుడు దద్దరిల్లుతాడు! ఏకాదశరుద్రు లెదురైనా మనసిజ కొనసిగ కదుల్తుందా?!.... కాని ఏ చిగురుపచ్చ చిన్నబోయినా; ఏ నవోఢ నాథుణ్ణి రెప్పలు కిందుగా, సందుగా అందిపుచ్చుకోవటం చూసినా; ఏ బిచ్చగత్తె వొరుగులాంటి వడిలిపోయిన కాయంతో, చింపిరి తలా, చినుగు వలువల్తో నడవలేక నడుస్తూ వీధిలోంచి 'అన్నం అమ్మా' అని కేక బెట్టినా; గడ్డిపోచను కదపలేని గాలి తోలినా; దూరంగా ఎక్కణ్ణో ప్రియురాలి చూపుల్లో చూపూ, నోటిలో నోరూ ఉంచి మాట్లాడుకునే అతి నిశ్శబ్ద మందర సుందర కాకలీస్వనం వినబడ్డా; మబ్బు పరుగెత్తినా, మరకతాలు ఆరబరచినట్టున్న పచ్చని ఆకుమడిగట్టున కూచుని అన్నంమూట విప్పుకుంటూ, వర్షాభావంవల్ల వాలు మొహాలు వేసిన నారును జూసి కండ్లు చెమరుస్తున్న రైతుబిడ్డను గాంచినా; నరుసులుగక్కే దేహంతో కష్టాల కావిళ్లు మోసే కూలివాడి నొసటిరేఖలు అవుపించినా; ఇదంతా ఏమిటి చీమ చిటుక్కుమన్నా గిరుక్కున మళ్ళుతుంది మనసిజరూపిణి ఐన భావశ్రీంగారి! మళ్లీ!? అవకుంఠనవతి అవుతుంది!! కాబట్టే రూపకల్పన చెయ్యటానికి వెంటనే తూలిక చేరికగా వుండాలి. ఉంటేనే దూసుకుపోతూవుంటుంది ఒక్కొక్క తడవ!—ఇదే సందర్భమనుకోండి. పింగళి సూరన్నగారు 'ప్రభావతి'లో అన్నమాట, "ఏ యంగక మును

భావనచేయక వ్రాయంగరాదు, చేసిన నానందాయత్తత నుది చొక్కు పరాయత్తపు బుద్ధి" అని, గొంగళిపురుగు పాకినప్పుడు ఏమీ అనిపించకుండా తర్వాత నసిమిరి పుట్టినట్టు ఒకానొకసారి. భావోదయకాలంలో పరాకూ, చిరాకూ, కలిగి పిమ్మట గుండె పీసడుగా ఉండడమూ ఉన్నది!!

రసలుబ్ధుడు కవి, ధనలుబ్ధుడు భాగ్యశాలి; ఇక్కడ కవికి రసమే ధనం. ఎల్లాగైతే ధనలుబ్ధుడు ధనానికి మూలమైన ఎర్రని ఏగానీ దగ్గర్నించీ గణించి కూడబెడతాడో, అలానే రసలుబ్ధుడైన కవిన్నీ రసానికి మూలమైన భావాన్ని జాగ్రత్తచేసి యథోచితంగా వాడుకోవటం అన్యాయం గాదు! రచన చెయ్యాలని పనిబట్టి కలం కాయితం తీసుకూర్చుని ఎంత బుర్ర బరుక్కున్నా ఏమీ తోచక పదాలనాశ్రయించీ, పాదాలు దిద్దీ, పర్వతం ప్రసవిస్తుందన్నట్టు ఇదిగో పద్యం అని ఒకమాటల జాబితాను అక్కడ పారేసేదానికంటే ఎప్పుడే భావం కలిగితే దాన్నే దానికి తగినవిన్యాసంలో పద్యమో—పాటో—మాటో గీకిపారేసి తర్వాత తీరిగ్గా కూర్పుకు అవసరాన్నిబట్టీ, విలువునుబట్టి మార్పులూ చేర్పులూ చేసి బైటపడెయ్యటమో లేక అసలునే నిసలుచేసి ప్రకటించటమో చేస్తే ఎంత బావుండును!! ముఖ్యంగా ఖండకావ్యాలు రావాల్సినరాచబాట ఇదేననుకుంటూ! ఇల్లాగేవస్తే ఎంత బాగుండునో!!—భారతం ఆదిలో నన్నయ్యగారు వసంతర్తు వర్ణనం ఒఖసారే రాశారా! అనిపిస్తుంది! ఎంచేతో!! ఈమాటతో ఆయన్ను సామాన్యుడుగా సుతరామూ అనటంగాదు. మహాశక్తిమంతుడనే నాభావన! — కళాపూర్ణోదయం గాంచండి! ఎన్నిభావాల మహిమాన్విత విజృంభణమో! ఒక కథా!? ఒక కమామీసా!?—నూరన్నగారికి అప్పుడప్పుడూ తోస్తూ వచ్చిన భావాల్ని అవిఘ్నంగా కలుపుకుంటూ కథను కార్ఖానాజేసి కవిత్వం తయారుచేశాడుగాని శ్రీకారందగ్గర్నించీ చివరిదాకా పద్యాలబండి తోలివుంటాడనుకోను నేను!—భాగవతంలోనూ గంగావతరణంలోని వచనమూ, గజేంద్రుడి ఆక్రందనఘట్టమూ, రుక్మిణీదేవిగారి విరహమూ, భ్రమరగీతిలూ, పట్టుదలకు రాసినవా పోతన్న?!—ఎఱ్ఱాప్రగడ హరివంశంలో శ్రీకృష్ణుడి బాల్యాన్నీ గొల్లమండలిన్నీ చిత్రించారంటే!!

......ఇదేంశాసనాలు కెలికి వెలికితీసిన చరిత్రగాదు సుమండీ! ఖచ్చితంగా ఇంతే అనేటువంటితీర్పున్నూ గాదు! కనుకనే నేం జెబుతున్నా; శుకసప్తతీ—హంసవింశతీ; సంస్కృతంలోనైతే: మేఘసందేశమూ, అమరుకమూ, సౌందర్యలహరీత్యాదులున్నూ సద్యోభావతరంగిణులనే నాఉద్దేశం! "స్వర్గేపి దుగ్ధభావిద్యా గోపనీయా ప్రయత్నతః" అన్నట్టు ఇవన్నీ ఇలాంటివెన్నో ఏకమైనా, ఎవరైనా సరే తనుంతట తాము తెల్సుకోవాల్సిన బహిరంగరహస్యాలుగాని, ఒకరివల్ల తెలుసుకునేవిగానీ, ఒకరు చెప్పేవిగానీ కావు; చెబితే పాప మేముందిగాని అసహ్యం పుట్టొచ్చు!! శిల్పం పూవులాంటిది. దాన్ని విడమరిస్తే రెక్కలుతీసిన కుసుమదళకు వస్తుంది! నామాటనే జెబుతున్నా: అనేకసార్లు కలం చేతులో లేనప్పుడు నానాభావాలూ నామనస్సును పొదవుకొని నాట్యమాడడం లేకపోలేదు! ఒకొక్కమాటు ఒక్కొక్కమాటగా కూడా! ఇల్లాగే ఎంతవరకు, దేనిగా వస్తే, అల్లా మనసులోనే అల్లుకుంటూండడమూ ఉన్నది! తర్వాతనైనా అట్లాంటివెన్ని పైకి తీసుకువచ్చావంటే జవాబు సుగమం గాదు! మా దొడ్లో చింతచెట్టుంది. దాని శిఖల్లోంచీ ఎఱ్ఱని చిగురు కనిపిస్తే "చింతచెట్టూ చిగురు జూడూ—చిన్నదానీ సొగసుజూడూ" అనేపాట మొదట నాగుండె పాడుకుంటుంది ఏమిటో ఆ సామ్యధర్మం అని!—ఇంకొంచెంసేపు ఆ నల్లనిచెట్టును చూడకండా నే ఎఱ్ఱని ఆ చిగురు చూద్దునుగదా, కంళ్ళు మూసుకుని మరిట్టే, కోడిపుంజు నెత్తిమీది శిఖలా తోచింది! పుంస్కుక్కుటానికి, 'తామ్రచూడం' అని ఇదివరలోనే ఒక కితాబుంది! కాని 'ఆమ్లకిసలచూడ' అంటేనే ఇంకా బాగుంటుందేమో అనిపించింది! దాంటో రంగేగాని, దీంటో రంగూ, రేకా రెండూ ఉన్నైగనక అని;—నల్లని దీర్ఘకాయుడొకడు బుర్రమీసాలచాటు పెదవుల్లోంచీ మాంఛిబలిష్ఠమైన చుట్టను ఒక్కొక్క దమ్ము లాగుతూ బుస్సుబుస్సున పొగవదుల్తూ రంయి రంయిన పోతోంటే రైలు ఉరుకుతోందా అనిపిస్తుంది నాకు! 'తేగలాంటిపిల్ల' అంటే తేగక్కడుంది తెమ్మన్నాట్ట వెనకటికి నాబోటివాడొకడు! ఆమాటకొస్తే అధ్యాహారాలూ, తర్కాలూ, ఊహాలూ అన్నీ ఖాళీయే!!—చెప్పవచ్చింది: కొన్నిభావాలు

ఎన్నిసార్లకూ మసిగిపోవు. ఆ దృశ్యం-అలాటిదృశ్యం అవుపించే సరికల్లా మళ్లా ఆ నాటి—ఏ నాటిభావమో, సరీఘా స్ఫురించడమూ కద్దు, కొన్ని భావాలకైతే రూపం ఇవ్వటానికే వీల్లేదు. కలం, ఎంత బంగారు కలం చేతులోవున్నా! వాటినల్లా, అనుభవించి వదిలే సెయ్యాల్సిందే అగరువత్తుల ధూపంలాగా!!...... చూడండి! ఎంచేతో మళ్లీ నాకే ఈ అభిప్రాయంతో పొత్తు కుదరటంలేదు! ఏమంటే: ఎటువంటిభావానైనా తన కుశాగ్రబుద్ధిమత్త్వంవల్ల అరకొరలు లేకుండా కవి చూపవచ్చు, కలగాలి—

“అదిదాసి! తనను యావజ్జీవదాస్యంకోసం ఆకలితో వేగే తలిదండ్రులకు ధనమిచ్చి కొనుక్కున్న యజమానికి తెల్పకుండానే తనమనసులో ఏంనోములు నోచుకుందో రవ్వలాంటి ప్రేయసుణ్ణి చెట్టబట్టి ప్రణయవిహారం చేసింది. ప్రియుడు స్వాతంత్ర్యోద్యమంలో ఖైదులో పెట్టబడ్డాడు. తను నిరీక్షించి కృశించి హరించింది దాసి! — ఇంతకథకు నేను చెక్కిన శబ్దచిత్రం ఇది. “ముకుళహృదయమ్ము నీకయి పులకరించి విప్పి వాయుతరంగాల వెంట బోయి వెదకి వెదకి కన్నులలోని వెలుగు తగ్గి రెక్కల బలమ్ము రాలగా పాకెక్కె పూవు!” — ఒక మిత్రుడున్నాడు. అత నొకసారి చెప్పింది అవగాహించుకోనూ లేదు, తనకొ తెలియంది నిజం! అని ఊరుకుంటాడా. ఉహుఁ! ఒక్కనిముషం ఆపకుండా ఏదో ఉపన్యసిస్తూనే వుంటాడు శోకదంపుడుగా!! ఈ వూదరలో చిక్కుకున్న నాకు ఒక అమావాస్య ముందు రాత్రులలో ‘కీచురాయి’ సంగీతం వినబడింది. ఆ శబ్దచిత్ర మిది: “వీలునూ చాలు లేని రొదవెట్టెద వెప్పుడు, తెంపులేని గప్పాలను గొట్ట నీకు సరిగా డొకడుండ బళి! కీచురాయి! నిన్ మేలన నేను, తోచనను మెచ్చగ నీవునుగాని, సప్తనాదాలకు దూరమూ కోటవి దయ్యపు గొంతుక మెత్తురా జనుల్!!” అని.— సరే కవిత్వం కట్టటంలోవుండే సాధక బాధకాలు అపారం! కావ్య సంసార మిది! ఈ ఉదాహరణలిలా ఇచ్చుకుంటూపోతే కొంతమందికైతే కాలక్షేపార్థం పనికొస్తయ్ గాని, అవదల్చుకుంది అడుగున బడ్తుంది! కనుక విస్తరించను. ఇక్కడ నేను చెప్పదల్చింది గేమిటంటే, కవైనవాడు ఎల్లాంటి విషమసమస్యనైనా చాకచక్యంగా పరిష్కారం చెయ్యొచ్చు! వదిలేసెయ్యాల్సిన అగత్యంలేదు! అనీ! మబ్బుకు దివిటీలుపట్టే మెరుపులవలె కథకు, లేక కళకూ, కాక-కవికీ, కాంతినిచ్చేది భావశబలత అనిన్నీ!!

కాగా: ఇలాగే ఇంకెంతో ఉదాత్తమైన, ఉజ్వలమైన ఉపమలుగా భావాల్ని చిత్రించారు — చిత్రిస్తారుకూడా! మంచిదే!!...ఇప్పుడు మన ప్రసక్తి ఏమిటని? మాచిన భావం—తోచిన భావం, మాటలోనో—మనసులోనో, జాగ్రత్తచేసి సరిజూసి కొట్టినట్టు ‘ఢా’మ్మని మోగించాలి సమయానుకూలంగా అనిగదా!!? ఏమోయ్ నేస్తం ఇహ పెంచకుండా చెప్పు! అని నిగ్గదీశా, నీ అభిప్రాయం ఏమిటని; అతను ఆలోచించి ఆలోచించి, కలం చేతులో లేనప్పుడు గట్టుతెగిన వాహినివలె ప్రవహిస్తుందన్నాడు కవి భావం! నా కెక్కడా కొలానిందిగాదు! ఈ భావవాహిని ఇల్లాగే పోయి పోయి, “నదీనాం సాగరోగతిః” కావాల్సిందేనా? చక్కగా ఆనకట్టలు కట్టి—కాలవలు తీసి పండ్లూ, పంటలూ పండించి లోకానికి జీవప్రసాదం పెట్టొద్దూ!! ఏమోయ్ నెచ్చెలీ నీవే చెప్పాలి ఇది ఎల్లాగోనన్నా! అతనూ మొదలు ఏమనాలనీ అనుకోలేదని నా కప్పు డనిపించింది! ఇంతలో అతను మళ్ళా కించిదాలోచనాభినయం జూపి, ‘ఆ ప్రవాహం ఉచ్ఛృంఖలంగా పోగాపోగా ఎక్కడో - ఏ ఒకకొండలాంటి ప్రదేశమో అడ్డుతగిలి వెనక్కు పోటుకుని, ఉబికి ఉబికి సాగటమో! — తాను వెళ్ళే నేలను లోయవంటి ఏనిమ్నస్థలమో సంప్రాప్తమై అక్కడినుంచీ హఠిలి మోతలు పెట్టుకుంటూ పాటుగా దూకి పడి సాగటమో! — ఏ వంపులో — ఏ ముంపులో తగిలి, సుళ్లుతిరిగి తలప్రాణం తోకకు వచ్చినట్టు సాగటమో జరుగుతుంది. అందమైన ఈ వివిధ విధాల దెబ్బలూ, మీ మనసుల్లో మాసిపోవు; అంతవరకూ విస్మరిస్తారు! ఎప్పుడయితే ఆ ఘటన నీకు తగిలిందో ఆ పూర్వపు గుర్తులన్నీ సాక్షాత్కరిస్తై ఎప్పుడా ఘట్టం వస్తేనో, అంతే! అప్పుడు రాస్తే అందంగా ఉండకపోదు! అప్పుడు రాసేస్తేనే అకృత్రిమంగా ఉంటుంది. కాని కలం ఉండాలి— రెండోది: మీ ఉద్దేశంప్రకారం తోచిన భావం తోచినప్పుడు ఉటంకించుకుని ఉంచుకుని రచనలో రంగరించుకుంటే, జీడిపప్పు పంచదారపాకంలో వేసుకున్నట్టు దట్టంగానే ఉంటుంది అని నవ్వాడు! అంతో ఇంతో నాకూ ఆహ్లాదం కలిగించి ఈమాటలకు!—

సీరియల్

# జయాపజయాలు

## ‘శండిల’

* గతసంచిక తరువాయి

### 9

వరహాలు ఒకనాడు ఏకాంతంలో అబ్బాయి భార్యతో జరిగినదంతా చెప్పింది. భర్తను అతని ప్రయత్నంనుంచి వారించమని బ్రతిమాలింది. కాని ఆమె దాన్ని పెడచెవిని బెట్టింది. తన భర్తకోసం ఏమైనాసరే చెయ్యడానికి వరహాలు సిద్ధంగా వుండా లన్నట్లు వ్యక్తంచేసింది ఆ యిల్లాలు. ఒక పేదరాలు, దాసి, తలదాచుకోడానికి నీడ లేనిది, అనాథ, అరక్షణీయ—దీనికింత అభిమానమా అని చీదరించుకున్నట్లుంది ఈ ధోరణి. స్త్రీ సహజమైన సౌకుమార్యం గూడా లోపించింది ఆ పడతిలో. ఇట్టి అతివ గూడా వుంటుందా లోకంలో అనుకుని వరహాలు విస్తుపోయింది. "సరే—నీ కర్మ" అని అనుకొని ఇంక ఈమెకు చెప్పి లాభంలేదని నిశ్చయించుకొంది. అబ్బాయినుండి అనేకసార్లు తప్పుకోవడానికి శాయశక్తులా ప్రయత్నించింది.

అబ్బాయి సామాన్యుడు కాదు. ఎప్పటికప్పుడు ఎత్తుపైయెత్తులు వేస్తూ నేవున్నాడు. ఆమెను వెనుదరిమి కవ్వించి కసి ఎక్కించాడు. ఇంతటి ఘర్షణ సంగతి ఒకవంతు: వరహాలు—స్త్రీ—అందునా అసాధారణమైన ఆడుది—అన్నది మరొకవంతు. ఆమె అబలత్వానికి లొంగిపోయింది; కాదు కాదు ఆమె వలలో పడిపోయాడు అబ్బాయి. సాలీడు పన్నిన పద్మవ్యూహంలో మరొక మక్షికం చిక్కుకొంది. తొలినాళ్ళలో ఎంతో ఆనందం అనుభవించిన అబ్బాయి క్రమక్రమంగా పాలిపోయి లోపల్లోపల ఏదో ఆవేదనతో తుదకు వరహాలు అంటే భయపడేస్థితికి వచ్చేడు నెల్లాళ్ళలో. అతని పరిస్థితే మారిపోయింది. ఇంట్లోంచి ఇవతలకు రాడు. కారణం ఎవరికీ చెప్పడు. ఒకనాడు రంభలాగ అవుపించిన వరహాలు ఇప్పుడతని కంటికి కామరూపంలో వున్న మహారాక్షసి.

ఒకనాడు ప్రొద్దెక్కి వచ్చాడు చౌదరీ ఇంటికి. అబ్బాయి స్థితి నానాటికి క్షతిమించి పోతోందని తెలుసుకున్నాడు. ఆ రాత్రి రహస్యంగా వరహాలును పిలిపించాడు—కళ్ళెర్రజేసి ఉరుముతున్నట్లు ప్రారంభించాడు—

"త్రాచుపాముని తెలియక తలమీద పెట్టుకున్నాను కూటికి పేదలు గాని గుణానికి పేదలా అని భ్రమించాను గాని కులటవనుకోలేదు."

వరహాలు ఏమీ సమాధానమియ్యలేదు. ఇవ్వదలచుకోలేదు. నేలవంక చూస్తూ కుడికాలి బొటన వ్రేలితో వృత్తం చుడుతోంది.

"ఇంతకంటె చిప్ప పుచ్చుకుని అడుక్కోగూడదూ? ఆ అయ్యరును నాశనంచేసినదానవు నువ్వే అంటే నిజం కాదనుకొని నిన్నాడిపోసినవాళ్ళందరినీ తూలనాడాను... సాగుతూంటే పెళ్ళెందుకూ? ఛీ! వెధవ వృత్తి!" పురుగును వొంటిమీదనుంచి ఏరి పారేసినట్లు ఆయన దూషణలోని చివరి చురుకు చబుకు దెబ్బలాగ ఆ పిల్లకు తగిలింది. దానితో ఆమె అభిమానం పడగెత్తింది.

"చౌదరి గారూ! నేను చిన్నదాన్ని. మీలాగే మాట్లాడగల్ను. కాని నాచేత వాగించకండి" ప్రాధేయపూర్వకంగా అన్నది.

"ఛీ—నోర్ముయ్. చిన్నదిట చిన్నది! పెద్దళ్ళ కొంపలు గుల్లచెయ్యడానికి బయలుదేరిన పింజారి."

"ఇక చాలండి. పెద్దవాళ్ళైతే అయ్యారు గాని ఇంక తగ్గించండి. ప్రమాదమొస్తుందని ఒకసారి గాదు,

లక్షసార్లు అబ్బాయితో నేగాదు—కోడలితో గూడా చెప్పాను. నేను ఏం చేసినా లోకువే—బ్రతికి చెడ్డ వాళ్ళపాటే అంతలెండి. ఒదిగివుంటే ఒక తప్పు; ఒదొక్కపోతే మరో నేరం. మీ అబ్బాయి ఆడిన మాటలు, చేసిన చేతలు నా నోటంట చెప్పరానివి. మీరేమనుకున్నా సరే ఒక్కటి మాత్రం ఖచ్చితం చెయ్యదలుచుకున్నాను. ఇందులో నా తప్పేమీ లేదు. నేనే గాదు, ఏ ఆడదైనా ఇలాగే చేసి వుండేది"

"సరేలే—ఇంక నీ నీతులనవసరం. దయ చెయ్యండి బయటకు. వారం రోజుల్లో మరో మకాం చూసుకోండి. ఇంకెంతమాత్రం మీరిక్కడుండడానికి వీల్లేదు." ముడిగా ముగించాడు చౌదరి.

మరునాడు ప్రొద్దుటనే పట్టణంనుంచి డాక్టరును ప్రత్యేకంగా పిలిపించారు అబ్బాయిని పరీక్ష చెయ్యడానికి. డాక్టరు శ్రద్ధగా కేసు తనిఖీ చేశాడు. కిటికీ ప్రక్కగా గోడవారన నిలబడి వరహాలు ఈ తతంగమంతా చూస్తూ డాక్టరు చెప్పేదంతా వింటోంది. చౌదరీ, డాక్టరూ అక్కడనుంచి వీధిలోకి వచ్చారు. వీధిగదిలో ప్రత్యేకంగా డాక్టరుకు టిఫెనూ, కాఫీ యేర్పాటు చేశారు. కాఫీ త్రాగుతూ సావకాశంగా చెబుతున్నాడు డాక్టరు. "చౌదరిగారూ! వ్యాధి చాలా గడ్డది మన పెద్దలు ఊరికే అన్లేదు "అర్ధగంట భోగం; ఆర్నెల్లు రోగం" అని. సరిగా కుదుర్చుకోకపోతే ఏడు తరాలు ఏడిపిస్తుంది ఈ జబ్బు. అబ్బాయికి ఒళ్లు సరిచెయ్యడానికి లేదంటే నాలుగు నెలలు పడుతుంది. పడుచుదనపు బింకం ప్రకటిస్తే ప్రాప్తించే విష ఫలితాలివే. సుమారు నాలుగు వందలు రూపాయలు ఇంజక్షన్లకే అవుతాయి. తర్వాత ఫీజు మాట మీరున్నారు; నేనున్నాను" అంటూ లేచాడు. చౌదరికి గుండె బరువెక్కి కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

తర్వాత కోడలిని కూడా చూడమన్నారు. ఆమెనుగూడా పరీక్షించి డాక్టరు అయిదు నిమిషాల్లో తేల్చేశాడు. "చూశారా! తనతోబాటు ఆ సౌభాగ్యం భార్యకు గూడా పంచిపెట్టాడు. ఇంకా వ్యాధి ఈమెలో తీవ్రరూపం దాల్చలేదు. క్రమేపీ వేళ్లు పాదుకొంటుంది. వీళ్లు చేసిన నేరాలకు ఆగామిసంతతి కఠిన శిక్షలు అనుభవించాలి. చచ్చి పుట్టే బిడ్డలు, అంగవైకల్యంగల శిశువులు, అనాసలు, పీలవాళ్లు—ఒకటేమిటి చెప్పరాని అనేక అవగుణాల కుప్పలుగా పుడతారు పిల్లలు. ఈమెగూడా జాగ్రత్తగా మందు పుచ్చుకోవాలి." డాక్టరు లేచి బయలుదేరాడు. వరహాలు వింటూనే వుంది ఈ మాటలన్నీ చాటుగా. కొంచెం సానుభూతికూడా కలిగింది. సర్పదష్టులై నేల కూలినవాళ్ళకువలె వ్యాధిపీడితులైన ఆ దంపతుల్ని తలుచుకుంటే. కాని తానేమి చేయగలదు? సకాలంలో ఇరువురను హెచ్చరించింది. ఆమె హెచ్చరికను వాళ్లు మరోకలాగున అర్థం చేసుకున్నారు. శిక్ష అనుభవించాల్సిందే—

అవాళ సాయంత్రం ఎవరూ లేని సమయం కనిపెట్టి నచ్చిచచ్చి అడిగాడు కొడుకుని తండ్రి. తాను అనుకున్నదే నిజమయింది. "దీనికంతకీ అదే నా కారణం?" గద్దించాడు.

"కాదు నాన్నా—నేనే కారణం. కళ్ళూ వొళ్లు తెలియాలేదు. ఆమె జాగ్రత్త అని ముందే చెప్పింది. నే వినలేదు. ఇప్పు డనుకొని ప్రయోజనం లేదు." బాధతో అన్నాడు కొడుకు.

"చెప్పిందట! ఏం చెప్పింది దాని మొహం. కూర్చోడానికి తావిస్తే పడుకు నేరకం. అసలు వీళ్లను చేరనియ్యడం నాదీ తప్పు. ఎప్పుడూ పరాయి ఆడదంటే ప్రక్కకు తప్పుకోనే నీకెలాగ పుట్టిందిరా ఈ బుద్ధి?" చీదరించుకున్నాడు చౌదరి.

"ఇది నా కర్మ నాన్నా. పాపం! దీనిలో వరహాలు నేరమేమీ లేదు. నువ్వేమనుకున్నా సరే" అంటూంటే పొరుగింటికెళ్ళి పిడకతో నిప్పు తెస్తున్న వరహాలు ఆ తండ్రీ కొడుకుల సంభాషణలోని ఆఖరు మాటలు విని లీలగా లోలోపలనే మందహాసం చేసుకుంది.

## 10

వరహాలుకు చౌదరి ఉద్వాసన చెప్పగానే ఊళ్లో చక్కని ఇంటి నొకదాన్ని అద్దెకు తీసుకుంది. కొందరు ఆమెను ఎగాదిగా చూసి తమ కొంప లివ్వడానికి అభ్యంతరం తెలిపారు. ధనాశ కొందరిని అన్ని అవరోధాలకు దూరం చేసింది. ఆఖరికి అయినింటివాళ్ల యిల్లే దొరికింది. సుమారు ఒక నెల గడిచే వరకు ఆమె తన భవితవ్యం నిర్ణయించుకోలేదు. దానికి కారణం ఆమె తండ్రి మంచంబట్టడమే. రోజు

మనసుతో బాటు శరీరంలో కూడా రోగం ఎక్కువయ్యింది. పైకి చెప్పలేకపోతూ లోపల్లోపలనే తన కూతురు నశించడానికి కుళ్ళిపోతున్నాడు. మానాభిమానాలు అతన్ని మ్రగ్గబెట్టాయి. పౌరుషానికే బ్రతుకున్నది అంతరాత్మ. క్రమంగా తీసుకు తీసుకు చావడమే శరణ్యం అన్నట్టు శాసించింది లోకం. అన్యాయానికి, దౌర్జన్యానికి, అవినీతికి కాలం తాళం వేస్తుంది. తన కుమార్తె పాడి దప్పింది అనుకుంటూ రాత్రింబవళ్లు నిద్రాహారాలు మానుకొని కట్టె అయిపోయాడు తండ్రి. ఆ ధోరణి అసలే కుదరదు అనుకున్న వరహాలు ఏరోజు కారోజు ఏపుగా పెరుగుతోంది. డాక్టర్ల చేత మందూ మాకూ యిప్పించింది తండ్రికి. కాని ఆ ప్రాణి నిలవలేదు. నానాటికీ కృశించి, నీరసించి, ఆ కుటుంబంలోని మిగతా యిద్దరినీ పీల్చి పిప్పిచేసి తుట్టతుద కొకనాటి రాత్రి కాలం చేశాడు.

తండ్రిపోయి దుఃఖించే వరహాలుకు గాని, ఆమె తల్లికి గాని ఊళ్ళోవాళ్లు పల్లెత్తు సాయం చెయ్యలేదు. తను నిల్వ వుంచుకున్న అయిదు వందల్లోనూ రెండు వందల రూపాయలు ఖర్చుపెట్టి తంతు జయప్రదంగానే ముగించింది. ఇంట్లో ఇప్పుడు తానే యజమాని గనుక క్రమేపీ ఆమెలో పురుషులను మించిన గుండె నిబ్బరం, గడుసుదనం నాటుకున్నాయి. ఆడదానికి స్వతహాగావుండే కోమలత్వంకూడా ఆమెనుండి అంతర్ధానమై మొద్దుబారిపోయింది. కేవలం స్వశక్తిపైనే ఆధారపడి అభిమానంతో తన పెత్తనం తానే చలాయించుకుంటోంది. తరచు తన వ్యవహారాలకు అడ్డం తగ పెట్టే తల్లిని కూడా గదమాయించి శ్రీసిరాజని ఆమెను మూలబెట్టి అధికారం చలాయిస్తోంది. లోకం మీద ధ్వజమెత్తడానికి మళ్ళీ లేచి నిలబడింది.

కాలం వడిగా మళ్లిపోతోంది. చూస్తూంటే నెలలు గడచిపోతున్నాయి. పుండ్లు మానినట్లు వరహాలు బాధలు కూడా సమసిపోతున్నాయి రోజుల మాతల్లో. మళ్ళీ ఆమె అందాలు కసిగా త్రాగడానికి ఊళ్ళో వేట మొదలైంది. పెద్ద పెద్ద యిళ్లలోంచి కొందరు సిగ్గు విడిచి తనకోసం కబురంపడం, వందలకు వందలు ఆశ చూపడం ప్రారంభం. వరహాలుకు ఎర చూపి కొందరు, ఆమెను ఓదారుస్తున్నట్టు నటించి కొందరు తమ వాంఛలు తీర్చుకోడానికి ఎగబడ్డారు. వరహాలు దీన్ని జాగ్రత్తగా గమనించింది. బాగా ఆలోచించి, కార్యక్రమం స్థిరపరచుకుని ఉచ్చులు పన్నింది. ఆమె వలలో ఒక్కరొక్కరే యువకులు పడడం ప్రారంభించారు.

ఒకడు షావుకారు. మూడు వందల రూపాయలతో వాలాడు ఆమె ముందు. ఆమె 'ఊఁ' అంటే గులాముగా వుంటానని ప్రాధేయపడ్డాడు. అయ్యరు అమాయకత గాని, అబ్బాయి దౌర్జన్యం గాని వీడిలో లేదు. వీడు వట్టి నీచుడు. ఏ సుఖమైనా సరే డబ్బుతో కొనుక్కుంటానంటాడు. డబ్బుకోసం ఎంతటి నీచాతినీచానికైనా ఒడిగడతాడు. వీడి పతనం తేలికగా జరిగిపోయింది. వరహాలుతోడి పదిహేను రోజుల సాంగత్యం క్షణ పడగొట్టడానికి సరిపోయింది. చిబుకం పట్టుకొని బ్రతిమాలుకొంది, "పిచ్చివాడవై పోతున్నావ్. పుట్టగతులుండవు మళ్లీ" అని హెచ్చరించింది. కాముం ఎటువంటివాడైనా శుద్ధిచేస్తుంది. కామకోలక చేసేటులా అర్థాన్నీ శరీరాన్నీ తగలేసుకున్నాడు. లోకంతీరే అంతేమో! కష్టించే వాళ్లైనా, నీతినియమాలకోసం నిజాయితీగా బ్రతికే వాళ్ళను ఎకుకలకంటూ నెత్తురును పీల్చేసి వాళ్ళ యిబ్బందులపై డబ్బుచేసుకొంటుంది. తప్పు అని తెలిసి, తనకు నాశనకారి అని గ్రహించి తమకుగా తాము అవినీతి అనే అగ్నిగుండంలో కళ్లు తెరచుకుని దిగి విష ఫలితాలను అనుభవిస్తూ, తమ బంధుమిత్రులచే అనుభవింప చెయ్యడానికి గూడా వెనుదియ్యరు. ఇదే వారికి ఆనందం—

ఆ వూళ్లో అందరి అవస్థకన్నా గవళ్ళ కుర్రాడి పరిస్థితి వరహాలుకు జాలిగొలిపింది. ఆనాడు మిరపతోట కోసుకునాడే వాడికి వరహాలుపై కన్నుపడింది. చాలారోజులు ఆమెను తలచుకుని పిచ్చిగా ప్రవర్తించాడు. కొన్నాళ్లు వాడి దారిలో చౌదరి ఒకకంటకం. 'వరహాలుమీద దృష్టి మళ్లించుకో' అని మచ్చరంతో హెచ్చరిస్తున్నట్టు ఒకటి రెండుసార్లు అబ్బాయి వాడికి దేహశుద్ధి చేయించాడు. కాని దెబ్బ తిన్న కొద్దీ వాడికి మైకం ఎక్కువయ్యింది.

కృత్రిమ మెఱుగని పచ్చి కామేచ్ఛ వాడిది. జబ్బ సత్తువమీదనే ఆధారపడి బ్రతికే మనిషి. కండలు దేరిన చేవ శరీరం. రెండు జబ్బలకు తాయెత్తులు. మిసమిసలాడే నలుపుచాయ. గునపం దిగేసినా బెణకని

దేహసౌష్ఠవం. ఇలాంటివాడికి వరహాలుమీద కన్ను పడిందీ అంటే ఏమనుకోవాలీ? వాడికి చేటుకాలం దాపురించిందనేగా! అంతే—ప్రత్యక్షంగా కట్టెదుట అవినీతి చర్యల విషఫలితాలు చూస్తూనే వాడు దిగిపోయాడంటే—ఇంకేం చెబుతాం? అర్మం కర్మం తెలియని మనిషి. చాదరికుండే లౌక్యం లేదు; పావు కొరుకువలె ధనం లేదు.

అందుకే ఒకనాటి సాయంత్రం ఏకాంతంగా తన్ను కలుసుకొన్నపుడు స్వయంగా వరహాలు కేవాడిమీద మోజు పుట్టినా "ఈ దారికి రాక"ని హెచ్చరించింది. అసలు ఆ సన్నివేశమే విచిత్రమైనది. సాయంత్రం మళ్ళిపోయిన సమయం. సూర్యాస్తమయమైన తర్వాతఉన్న కొద్దికాంతినిగూడా చీకటి తెరలో దాచ ప్రయత్నిస్తోంది. వరహాలు తోటనుంచి తిరిగి వస్తోంది. పుంతలో మెల్లిగా అడుగులేసుకుంటూ నడుస్తున్న ఆమెను ఆ ఏకాంత ప్రశాంత వాతావరణంలో ఎవరో అమాంతంగా వొడిసి పట్టినట్టు గుర్తించింది. గుండె ఝల్లుమంది. కాని ఆ కండలు, జబ్బలు ఆమెకు సుపరిచితాలే. ఎన్నోసార్లు ఆ మెలిదిరిగిన కండలతో డిబాహువులు తమలో తనను ఇముడ్చుకోడానికి మూగగా వ్యథ చెందుతుండడం వరహాలు చూసింది. వెనక్కు తిరిగి తాను పూర్తిగా గవర్లకుర్రాడి వళ్ళలో పొదిగికొనివున్నట్టు తెలుసుకుంది. "ఛీ—వొదులు. ఏఁవిటీ మోటసరసం?" అంది ఆ సంజ చీకటిలో పెదిమలపై చిరునవ్వును చిందిస్తూ. వరహాలు అప్పటికే జాణలజాణ నెరజాణ అయింది. వాడి కౌగిటిలో నేవుండి చిటికెనవ్రేలితో బుగ్గతట్టి సున్నితంగా వాడికండలు నిమిరి నెమ్మదిగా లాక్కెళ్ళి మళ్ళ గట్టుమీది దిరిశెన చెట్టుక్రింద కూర్చోబెట్టింది. ఆమెకు వాడిమీద వాంఛ అయితే వుంది గాని మనసు వాణ్ణి పాడుచెయ్యడానికి వొప్పుకోలేదు.

"ఒరే—నీ ఉద్దేశ్యం ఎన్నాళ్ళనుంచో ఎరుగుదును. ఎప్పటికప్పుడే చెబుదామనుకుంటున్నా. ఈవూళ్లో అంపరికన్నా నువ్వంటే మక్కువ ఎక్కువ నాకు. ఒకటి చెబుతాను వినవూ?" జాలిగొలిపేస్వరంలో అంది వరహాలు.

వాడు ఈసరికే నీరైపోయాడు. ఆమె ప్రయోగించిన సమ్మోహనాస్త్రానికి మూర్ఛపడి నోటమాట రావడంలేదు. వాడి సత్తువంతా ఎక్కడ నక్కిందో? కడివెడు గుమ్మడికాయా కత్తిపీటకు లోకువగదా" మొదట్లో ఆమె తన్ను తన్నుతుందో, నుదురు పగలకొడుతుందో, రక్కుతుందో, కరుస్తుందో—అదీ చేతగాకపోతే నలుగురినీ పిలిచి బిగ్గరగా గొడవ చేస్తుందో అనుకున్నాడు. అయితే తాజేసే అఘాయిత్యానికి ఫలితంగా ఎంతటిదారుణం అనుభవించడానికైనా సిద్ధమై తెగించాడు. వాడు వట్టి మృగం. అంతే. తాను అనుకోకుండా ఆమెనుండి అంతటి తీయని పలుకులు వెలువడ్డంతో మూగవోయి గంగిరెద్దులాగ ఆమె ఎలాగ లాగితే అలాగ చెట్టుకింద చదికిలబడ్డాడు.

"ఏరా! మాట్లాడవ్?" పిచురేగే వాడిజుట్టు పట్టుకుని గుంజుతూ మళ్ళీ అడిగింది. ఆమె ప్రతిస్పర్శ వాణ్ణి ఎక్కడికో అర్థంగాని అవస్థలోకి నెట్టేస్తోంది.

"నీయిష్టం" అనిమాత్రం అనగలిగాడు.

"లే—బుద్ధి తెచ్చుకో — ఇలాంటి పని ఇంకెప్పుడూ చెయ్యకు. ఎవరిదగ్గరైనా నాటకాలాడు కాని నాదగ్గరకాదు. తెలిసిందా? నామాటవిని మంచి మార్గానపోతావా సరే — లేదూ — ఏమైపోతావో తెలుసా?" అని నిరుత్తరుడై నిశ్చేష్టుడై వున్నవాణ్ణి లేవదీసి రెక్క పట్టుకుని గడ్డివాడివలె తన్ను అనుసరిస్తుండగా పూరి మొగిసందులో వదలి వరహాలు ఇంటికి జారుకుంది.

ఆమె తనను విడిచిన కొద్ది నిముషాలకుగాని గవళ్ళవాడికి తెలివిరాలేదు. జరిగిందంతా కలవలె తోచింది వాడికి. అంతదాకా స్వర్గంలో ఏ గంధర్వాంగనతోనో హాయిగా గడిపినట్టు అనిర్వచనీయమైన ఆనందం అనుభవించాడు. వరహాలు అన్న ప్రతి అక్షరమూ వాడి చెవుల్లో మారుమ్రోగింది. కాని అది వ్యతిరేక ఫలితాలనే యిచ్చింది. మూర్ఖులకు చేసిన హితోపదేశమే అయి వూరుకుంది. కాగా ఆ హితవు వాణ్ణి ఆమెకు దగ్గరగా లాగేసింది.

తరువాత చాలాసార్లు వరహాలూ వాడూ కలుసుకున్నారు. పెక్కుసార్లు వాడికి హితవు బోధించింది. కొట్టింది. అవమానపరచింది. కాని వాడు మనిషికాక జంతువైపోయాడు. అన్నీ తుడిచేసుకుని ఆమెను వెనుదవిలాడు. వరహాలు ఎంతో బాధపడింది. జాలిపొందింది. దుఃఖించింది. చీదరించుకొంది. వికారంగా, బుద్ధిహీనుడుగా చిత్రించుకొంది. సానుభూతి

చూపింది వాడి అవస్థకి. బ్రతిమాలుకొంది పైదొలగమని. తుదకు లొంగిపోయింది. వాణ్ణి నాశనం చేసేసింది. ఎవరిని తలుచుకునీ కంట తడిబెట్టలేదుగాని వీడినిచూసి విలపించింది. అయ్యోరు తన వూళ్లో సుఖంగా బ్రతుకుతూ వుండగలడు. చౌదరీ వందలకు వందలు గుప్పేసి కొడుకునీ, కోడలును బాగుచేయించుకుంటాడు. షావుకారుకేమీ కొదవలేదు. మరి వీడికో తన కోసమని కానిపను లెన్నోచేసి నూరు రూపాయలు తెచ్చాడు. ఉన్మత్తుడయ్యాడు. వాడి బలానికి తనూ మోజుపడింది మళ్లీ వాడి సొమ్ము వాడికిచ్చేద్దామని తెగవెతికితే కనబడలేదు. తర్వాత తెలిసింది ధర్మాసుపత్రికి వాణ్ణి యీడ్చుకువెళ్ళే దుర్భరస్థితికి వాడు పాల్పడ్డాడని. వాడికోసం ఎంతగానో ఆవేదన పొందింది.

ఇంక ఆ వూళ్ళో వుండకూడదని నిశ్చయించుకొంది తల్లితో మకాం మార్చేసింది పట్నానికి. ఊరు విడిచి బండి నడుస్తూంటే బరువుగా ఆమె ఊహాపథంలో ఎన్నో కలలు నెలరేగి చెరిగిపోయాయి. ఈవూరు తన జీవితంలో ఇంతటి తుఫాను రేపుతుందని అనుకోలేదు. అన్నిటికన్నా గవళ్ళకుర్రాడి దీనావస్థే పొలిమేరదాటినా ఆమె మనస్సును దాటలేదు.

## 11

వరహాలు ప్రవేశించింది మంచి అందమైన పసగల పసందైన పట్టణం. జీవితంలో ప్రప్రథమంగా ఎన్నోరకాల మనుష్యుల్ని వాళ్ళ విచిత్ర వర్ణాల్ని చూసి విభ్రాంతి నొందింది. ఆమె అక్కడి వ్యక్తులను లోపలకుకూడా చూసే అవకాశం లభించి ఆనందిస్తోంది. ఎన్ని వింతలు, ఎన్ని విచిత్రాలు! ఆమెకు ఇక్కడ మాత్రం ఒక అపూర్వ సౌఖ్యం వంటిది లభించింది. గ్రామంలో జనాభా కొద్దివేలకే పరిమితం కావడంవల్లను, పల్లెటూరు పడికట్టువల్లను తనకు తెలియకుండా తన చుట్టూ ముళ్లకంచెలాగ పరిమితులుండేవి. ఇక్కడనో—అవేమీ లేవు. తాను ఎలాగున్నా సరే తన ప్రసక్తి అక్కరలేని ప్రజ. తాను ఎలా సింగారించుకున్నా సరే ఆ పక్కా యీ పక్కా బుగ్గలు నొక్కుకునేవాళ్ళు లేరు. తన ఊసు ఇక్క డెవరికీ అక్కరలేదు.

కూడా తెచ్చుకున్న అరసంచి రూపాయలూ పొదుపుచేసుకుని ఒక చిన్నయిల్లు అద్దెకు పుచ్చుకుని క్లుప్తంగా సంసారం పెట్టుకున్నారు తల్లీ కూతుళ్లు. ఇంటి పెత్తనం అంతా ఇప్పుడు వరహాలుదే. ఇతఃపూర్వం తల్లి కాస్తా కూస్తా ఏమేనా విసుక్కోవడం, కసుక్కోవడం వుండేదికాని ఇప్పు డేమీ లేదు. స్వతంత్రంగా గృహయజమానికుండే కీర్తీ, ఆర్భాటమూ, బాధ్యతలు వరహాలులో తిష్ఠ వేసుకున్నాయి. సుమారు నెలరోజుల్లో పట్నవాసం జీవితపు ఆనుపాను కొంతవరకు ఆచూకీ తీయగలిగింది.

తీర్చిదిద్దిన రాజబాటలు; ఏమి కావాలంటే అవి దొరికే దుకాణాలు; ఎల్లప్పుడు వచ్చిపోయే జనంతో కిటకిటలాడే హోటళ్లు; సంగీతాలు; రేడియోలు; నాటకాలు; సినీమాలు; నదీతీర విహారాలు; పార్కులు; ఫ్యాక్టరీలు; రైళ్లు, కార్లు, రిక్షాలు వరహాలుకు క్రొత్త ప్రపంచాన్ని రోజుకో రంగులో మెరిపించాయి. వీటితోబాటు విచిత్రప్రవృత్తి గల వ్యక్తులు, తమ యీప్సితాలు నెరవేర్చుకోడానికి వాళ్లు వేసే ఎత్తు పైఎత్తులు, వ్యాపారంవల్ల ప్రయోజకులవల్ల రోజుకు వందలు గడించే లక్ష్మీపుత్రులు, వీళ్లచే పీల్చి పిప్పిచేయబడే కష్టజీవులు, నిలువ నీడలేక బాట కిరుప్రక్కల మార్కెట్టు పంచల స్థిరనివాసం ఏర్పరచుకొని బూజుపట్టిన తలలతో చీకూ చింతా లేనట్లు జీవితం వెళ్లబుచ్చే అనాథులు—రాత్రిళ్లు రైల్వేస్టేషను సమీపంలో వుండే వెయిటింగు రూముల వార, సమీపంలోని చెట్లనీడల సినిమాహాళ్ల ప్రాంగణంలోని కిళ్లీకొట్ల సందుగొందుల సత్రాలు హోటళ్ల గడులదగ్గర, — ఏదో ఆకలీ, ఆశా తీరని నిరీక్షణతో తచ్చాడేభామినుల — ఎందరెందరనో చూసి ఆమె తన ఊహావలయం ఎంతో విస్తృతం చేసుకుంది. ఇంతటి దట్టమైన జనసమూహంలో తన జీవనోపాధి అంత కష్టమనిపించలేదు. ఏపనిచేసినాసరే తెల్లవారిపోతుందనే హామీ ఏర్పడింది.

నాలుగునెల్లపాటు గౌరవంగా ఆ నగరంలో బ్రతకడానికి బాటలు వెదికారు ఆ తల్లీ కూతురు. మొదట్లో ఏవో తినుబండారాలు భారీ యెత్తున చేసి కారుస్టాండుదగ్గరా సినిమాహాలు ముందరా చిల్లరగా అమ్ముకునే కుర్రాళ్లకు విక్రయించేవారు. ఇది కొంచెం ఆశ చూపినా ఆట్టేకాలం నిలకడగా వారికి

ఉపాధి కల్పించలేదు. చేదోడుగా వుంటుందని చిన్న హోటలు పెట్టారు. కాని ప్రతి అడుగునా వరహాలుకు ఇలాంటి పనులవల్ల జీవయాత్ర తుదిఘడియదాకా జరగదని ఎవరో తనలోనుండి చెబుతున్నట్లు తోచేది. ఎంత నిరోధిద్దామని ప్రయత్నించినా ఆమెలోని అందం వీధిలోకి రావడం మానలేదు. పట్నంలో ఎన్ని ఎత్తులుంటాయో! తన వద్దకు బేరాలకువచ్చే కుర్రాళ్ళలోనే, అమాయకపు ఇల్లాళ్ళవలె అవుపించే ఆడవాళ్లలోనే ఆవులిస్తే ప్రేవులు లెక్కపెట్టేవాళ్ళుంటారని గుర్తించలేకపోయింది. పట్నవాసపు పసివాళ్లు పల్లెవాళ్ళకుమల్లే గాదుగా! ఏళ్ళు మళ్లి యాభయ్యో పడిలోవున్న పెద్దమనిషంతవాడు డిప్పకాయముంగు తీసికట్టు. సినిమాలు, నాటకాలు, వగలాళ్ల వన్నె పోకడలు వాళ్లలో లేని, ఉండగూడని విషవాంఛల్ని పాదుకొల్పి నాశనం చేస్తున్నాయి. వరహాలు అవివాహిత అనీ, ఆమె యింక పెళ్ళిచేసుకోదనీ, చెయ్యి జారపెట్టుకున్న పడుచు అనీ, జాణల్లో కెల్లా జాణయనీ తెలుసుకోడానికీ — తనులో తాను గుణించి గణించుకోడానికీ ఆట్టే కాలం బట్టలేదు. వరహాలుకూడా దీన్ని గమనించింది. ఎప్పుడైతే ఈమె ఇలాంటిదని గుర్తించారో వాళ్ళకు వరహాలంటే మొదట్లో వుండే గౌరవం తొలగిపోయింది. వెకిలి పోకడలు, వేళాకోళాలు, వింత వింత ప్రచారాలు ప్రారంభమయ్యాయి. నాలుగు మూలలా పాక్కింది వరహాలు ఉదంతం. ప్రతినోటా ఆమెను గూర్చిన పలుకే. ప్రతికంటా ఆమె మాపే. ఆయా రంగాల్లో వరహాలును గూర్చిన చర్చలు చెలరేగాయి. ఆమెకై అనేకవిధాల వేట మొదలు. రాత్రింబవళ్లు తనవద్దకు ఎందు కెందుకో వంకలుబెట్టుకుని వస్తూ, ఏపనీ లేకపోయినా సరే తన క్షేమాభిలాషులవలెనో, మిత్రులవలెనో నటిస్తూ గంటలతరబడి తన్నోరికే చూస్తూనో లేక అనవసరపు కబుర్లుపెట్టి ఎలాగో తనతో కాలక్షేపం చేస్తూనో వుండే ఆడవాళ్ళను మగవాళ్లను చూసి అసహ్యించుకొనేది. అయితే ఆ కొద్దికాలంలోనే తాను ఆ పరిసరాలకు ఒక ఆకర్షణకేంద్రంగా మారుతున్నందుకు ఆశ్చర్యపడేది.

శీలం ఒకతూరి పతనమైనపుడు కట్టుబాటులో వుండాలని మనిషి ప్రయత్నిస్తే దానికి వీల్లు పల్లెల్లో కంటె పట్నాల్లో బహు తక్కువ. పల్లెటూళ్లో అట్టి వాళ్ల సంఖ్య బహుకొద్ది; ఏ సంసారులఇళ్ళలోగానీ ఉన్నప్పటికీ తల్లిచాటు పిల్లలుగానో, పెనిమిటిచాటు పెళ్ళాలుగానో, తను ప్రవర్తనగురించి ఎదుటివాళ్లు నోగత్తలేని యజమానులవంటి ఉన్నతస్థానాల్లోనో వుంటారు. పట్నంలో అలాగ్గాదు. మనం ఆదృష్టితో చూడంగాని — అదేవృత్తిగా పెట్టుకున్నవాళ్లు అనేకమంది. దానిలోనూ పోటాపోటీలు, కడుపు కక్కుర్తులు, లాలసలు — ఒకటేమిటి ? అరీతులు అసంఖ్యాకం!

పట్నంజనంలో పెద్దమనుషుల్లో ఒకరకం, పోకిరీలు కొందరు, బ్రోకర్లు, రౌడీలు, పట్టుబట్టి వరహాలును రంగంలోకి దింపారు. మొదట్లో మోజుగానే వుంటుంది. ఎటుచూసినా గౌరవాలు, మర్యాదలు, డబ్బు, నౌకర్లు, చాకర్లు — అరచేతిలో స్వర్గం ఆడుతుంది. ఇదీ సంఘంపన్నిన కృత్రిమపువలలోని ఎరలో ఒకభాగమే. నెమ్మదిమీద అసలు రంగు బయటపడుతుంది. అయిదారు నెలలకు వరహాలు బ్రతుకు వందల రేటులోంచి రూపాయలకు పడిపోయింది. ఆమె అంటే లోకువ, చేలిక, నీచం — వొట్టి చచ్చురకంగా ప్రజ తీసేస్తున్నారు. కాలం గడిచినకొద్దీ ఆమెవద్ద కెవ్వరు రావడం మానేశారు. ఆమెనే ఇంట్లోంచి బయటకు లాగింది లోకం. ఇంకేముంది? మళ్ళీ అదేవరస. తాను మొదట్లోచూసిన వరస — తానా వరసలో ఒక్కతె. పార్కుల్లో, రైల్వేస్టేషనుదగ్గర, రెండో ఆట విడిచినతర్వాత సినిమాహాలుఎదుట తెల్లగా విరియబూసి పూవులు క్రిందకురాల్చే గానుగచెట్లనీడల్లో కొరుస్టాంప్ల ప్రక్క ఆఖరుకు కిరాయిహోటళ్ల వరండాల్లో వరహాలు తచ్చాడడం మొదలుపెట్టింది. అభిమానం పులుముకొచ్చే ఆమెకు ఇది లోలోన కంటగింపుగానే వుంటోంది. అయితే ఏంచేస్తుంది? లోకంపై కసిదీర్చుకోడానికని భ్రమసి ఈ వృత్తి చేపట్టింది. కాని సంఘం సామాన్యమైనదా ? ఆమె ఆరోగ్యాన్ని, ఆమెశక్తినీ, సర్వస్వాన్ని నిర్దాక్షిణ్యంగా నిర్మూలించేస్తోంది. ఇటీవల ఆమెలోజీవితాన్నిగూర్చి అనేకమైన ఆలోచనలు, ఆవేదనలు కలతపెట్టడానికి తీవ్రంగా పోటీపడుతున్నాయి. అయినా స్థాయి తప్పడంలేదు మనస్సు.

తుదకు వరహాలుకు రాత్రివేళల కొన్ని హోటళ్లలో తన్ను విక్రయించుకునే పద్ధతిమీద ప్రాప్రయి

టర్లకు కొంత కమీషను యిచ్చే కొడికి వచ్చింది ఆమె అవస్థ. బ్రతుకు గడుస్తున్నకొద్దీ రోజు కొక్కొక్క నూతన అనుభవం ఆమెకు కలుగుతోంది. అనుభవాలు కూడా ఆమె అసక్తిని సడలించకుండా బలాన్నే చేకూరుస్తున్నాయి. వివిధ మనస్తత్వాలు గల వ్యక్తులతో ఆమెకు సాంగత్యం లభిస్తోంది. అది తాత్కాలికంగా అయినా సరే ఆ కొద్దిగంటలలో వాళ్ళలోకి చూసి ఏవేవో స్వభావాలు వెదుకడానికి ప్రయత్నిస్తోంది. తాను నిత్యమూ తీరిక సమయాల్లో తిరగేసే పత్రికల కథల్లోని వివిధ వర్ణాలుగల పాత్రలవలె ఆమె కట్టెదుట అనేకులు తేలిపోతున్నారు. వాళ్ళకీ ధ్యాస అన్నదేలేదు. సిగరెట్టు పీల్చి పారేసినట్టు, కప్పు కాఫీ త్రాగేసినట్టు, కిళ్ళీ నమిలినట్లు, కొన్ని ఘడియలు సినిమా చూసినట్లు, కొంచెంసేపు త్రాగుడు మైకంలో తూలినట్టు ఆ పడుచు సాంగత్యంలో గడిపేస్తుండేవారు కాలాన్ని.

వరహాలు దుఃఖమయ జీవితంలో, భ్రష్టమయిపోయిన బ్రతుకుబాటలో, మొద్దువారి తమో నిబిడీకృతమైన మహోయానంలో ఒకనాడు ఆమె అనుకోని అపూర్వ సంఘటన ఒకటి జరిగింది. అది బహు చిన్నదే. అనుభవం కొద్దిపాటి క్షణాలదే. అయినా అది జీవనసాగరాన్ని కలచివైచి పెనుతుపానును రేపింది ఆమెలో. ఏండ్లతరబడి వరహాలు గడించిన తెలివితేటలూ, ఆమె అనుభవం సంపాదించిపెట్టిన జ్ఞానము సాక్షిగా తాపీగా ప్రయోగించవలసి వచ్చిన మధుర ముహూర్తం అది. ఆమెకు మళ్లీ ఎన్నేళ్ళకో నిజమైన అవ్యక్తమైన ఆనందం, ఉత్సాహం ఉద్రేకం కలిగించిన క్షణం.

ఆనాటిరాత్రి. పదిగంటలవేళ. హోటలులో. ఏకాంతంగా. కట్టెదుట ఒక యువకుడు—సంస్కర్త వలె వున్నవాడు—అవివాహితుడు. చాలా తెలివి గలవాడు, అందగాడు, మితభాషి—మీదు మిక్కిలి ఒక రచయిత—వరహాలు ఆశించదగ్గ పొందుగలదని భ్రమించిన పురుషుడు తటస్థపడడం. ఆమె అతన్ని పరీక్షగా చూచింది. అతడూ ఆమెను చూశాడు. తాను అతన్ని చూసినట్టు అతడు తనను చూస్తున్నాడా అని ఆమె అనుమానం! అతనితో మాట్లాడాలి. అతన్ని కదపాలి. ఆతడు జీవితంలో ఎన్నడూ అనుకోనివుండని ఊహాసౌధంలోని క్రొత్తగదులు తెరచి అతనికి క్రొమ్మెరుంగుల ఇంపుసొంపులు చూపించాలి. అతన్ని ముగ్ధునిచేసి తన సాధనలో జయం పొందాలి. అయితే అసలు అతడు చలించడంలేదు. ఇంక కథ ముందుకు సాగడం? ఇదే ఆమెను ఎదుర్కొన్న చిక్కు ప్రశ్న?

## 12

చిన్నకథ వ్రాసి క్లుప్తంగా ముగిద్దామనుకుంటే అనుకోనంతగా పెరిగి పెద్దకథై పోయింది. చిలవలూ, పలవలు వేసుకుంటూ ఊహా నభో వీధిలోకి తెగ ఎగబ్రాక ప్రయత్నిస్తోంది. ఒళ్లు భారంగావుంది. ఆవులింతలు తెగవస్తున్నాయి. మెడలు నొప్పిపెడుతున్నాయి చూపుడు వ్రేలు బొటనవ్రేళ్లు కొసలు కదుముగట్టి ఇంక యెంతమాత్రం అక్షరాల్ని తిన్నగా వ్రాయలేక వంకర టింకరలు పడుతున్నాయి. అప్రయత్నంగా తలయెత్తి బల్లమీద గడియారంవంక చూశాను. "అబ్బా! ఇవ్వాళకూడా అతి త్వరగా గడిచిపోతూంది! అప్పుడే పది దాటింది. పరుగు పెడుతూన్న కాలానికి కళ్లెం తగిలిద్దామని ఉబలాటంతో నే దాన్ని తరగబెట్టుకుంటున్నట్లుంది. నే నిక్కడకొచ్చి రెండురోజులు పూర్తి అవుతాయి. ప్రొద్దుట వుంటానో వుండనో అనుకుంటూ అదే చెబుతా కాబోలు అనుకొన్న ప్రొప్రయిటరు ప్రశ్నార్థకంగా ఉదయం నావైపు చూశాడు. వాడికి నన్నుగురించి అనుమానం కలిగివుంటుంది.

నిన్నటిరాత్రి రజని వెళ్లినప్పటినుండి ఏకబిగిని వ్రాతలో మునిగివున్నందువల్ల ఈ గంటలన్నీ ఎలా కరిగిపోయాయా అని ఆశ్చర్యం కలుగుతోంది. స్వప్నంలో జరిగిన సంఘటనలవలె ఈవాళటి పగటి పూట తటస్థించిన అనుభూతులు కొన్ని లీలగా నాయెదుట మెదలసాగాయి. రాత్రి అంతా కంటికి కునుకన్నదిలేక వ్రాతలో మునిగివున్న నన్ను, ఒక ఆగంతుకుణ్ణిచూసి హొటలు ప్రొప్రయిటరువంటి వాడే అనుమానిస్తే సర్వర్లమాట వేరే చెప్పాలా? ప్రొద్దుట టిఫెను తీసుకుంటూంటే సర్వరు అన్న మాట బాగా గుర్తుకొస్తోంది.

"అలాగున్నారేం బాబూ?"

"రాత్రి అసలు నిద్దరే లేదు—ఎలాగుంటుంది మరి"

"ఈవూళ్లో రజని అనే ఆమెను నువ్వెరుగుదువా" వాణ్ణి అడిగాను.

"ఆమేఁ—ఆఁ—ఆఁ—అదీ ఫలానా చోట వుంటుందని చెప్పలేంబాబూ! వెనక కాన్వెంటు స్కూలుపక్క సందులో వుండేది—ఏం—దాని గొడవ ఏమొచ్చిందేం?" వాడు ఎంతో ఆత్రుతను వ్యక్తంచేస్తూ ముఖ్యంగా నన్నుగురించి ఆందోళన చెందుతున్నట్టు స్పష్టమైంది నాకు.

"అయితే ఆమెకో యిల్లూ వాకిలీ లేవన్నమాట! మరెక్కడ వుంటుందీ?"

"అదేంటండీ అలాగడుగుతారు? పగలల్లా బజారులూ, రోడ్లూ వున్నాయిగదా—రాత్రి కేసత్రమో, హోటలో వుండ నేర్పుంటుంది. తమ రెక్కడ చూశారు. దాన్ని?" బిల్లుయిచ్చి వెళ్లేవాణ్ణి పనుంది పైకి రమ్మనమని పిలిచాను. ఆశ్చర్యపడుతూ నే వాడు నన్ను వెంబడించాడు.

"రాత్రి రజని ఇక్కడికొచ్చింది" ఈ ముక్క నానోట వినడంతోనే వాడికి ముచ్చెమటలు పోశాయి.

"అయితే—మీతో" ఎంత ఆత్రుత! ఎంత భయం వాడికి?

"ఆఁ—నాతో ఇక్కడే వుంది రెండు గంటల దాకా. అది ఈరాత్రికి ఇక్కడకు మళ్లీ రాదూ?"

"రాకేం—వస్తుంది. మీరున్నారని తెలిస్తే రెక్కలుగట్టుకు వాల్తుంది. రుచి మరిగితే"

"ఏమిట్రా నువ్వనేది?"

"ఏమీ లేదండి. కాలం అలాగుంటుంది. మంచికిపోతే చెడు ఎదురౌతుంది. మీరేమనుకున్నా సరేగాని మీరు దానిజోలికి పోకండి. చిన్నతనం. వచ్చింది పొరుగూరు". నన్ను అపార్థం చేసుకోకపోతే వాడలాగ సానుభూతి ప్రకటిస్తాడా?

"ఏం—రజని అంత కానిదా?"

"నెమ్మదిగా అంటున్నారా. ఈవూరు మొత్తం మీద అలాంటిరకం లేదు. పైన మీ ఇష్టం" అంటూ జారుకున్నాడు క్రిందికి.

మళ్ళీ ఇదే వ్యాఖ్యానం. నేను భోజనం చేస్తుంటే నవ్వుకుంటూ సర్వర్లు కూడ బలుక్కుంటున్నారు. "ఇంకేముందిరా? వలలో వేసిందిరా పిట్టను. ప్రొద్దుటనే చెప్పానుగూడా" ఇవ్వాళ ప్రొద్దుట నేను కదిపినవాడి గొంతు ఇది. రెండోవాడు తానేదో ఘనకార్యం చేసినట్టు వెకిలిగా నవ్వుతున్నాడు. పైకి వచ్చాను. రజనినిగురించి నే నూహిస్తున్నదీ, రచిస్తున్నదీ రైటే అని స్థిరీకరించుకున్నాను. ఉదయం సంభాషణ, మధ్యాన్నం వాళ్ల సణుగుడు నా కథకు మరీ పసగూర్చి మంచి ఊపుతో ముందుకు తీసుకెళ్లాయి. ఎలాగైనా రజనిని జయించగల్ను. ఆమె కథను ఆమెకే వినిపించి అపుడు దీని ప్రభావం ఎలా వెలుగుతుందో చూడాలని ఉవ్విళ్ళూరింది నా హృదయం. సరిగా నిన్న రాత్రి ఇదే సమయానికి నా భావ జలధిలో తరంగాల రాకపోకలు తుఫాను సూచనల్ని చూశాయి. గడియారం చేసే 'టిక్ టిక్' శబ్దంతప్ప ఇంకేమీ సద్దులేదు. చుట్టుప్రక్కలనుంచి ఎవళ్లూ లుంగుంటునవచ్చి నన్ను ఇబ్బంది పెట్టకుండా తలుపు గడియ గట్టిగా నే బిగించి వుంచాను.

లించి వొళ్లు విరుచుకుని కలం తీశాను.

తలుపు చప్పుడు. నిశ్శబ్దంగా విన్నాను. మళ్లీ చప్పుడు. ఇంకెవరు? ఆమెయే వచ్చివుంటుంది. వెంటనే తలుపు తీశాను. రజని—ఆమే—అదే నిశ్చలత్వం. అదే గాంభీర్యం! వస్తూనే ఆమె తన ముఖాన్ని నా కళ్లెదుటవుంచి తీవ్రంగా చూసింది.

"రా—కూర్చో. ఇవ్వాళ రావేమో అనుకున్నాను."

"ఔను—రాకూడదు అనుకున్నా. కాని మీరు నేను మళ్లీ ఈ గదిలో ప్రవేశించే పరిస్థితుల్ని కల్పిస్తారు అనుకోలేదు" జాలి నభినయించింది.

"నేనేమీ కల్పించలేదే."

"ఈ రోజుల్లో ఎంత పెద్దవాడికైనా ఇదోటి అలవాటయ్యింది. సులువుగా, నవ్వుతూ అబద్ధం ఆడడం" ఆమె ఏ అధికారంతో నాపై ఈ నేరం మోపిందీ? ఆలోచించసాగాను. నిన్నటి రాత్రినుంచి రజని యెదుటబడితే మాత్రం జాగ్రత్తగా మాట్లాడాలనుకున్నా. ఆమె నాలాగ అధికురాలు కాదని తోచవచ్చు నా హృదయంలో ఒక భాగానికి—నావలె ఉన్నది కాకపోవచ్చు—కొద్దిపాటి సొమ్ముతో ప్రకోపితమైన అహం—నేను ఆమెకంటె బాగా చదువుకున్నా ననుకోవడంలో లోకపురీతినిబట్టి నా చలం ఏమీ అతిశయించలేదనవచ్చు. వీటన్నిటినీ

మించి ఆమెవద్ద వీటన్నిటినీగూడా త్రోసి రాజనగల అనుభవం వుండగూడదంటావా? అంటుంది ఇంకొక భాగం హృదయంలోంచి. ఏమీ లేకుండా ఆమె కింత ధీమా ఎక్కడనుంచి వస్తుంది?

"నేనేమీ అబద్ధం ఆడలేదు."

"నాదగ్గర కబురు చేరకపోతే ఇంకా బుకాయించేద్దురు." ఆమె నవ్వింది.

"రజనీ—నీవు చాలా చిత్రంగా మాట్లాడుతున్నావు. నీకు చెప్పినవాడెవో కాని కూతలుకూసి వుంటాడు."

"కొత్తవాళ్లూ, తెలియనివాళ్లు అయితే అలాగే అనుకొందురు. ఇక్కడిరకాలు ఎంత దమ్మిడీకీ, సిగరెట్టుకి కక్కుర్తిపడేవాపతైనా కొందరు నిజాయితీపరులు లేరనుకోకండి. మీరు ప్రొద్దున్న ఒక మనిషి దగ్గర మీరు చెయ్యాలి నీచపుపనినిగురించి — ఏదో ఘనకార్యం చేసినట్టు చెప్పకోలేదూ?"

ఏదో దూరంనుండి స్ఫురణకు వస్తోంది కొద్దిగా. దాన్ని ముందుకు రానియ్యకుండా నవ్వు అదిమిపెడుతోంది. తుదకు ఆమెకు ప్రత్యుత్తర మియ్యకుండానే నవ్వేసి "రా—అలా నుంచున్నావేం? అదా సంగతి? నువ్వు నిజంగా [illegible]లోబడ్డావు" అన్నాను

ఆమె నెమ్మదిగా సమీపిస్తూనే "ఇంక చాలు. రాత్రి రెండుగంటలదాకా మీరు నాతో గడిపినట్లు సర్వరుదగ్గర అనలేదూ?" అంది.

"ఓ! అదా—పొరబాటు. వాడు చేరవెయ్యడంలోనో, లేక నువ్వు అందుకోవడంలోనో కొంచెం తోక పెరిగింది అసలుమాటకి—కూర్చో చెబుతా. ఇలాంటివే ఎంతెంతో పనులు చేస్తూంటాయి. ఇప్పుడు కొంప మునగలేదనుకో—కాని ఇంత చిన్న గొడవలు ఒక్కొక్కప్పుడు పెద్ద అనుమానాలకు, భయసందేహాలకు దారి రాద్ధాంత సిద్ధాంతాలకు నడిపించి పెద్ద కథల్ని సృష్టిస్తుంటాయి. ఇంతకీ నేనన్నది "రాత్రి రెండింటిదాకా రజని ఇక్కడే వుందిగా" అని. వాడు దాన్ని వ్యాఖ్యానించుకున్నాడు. భలేపని జరిగిందిలే" ఆమె ముఖంలో నిన్నరాత్రినుండి తొలిసారిగా ఇప్పుడే పరాజయ చిహ్నం తొణికిసలాడింది.

క్షణంసేపు ఆమె ఏమీ మాట్లాడలేదు. మనస్సునతిత్వరగా స్థాయికి తెచ్చుకుంది. పెదిమలపై చిరునవ్వు చిందించింది. నేను చూపినచోట ఒద్దికతో నాకు తెలియడంలేదేమో అనుకుని నన్ను పరిశీలిస్తూ కూర్చుంది.

"ఒక్కటి చెప్పండి. నేను నిన్న ఇక్కడనుంచి వెళ్లింది లగాయతు మీరు నాపైనే ధ్యాసపెట్టుకుని వున్నారా లేదా? రాత్రి అసలు నిద్ర అన్నది రాలేదుగా?". ఈ మాటల్లో ఆమె నిజంగా నేను భావిస్తున్నట్లే దారికి వస్తున్నట్లు తోచింది. తప్పక ఆమె వలలో పడుతుందనీ, అదను చూసుకొని ఆమె కెలాగైనా ఉపదేశించి ఆమెను పడుపువృత్తిలోంచి పెడత్రోవబట్టించాలనీ పథకం వేసిన నాకు జయం లభిస్తున్నట్లనిపించింది. ఒకందుకు ఆమె తననుగూర్చి మథనపడుతున్నాననుకుంది. ఆమె మనోవీధిలోని మబ్బుతెరలు తొలగించడానికి—"ఔను. నీవు వెళ్ళిన తర్వాత అన్నీ నిన్నుగురించినవే ఆలోచనలు. కంటికి నిదుర లేదంటే నమ్ము. నువ్వు సామాన్యమైనదానివా రజనీ?" అన్న నన్ను చూస్తూ ఆమె ఏమనుకుందో—చటుక్కున స్వరంమార్చి, "నన్నుగూర్చి అంతగా ఆలోచించకండి. ఏమిచేసినా ప్రయోజనంలేని స్త్రీకై వ్యథచెందడం మంచిదికాదు. మీబోంట్లు అసలే ఆ బాధ పడగూడదు." యథార్థంగా ఆమె ఎదలోనుంచేనా ఈ మాటలు వెలువడుతున్నాయి? లేక నటనా? అని తర్కించుకోసాగాను. రజని తలుచుకుంటే ఎలాంటి పాత్రనైనా తేలికగా పోషించగలదు.

నేను మౌనంగానే వున్నా. ఆమే కదలించింది. ఒకే ఒక వాక్యం బరువుగా అన్నది "నన్ను మరచిపొండి"—లేకుంటే ఇదొక వ్యాధిగా పీడిస్తుంది మిమ్మ అనే హెచ్చరికతో కూడిన భావంవంటి మెరుపును కళ్లలో ప్రకటిస్తూంది. నాకు ఇప్పటికీ ఆశ్చర్యం కలిగించేది ఒకటే—నేనంటే జాలి, కరుణ ధ్వనిస్తున్నాయి ఆమె స్వరంలో. తద్వారా నాకు గౌరవం వస్తోంది. అందుకే నాకు ఆమెయెడ అనుమానం బలమయ్యింది.

"అలాగనకు రజనీ! నాకు అటువంటి బాధలు పొందే అలవాటు లేదు. ఇప్పటివరకు జీవితంలో అట్టి ముహూర్తం రాలేదు. నాలో కలిగిం దిప్పుడొక

విశేషం. నిన్న నేను ఎన్నటికీ మరువలేను. దీనికి కారణం నే ననుకుంటున్నదీ, నువ్వనుకుంటున్నదీ ఒకటిమాత్రం కాదు"

"అహాఁ! మీ రేమనుకుంటున్నారో!" లీలగా కిలకిల నవ్వుతూ అన్న యీ ఆశ్చర్యార్థకం నన్ను కొంచెం కలచినమాట వాస్తవం. అయితే మటుకు, నా ధైర్యం నాది.

"రజనీ! నిన్న నీవు నన్ను వదిలినప్పటినుంచి నా మనస్సు నీమీదా, నీవంటి యితర వ్యక్తులమీదా పనిచెయ్యడం ప్రారంభించింది. నువ్వు చేసేపని నాకు సవ్యంగా కనుపించలేదు. కనుక ఇట్లాంటి వ్యక్తి చరిత్రను ప్రపంచాని కెరుకపర్చాలని తపేక దీక్షతో ఒక రచన సాగించాను." నామాటలు వింటూ నివ్వెరపడి నవ్వడం మొదలుపెట్టి "బాగా నేవుంది. నేను, నా బ్రతుకు, నా వృత్తి—రచ్చకుకూడా ఎక్కిస్తున్నా రన్నమాట. అదేమంత ఘనకార్యమనీ...?" ప్రశ్నించింది.

"నీకు తోచకపోవచ్చు. నాకుమాత్రం ఎంతో విశ్వాసం వుంది—దీన్ని చదివే పాఠకు లందరిలోను కనీసం ఒకరిలోనైనా ఈ కథ మార్పు తేలేదూ? పోనీ తేలేకుంటే మానె. ఘడియసేపైనా ఇది వాళ్ళను ఆపి ఊపిరి తీయడానికి కూడా వీల్లేని పరిస్థితిలో నిల బెట్టి నీవంటివాళ్ళనుగూర్చి ఆలోచించమని కోరదూ?"

"మీరు కవులూ, కథకులు. ఎప్పుడూ ఊహాపథంలో విహరిస్తారు. మీ భావ వీధికీ, వాస్తవానికీ భూమ్యాకాశాలమధ్య ఉన్నంతటి అంతరం వుంది" మళ్ళీ నవ్వుతూ నే అంది.

"అలాగనకు—కావలిస్తే విను. ఒక్కటే షరతు. నిన్నెంతమాత్రమూ ఈ కథ కదల్చకపోతే దీన్ని నీ యెదుటనే దగ్ధంచేస్తాను." ఆవేశంతో అన్నాను. ఆమె లోకువ చేస్తుందేమో అనే జంకు కూడా లేకపోలేదు. ఆమె ఏం చేసినాసరే—నా మనస్సు ఏవగించుకోదు. ఒక్కటే నేను కోరేది. నన్నూ, నా కృషినీ గురించి ఎవ్వరేమనుకున్నా దిగులులేదు. వాళ్ళకు తెలియకుండానైనాసరే నామాట వాళ్ళలో లేశమైనా ఉత్సాహం లేవదీస్తే "నేనే జయించాను" అనుకుంటాను.

## 13

"చదవండి! అదెంత సజీవమైనదో వింటాను" అని కుతూహలంతో రజని ముందుకు జరిగింది. మధ్య మధ్య ఆమె ముఖంలోకి, కథ వింటూంటే ఆమె ఎలాతలపోస్తోందో అని పరికిస్తూ, నిన్నరాత్రి ప్రారంభించి ఆఖరికి ఇవాళ శేసియో కార్యక్రమానికికూడా వెళ్ళకుండా యెకాయెకిని చిత్రించిన, ఆమె కథ ఇలాగే వుంటుందని భ్రమించి వ్రాసిన, కథంతా ఓపిగ్గా చదివాను. ఒకడు తను కథ వ్రాసినప్పుడు, ఒకవ్యక్తిని మనసులోవుంచుకొని ఒక ప్రత్యేక ప్రయోజనంకోసం రచన సాగించినప్పుడు, ఆ కేరచన వారు సావధానంగా వింటూ తనకల్పనకు ఆశ్చర్యం ప్రకటిస్తూంటే ఎంత ఆనందిస్తాడో దానికంటె ఎన్నోరెట్లు ఎక్కువగా సంతోషించాను నేను. కథ ముగించి కాగితాలు మడిచి బల్లమీద వుంచాను. ఆమె సుదీర్ఘమైన ఒక వేడినిట్టూర్పు విడిచి కొద్ది నిమిషాలు నిశ్శబ్దంగా వుంది. బహుశా కథ జ్ఞాపకంలో బడి ఎక్కడెక్కడో చెదరి చెదిరిన హృదయాన్ని కట్టుగట్టుకు చేర్చుకోవడానికి ఆపాటివ్యవధి ఆమెకు చాలిందా అని నా అనుమానం!

"ఎలాగుందీ కథ?" సంపాదకులముందు రచయిత తన రచనను ముగించి ముగిస్తూ వేసే జిలుగైన ప్రశ్నకంటె, సినిమా ప్రొడ్యూసరును, డైరెక్టరును గంటలతరబడి బలవంతంగా కూర్చోబెట్టి వారు తియ్యబోయే చిత్రానికై కథనుగ్గానుకుంటూ వచ్చి చదివి వినిపించి వారి అభిప్రాయానికై జాలిగా వేసే ప్రశ్నకంటె బలీయమైనది నా కాంక్ష. ఆమె మనసులోంచి వెలువడే పలుకులు వినాలని కుతూహలం ఇనుమడించి ఆమె ప్రత్యుత్తరంలోని ప్రథమ స్వరంకై చెవులు నిలుపుకున్నాయి. అయితే ఆమె ఆ మాటలు నిజంగా తన ఎదలో సంప్రదించుకొని ఇచ్చిందా?

"అబ్బ! ఎంత గాథ వ్రాశారు? ఇదంతా నామీదే?"

"నీమీద గాదు. కాని దీనికి స్ఫూర్తి నీ కలయిక."

"ఔను. నేనూ అనుమానించాను నిన్నరాత్రి—ఏదో ఈయనలో కలత బయలుదేరి వుండాలని"

"అసలు ఇందులో వస్తువు నీ హృదయాన్ని తాకనే లేదూ?"

"తాకకేం?—అందులోను మీరు నిజమనుకున్నది ఎంత చిత్రంగా, తిన్నగా ఎదటివారి మనసుకు వచ్చేటట్లు వన్నెచిన్నెలతో చెప్పారు!" నాకు కొంచెం తృప్తిని కలిగించిన దీ విమర్శ. రజని ఆలోచించి ఒక సూటిప్రశ్న వేసింది "మీరు సంస్కర్త లను కుంటాను?"

"ఏదో ఇతరు లనుకుంటారు. అంతే" నా మాటలు విని ఆమె ముఖం అరోకలాగు పెట్టింది. ఆ పోలికలో "చాలామంది కిదొక జబ్బు. లేనిగుణాన్నిటిని తమపై ఆపాదించుకోవడం, నిజంగా ఉంటే తమకేదీ రాదన్నట్లు—తామేమీ లేనివాళ్ళం అని మొదలేసి తుదకు తమ ఘనత అద్భుతంగా నిరూపించుకోవడం" అనెడి చురుకు ఆ లేడికళ్ళను మరపించే నయనాల్లో దాగివున్నదా అని నా భ్రమ.

"నిజంగా సంస్కర్త మీలోనుండి ఆ వేదనను వ్యక్తపరచడానికి తపన పడకుండావుంటే మీనుండి ఇలాంటి రచన రావడం జరగదు"

". నా మౌనం.

"మీకథ నిజమైనా కాకపోయినా విన్నవాళ్లను తనతో లాక్కెళ్ళడానికి ప్రయత్నిస్తున్న దన్నది యధార్థం" మాటలు తెలివిగా మెలిత వేసింది.

"మీలాంటివారు ప్రపంచంలో ఎక్కడోగాని వుంటారు. మీ దర్శనం లభించడం నా అదృష్టం" రజని నిజంగా బాధపడి అంటోందా? లేక ఇదీ ఆమె ఎత్తేనా?

"రజనీ! నిన్ను చూస్తే జాలికలుగుతోంది సుమా!"

"ఔను. హృదయమున్నవాళ్లి కది సహజం."

"నువ్వు ఈదారి వొదిలెయ్యడాని కింకే మార్గమూ లేదూ?"

"లేకేం—ఉంది. అయితే లోకం ఇంకా అంత ముందుకు....."

"ఎంత ముందుకూ?"

"చెప్పేవే చేసే వైపోయేటంత ముందుకు."

"జాగ్రత్తగా ఆలోచించు. పరువుగా బ్రతికే అస్కారమే లేదంటావా?". ఈ నామాటలు ఆమెను ఉద్రిక్తపరచి వుండాలి. ఒక్కసారి కదలి, కసు త్రిప్పి పౌరుషం వచ్చినట్లు,

"లేకేం—ఉంది. నిష్కల్మష హృదయంతో నాకు చేయూతనిచ్చే ఆసరా వుండాలిగా?"

"పరిశుద్ధమైన అంతఃకరణతో కృషిచేస్తే అది నీకు దుస్తరంకాదు."

"అనుకు నేటంతటి తేలికగాదు కూడాను."

"రజనీ! లేదు. నీవు పొరపడుతున్నావు."

"కాదండి. క్షమించాలి. ఏళ్లతరబడి అనుభవం నాలోంచి మాట్లాడుతోంది."

నటన నభినయించే రజినిలోనుండి అభిమానం గర్జించింది.

"లోకం మనం అనుకుంటున్నంత శ్రద్ధిదీ, క్రూరమైనదీ కాదు."

"ఆ సూత్రం అందరికీ వర్తించదు."

"పోనీ—నీ కభ్యంతరం లేకపోతే నే నొకటి"

"మీకూ అభ్యంతరం లేకపోతే నేనూ ఒకటి"

ఓహో! ఏమిటి గాంభీర్యం! ఎంత పటిష్ఠమైనదీ సన్నివేశం! నువ్వంటే నువ్వని సరి వుజ్జీగా రజని బదిమీదకు వచ్చేస్తోంది. సరే—కానీ. ఆమె ఎంతవాకా వస్తుందో చూద్దాం అమెది అనుభం—నాది తర్కం. రెండూ హోరాహోరీని తలపడ్డాయి.

"నేనా? నీకు??"

అవును. మీరే. సంస్కర్తలు. కొంచెం ధైర్యంతో దీనులైనవాళ్లకు చేయూత నివ్వండి. మీకంత అసాధ్యమైన దేదికాదు."

"ఏమిటి రజనీ! నీవడిగేది?"

"మీరు యువకులు. సమాజానికి ఎదురీదగలవార మని రొమ్ము విరుచుకు చాటుకుంటారు. ఒక పతిత. ఒక దీనురాలు, ఒక కులట, ఒక నీచురాలు, ఒక అనాథ—సమాజం బలంగా పాతాళంలోకి అణగ ద్రొక్కేస్తుంటే అణగి మణిగి వుంటూనే ఆకాశం దాకా ఎదిగే ఆకాలంకోసం అర్రులు చాచే ప్రాణి—బహు చిన్న మేలు కోరుతోంది".

నా హృదయం ద్రవీభవించడం ప్రారంభమైంది.

"ఇంక నన్ను బాధించక చెప్పు"

"మీ పరమపవిత్రమైన హృదయంలో విశాల ప్రపంచాల నెన్నింటినో విస్తరింపజేసుకొన్న మనస్సులో నా కిసుమంత తావిస్తారా?"

..."ఏం—అలాగ చూస్తున్నారు? పడిపోయిన నన్ను లేవదియ్యండి. మీవద్ద అన్ని అవకాశాలూ వున్నాయి. యువకులు, బ్రహ్మచారులు, నాకంటె పెద్దలు, విద్యాధికులు, ఆదర్శాలు ఆచరణలో ప్రతిబింబింపచేయగలవారు — చూడండి! మీ హృదయసౌధంలో ఏఒక్క మూలలో ఏ పాడుపడి బూజు పట్టినగదినో యిప్పించండి. దాన్నే మందిరంగా మార్చుకుని హాయిగా కతిపయజీవితాన్ని ఆకలిదప్పులు మరచిపోయి దొర్లించేస్తాను". రజని ఇంకా నన్ను ఖూనీ చేస్తోంది. ఇప్పటిదాకా ఎక్కడ దాక్కున్నాయో, ఏమైపోయాయో ఆదర్శాల యెండమావులు కట్టెదుట ఎగరడం మొదలుపెట్టాయి. ఉపన్యాసాలలో దంచిన నీతులు, గీతాల్లో హృదయం నుంచి తేల్చిన భావాలు అప్సరసల్లాగ నృత్యం చేస్తున్నాయి. అయితే హృదయంలోంచి ఒక గొంతు వినిపిస్తోంది. "అంతా మరిచిపో. సంఘం సమాజం వీటికి దడవకు. ప్రాజ్ఞుడవు. వింటే వింటారు తల్లిదండ్రులూ బంధువులూను—లేదూ—వీడు నా కడుపున చెడబుట్టాడు అంటుంది తల్లి. సంఘంలో ఒక ఉచ్ఛిష్టం అంటారు పెద్దలు. నిన్ను ఏరి పారేస్తారు. కడజాతి దానికన్నా కనాకష్టమైన వ్యభిచారిణితో చరిస్తున్నాడని పొడుస్తుంది. ఫర్వాలేదు. సాహసించి ఆమెకు చేయి అందియ్యి. చేవ చచ్చిపోయిందని నిరుత్సాహపడుతున్న ఆమెలో నవజీవనం నెలకొల్పు. చిదికి, జీర్ణమై విధం చెడిన సమాజంలో నూతన తేజం నింపు" వెంటనే పెనుపాము కెరటంలాగవచ్చి మొండి ఆలోచనలను బలంగా వొడ్డుకు నెట్టేస్తోం దింకొక ఊహ. ఛీ! నీవు ఆదర్శపురుషుడవు కావాలంటే దారి అదికాదు. నీకో ధర్మం వుంది. దాన్ని నీవు పాటించాలి. అదే నీ కర్తవ్యం. అంతేగాని ఇట్టి విషమావస్థలో బేలవై క్లైబ్యంలో కూలిపోతే ఎట్లా? ఒక్కొక్కప్పుడు వస్తుంటాయి జీవన్మరణ సమస్యలు. అపుడే నిలువరించాలి. ఆమె నిన్ను వంచిస్తోంది. మేలుకో. ధర్మం పేరిట, నీతినియమాల పేరిట, మానాభిమానాల మాటున ధర్మాన్నే అపహసిస్తోంది" ఎటూ తెగిపోని సంఘర్షణ ఇది.

"మీ మనస్సును కష్టపెట్టేనేమో క్షమించండి" రజని మెల్లగా అంది.

"కాదు. కష్టం ఏమీ లేదు. నువ్వు చెప్పినట్లు కొంచెమేం? చాలానే తావు ఇవ్వవచ్చు" వెంటనే ఆశాకిరణాలు ప్రసరించే నేత్రాలతో నా ముఖంలోకి తొంగి చూచింది రజని.

"కాని రజనీ! ఒక నియమం వుంది."

"ఏమిటో?" ఈ ప్రశ్నలో ఎంతటి లాలస!

"నేను వివాహం చేసుకోనని నిశ్చయించుకున్నాను ఏనాడో. ఒక పరమపవిత్ర కార్యానికి నా ం పణంగా అర్పించబడింది ఇంక ఎన్నడూ నేను దాన్ని తప్పను". ఆమె నామాట నెలాగ విన్నదో ఏమో చటుక్కున వొత్తిగిల్లి "మీరు ఇలాంటి ఒక్క సూత్రంకోసం మీపంథా మార్చుకోడం లేదే—ఇలాటి వందలు, వేలు సూత్రాలతో బంధింపబడి బందీయైపోయిన సమాజం కించిత్తైనా ఎందుకు కదలాలి? కదలదు. అమాయకుల్ని, అవినీతిపరులంటూ, అనాథుల్ని కాల్చుకుతింటుంది. మంచిదే. కాని ఇంకముందెప్పుడూ ఎవ్వరినీ ఏ విధంగాను ఆశపెట్టడానికి ప్రయత్నించకండి"—తుదిమాట కొంచెం కోపంగా త్రుంచివేసింది.

"ఒక్కటిమాత్రం మళ్ళీ ఆలోచించండి. నిష్పాక్షిక దృష్టితో. ఏకాంతంలో, ఇలాగే మీ ఎదుట ఒక కన్యను, అందాలబరిణెను చూశారనుకోండి. మీ మనసు ఎలాగుంటుందో యథార్థం చెప్పండి. సంతోషంగా వెళ్ళిపోతాను."

నేను మౌనం వహించాను. ఆమె దాన్ని అర్థాంగీకారంగా తీసుకొంది. త్రాచుపాము పడగెత్తినట్టు తల రోషంతో ఎ నావంక బుసలు కొడుతున్నట్టు ప్రారంభించింది. "ఎప్పుడూ ఎవరినీ ఇంక ముందు వంచించకండి. నేను వ్యభిచారిణినని, పతితనని, కులటనని నాస్థితి చూసి మీరు వాస్తవంగా బాధపడ్డారని భ్రమించాను. పొరపాటుపడ్డాను! దయయుంచి సంఘాన్ని మరమ్మతు చేస్తామనీ, ఆదర్శాలు ఆచరణలో చూపుతామనీ ఉపన్యాసాలివ్వకండి. రచనలు కూడా మానెయ్యండి. మనం చెప్పేవి చెయ్యగలం అనే ధైర్యం లేకపోతే నోరు మూసుకోవడం మేలు. పాపం! మీరు ప్రవచించేవన్నీ నిజంగా విలువైనవని

ఆ మాయలోపడి లేత్రాయపు యువతీ యువకులు అద ర్శాలనుకుంటూ వెర్రిగా వెంబడించి అవి ఎండ మావులు కాగా విలపిస్తారు."

నేను ఆశించినట్లుగాక కథ అడ్డంగా తిరిగింది. మొదటి నుంచీ ఆమె ఆడుతున్నదంతా కపట నాట కమే అని కానుకోలేకపోయాను. ఆమె వ్యాఖ్యానం వల్ల నాకు కోపం గలిగింది. "ఇంక చాలించు— నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా?"

"ఆహా— తెలుసుకు నే మాటాడుతున్నా ను"

"ఇంకా ఏదో సాయం చేసి నిన్ను ఉద్దరిద్దామను కుంటే"

"మహా సహాయం చేశారులెండి. ఉద్ధరించనక్క రేదు."

"అయితే దయచేయ్ పెందరాళే"—రజని నట నకు తగిన స్వస్తివాచకం నానుండివచ్చిందని గర్వం చాను. ఆ దెబ్బతో ఆమె కృంగిపోయివుండాలి. అవ మానంతో వంగిపోయివుండాలి. అవును. అదిగో! అలాగే జరిగింది. అవిగో కన్నీళ్లు! దీనత్వం! ఆమె లేచింది. రోషకషాయిత నేత్రి, సజలనయన—రజని అభిమానం వెలిగ్రక్కుతూ మొదలు పెట్టింది. "వెలవు వెళ్లొస్తాను. కాని—క్షమించండి, నేను కొంచెం గురుసుగా మాట్లాడుతున్నట్టుంటే; మీ కెంతకిష్టంగా వున్నా సరే సమయంవచ్చింది కనుక నేను ఖచ్చి తంగా చెప్పాలి. లేకపోతే అది నా తప్పు" అని గర్జించడంలో రజని నిజస్వరూపం మెఱుపులా వెలి గింది నా ముందు. ఆ కాంతికి తట్టుకోలేక కళ్లు జిగేల్ మని మూతలుపడ్డాయి. ఆమె వచించే సగ్నసత్యా లను గొంతు ముడి హాలాహలంకన్న చేదుగా మ్రింగింది. ఆమె ఉదహరించే ప్రతిమాటా నన్ను కదిల్చి వూపి వూపి పడగొట్టేలా గున్నాయి. అది ప్రసంగంగాదు ఝుంఝూ మారుతం.

"నన్ను సంఘం, లోకం, మీ మనస్సు— వ్యభిచారిణి, పింజారి, కులట అని వ్రేలెట్టి చూపు తున్నయ్. ఇంక ఎంతమాత్రం దీనికి నిలవ నీడలేకుండా లోకం వెలివేసింది. నిజమే. నేను వ్యభిచారిణిని. పాడిడప్పాను. కాని మీరు—సరిగ్గా ఆలోచించు కోండి! మీరు చేసేది వ్యభిచారం కాదా? గుండె మీద చెయ్యివేసుకు మిమ్మ మీరే ప్రశ్నించు కోండి. ఇంతదాకా మీరు చదివినగాథ ఏమిటండీ? సంస్కర్తలట! సంస్కర్తలు బయలుదేరారు సంఘాన్ని మరమ్మతు చేస్తున్నామంటూ దాన్ని కొల్లగొట్టుకు పీల్చుకుతినడానికి. పైగా మీరచన ల్లోను, ప్రసంగాల్లోను, మేము సమాజానికి వేరు పురుగులమనీ, సమాజాన్ని పీల్చి పిప్పిచేసేస్తున్నా మనీ విషం వెలిగ్రక్కుతున్నారా? సూటిగా ప్రశ్ని స్తున్నా — మీరు చెప్పే అసత్యంలో చేసే వ్యభి చారంలో నేను చేసేది ఎన్నోవంతు చెప్పండి? మాట్లాడరేం — లోకాన్ని అనుభవంద్వారాగాని, పరిచయంద్వారాగాని, పరిశీలనద్వారా గాని చూడరు. సాహిత్యారాధకులం అంటూ మీకున్న దుర్బుద్ధిల్ని కవితలు, కథలు, నవలలు అంటూ తెగవ్రాసి అమా యకమైన పాత్రలకు అంటగట్టి ఆ కంతలో ప్రజలి మూసి సొమ్ము చేసుకోవడంలేదూ? ఇప్పుడు మీరు వ్రాసిన కథలో స్త్రీనిగురించి వివరించారు. ఎప్పు డైనా స్త్రీమనస్సులోగాని, ఆమె భావనలోగాని ప్రవేశించి ఆమె ఇలాంటిదని నిర్ణయించుకో గలి గారా? అసలు మీకు దాన్ని చూడగలశక్తివుందా? లేకపోతే వూరుకోవాలి. అంతేగాని తోసదునమ్మా అని కలం బుచ్చుకుని కానికథలు వ్రాసి, చూసుప గాని వూహాలు ఏపాపమూ ఎరుగనివాళ్లకు అంటగట్టి పుస్తకాలు ముద్రించి ప్రజల్లో బహిరంగంగా, బాహాటంగా అమ్ముకుంటూ సిగ్గువిడి సమ్మానా లందు కుంటూ సరస్వతికి మీరు చేసేద్రోహం ఇంతా అంతా వుందా? సమాజానికి అది ఎక్కువ హాని కరమా? ఒకవ్యక్తి చెడునడత ప్రమాదకరమా? మీ అసత్యాలనే నిజమనుకొని నమ్మి అమాయకులైన బాలబాలికలు, యువతీయువకులు, మీ విషపూరిత ఆశయజ్వాలల్లోబడి, ఆ మాయావాపరంలో తగు ల్కొని మీకు 'జీ హుజూరు' అంటూంటే రొమ్ము విరుచుకొని వీధులంట తిరుగుతారా?"

క్రోధంతోబాటు ఆమెకు దుఃఖం గూడా వచ్చింది. ఇదంతా విని నాకు మూర్ఛవచ్చినట్లయింది. తెలివొచ్చిన చాలాసేపటిదాకా నోటమాట రాలేదు. రజని తన నిజస్వరూపంలో వచించినది నిజం అని గంటగట్టుకు చెప్పింది నా హృదయం. ఆలోచనలు అసలు పని చెయ్యవేమో అన్నంత అదటు పుట్టింది. ఆమె నా అంగీకారానికి గాని, ప్రత్యుత్తరానికి గాని ఆగకుండా నే రుసరుసలాడుతూ వెళ్లిపోయింది. పరా

జితుడనైతినే అన్న దిగులుతో ప్రక్కమీద వొరిగిపోయాను. ఎక్కడనుంచి వచ్చిందో మాయనిద్ర చావగొట్టి పారేసినట్లు నన్నెక్కడికో తీసుకుపోయింది.

## 14

సుప్రభాతం. బాలారుణ కిరణాలు ప్రక్కమీదకు వాలుతూ లేపుతున్నాయి నన్ను. త్వరగా సామానులు సర్దుకొని ప్రొప్రయిటరు గారికి చెల్లించవలసిన ముడుపుగట్టి రిక్షామీద స్టేషనుకు వచ్చాను. ఆరు గంటల లోపుననే రావలసిన మెయిలు రెండు గంటల లేటు అన్నారు. గత రెండు రోజుల అనుభవాన్ని తలంచుకుంటూ ప్లాటుఫారంమీద తచ్చాడుతున్నాను. ఆకాశం నిర్మేఘంగా నిర్మల సరోవరం లాగుంది. తుఫానులనంతరం ప్రశాంతంగావుండే సాగరంవలె నా హృదయం స్థాయిగావుంది. జరిగిపోయిన సంఘటనలు గుర్తుకొచ్చినకొద్దీ నాలో నాకే నవ్వు అధికమౌతోంది. ఇంద్ర ధనుస్సులోవలె ఈ లోకంలో ఎన్ని రంగులున్నాయో అనిపిస్తోంది. ఇట్లా ఆలోచించే నన్ను రజని పలుకరించడం చకితపరచింది. ఆమె ముఖం తెరలోపలవున్న ప్రశాంతతను ప్రస్ఫుటం చేస్తోంది.

"నేను చాలా అదృష్టవంతురాల్ని. ఇవాళ మీరు దొరకరేమో అనుకున్నా. నా భాగ్యం వంకి మెయిలు ఆలశ్యమయింది" రజని మళ్ళీ ఎందుకు వచ్చినట్లు?

"రజనీ! నీవు నాలోని చీకటి తెరల్ని చీల్చావు! నిజంగా నీవు రజనివే అని భ్రమపడ్డ నా భ్రమను నిర్భ్రమ చేశావు. నిన్నరాత్రి నీ వన్నమాటలు చెవుల్లో ఇంకా మారుమ్రోగుతున్నాయి."

"అది మరచిపోండి. ఆవేశంలో మీరు ఏదో అన్నారుగదా అని నేనూ అన్నాను. అన్యథా భావించకండి."

"ఫర్వాలేదు. ఒక్కొక్కప్పుడు మనం చేస్తున్నాం గనుక అవన్నీ ఎందుకు మంచివికావూ? అని గర్విస్తాం. ఇలాంటి అవరోధాలు కూడా వాటికి అత్యవసరం."

ఇంతలో మెయిలు వచ్చింది. బండి ఇంకా ఆగకుండానే జనం హడావుడిగా పెట్టే బేడా పట్టుకుని కిటికీలలోంచి లోపలకు పడవేసుకుని కూర్చోనేందుకు స్థలాలు భద్రపరచుకుంటున్నారు. దిగేవాళ్లు ఎక్కేవాళ్లను తోసుకుని దిగుతున్నారు. నేను అప్రయత్నంగా ఒక కిటికీలోకి లంఘించాను అప్పుడే ఒకడు ఖాళీచేసిన సీటు ఆక్రమించుకోవడానికి. బండి నెమ్మదిగా ఆగిపోయింది. రజని అవకాశం పురస్కరించుకుని నా బెడ్డింగు కటికీలోంచి త్రోసింది లోపలకు. నేను చిన్నబోయిన మొగంతో అందుకున్నాను. పెట్టెకూడా ఆమెయే అందిస్తోంది.

"ఇంక వెళ్ళు రజనీ" చెమ్మగిల్లడానికి ఆతురపడే కళ్ళలో వెలుగులాగున చిరునవ్వు చిలకడానికి ప్రయత్నిస్తూ అన్నాను. రజని ఏం చేస్తోంది? ఏమో చెప్పబోతోంది. అబ్బా! ఎంతటి భారం ఆమె గొంతు నులినొక్కిపట్టి ఆ పలుకులను వెలికి రానీయడం లేదు! పోనీ—మేం వస్తాం అంటూ రెండు వేడి కన్నీటిబిందువులు ఆమె చెక్కిళ్ళమీదుగా జారాయి. "రజనీ! దుఃఖిస్తున్నావా?"

"లేదు. మీరు నన్ను మన్నిస్తారని తుది కోరికగా క్షమాభిక్ష కోరడానికి వచ్చాను." ఈ పదజాలంతో దీనంగా ఆమె నావైపు చూచింది. నన్నింకా నొప్పిస్తోంది రజని. నేను ఆమె నేమికోరాలి? క్షమించమనవద్దూ" అనుకొని "అదేంటి రజనీ! నేను నిన్నేం కోరాలి మరి? కన్నీరెట్టుకోకు"

"పోనీ ఒక్క మాట ఆఖరిసారిగా మిమ్ము అర్థిస్తున్నాను—ఇవ్వరూ"

"ఇస్తాను" పశ్చాత్తప్త హృదయం ఆమెలో వెలుగుతూ నాలో ధైర్యం నిలిపింది.

"మీది ప్రశాంతసాగర తీరంలో బయలుదేరుతున్న నావ. నాదో—తరంగాల తాకిడిలో, పెను తుపానుల దెబ్బలలో, సుడిగుండాలమధ్యపడి కొట్టుమిట్టాడి మునుగుతూ తేలుతూ ఒడ్డెరుగని పడవ. విజయ యాత్ర చేసే నావికులు, మునిగినపడవల్ని గూర్చి, చుక్కాని పోగొట్టుకున్న కళాసులను గూర్చి ఆలోచించకూడదు. ఎంతటి ధీశాలియైన కర్ణధారికైనా ఆ తలంపులు భీరుత్వం కలిగిస్తాయి. కాబట్టి నా అభ్యర్థన మన్నించి నన్ను మరచిపోండి." మరచిపోతానని చేతిలో చెయ్యి వెయ్యండి" అంటూ ఆమె తన కోమలహస్తం ముందుకుచాచింది. దుఃఖం పెల్లుబికే పెదవుల్ని పంటితో కొరుక్కుని గుడ్లనీళ్లు కుక్కుకుని ఆమె చేతిలో చేతినుంచి "నేను నిన్ను ఉప

తికి తీసుకెళదామని ఆశించాను. కాని అది సాధ్యం కాలేదు. అయితే అది ఆశించకుండానే నీవు సాధించి నన్ను వెలుగుబాటలోకి నడిపిస్తున్నావు" అంటూంటే ఆమె కన్నీళ్లూ నా అశ్రువులు ధారగట్టి మా చేతుల్ని తడుపుతున్నాయి. "మాట ఇవ్వరూ" ఆమె మళ్ళీ అడిగింది. "ఇస్తాను. నేనూ నిన్ను ఒకటి అడుగుతా. ఇస్తావా?" ఏమైనా అడగండి. సంకోచించకండి. నిన్న మిమ్మల్ని విడిచి ఇంటికెళ్ళడంతోనే నా నటన పటాపంచలైపోయింది. ఇప్పుడు మీరు చూస్తున్నది వెలుగుపొందిన రజని."

"రజనీ! నీవు బ్రతికుండగా ఇంక ఆ చీకటి బాటన నడవనని ప్రమాణం చెయ్యి."

ఆమె మళ్ళీ కళ్లనీళ్లు నింపింది "చేస్తాను. ఇదిగో మన కలయికే సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. నేను ఈ క్షణం లగాయతు ఆ పాడుపని చెయ్యను. ఆ జన్మాంతమూ దీన్ని పాలిస్తాను" సత్యమైన ఆమె ప్రమాణం నా హృదయాన్ని స్పందింపచేసింది.

గార్డు ఈలలు ఊదాడు. రైలుకు గంటకొట్టారు. ముందునుంచి వెనుకనుంచి పచ్చజెండాలు రెపరెపలాడుతున్నాయి. కడుపునిండా మెక్కి త్రేన్చినట్లు, బొగ్గు మేసిన ఇంజను కూతపెట్టి, రజనిని వదలిపెట్టడానికి భారంతో వ్యధచెందే నా హృదయం వలె ఒక్కలాగు లాగింది.

"సెలవు. దయమాత్రం వుంచండి. నాకిచ్చిన మాట మరచిపోకండి. నేను మీతో అన్న మాట అక్షరాలా ఆచరిస్తాను, నమస్తే" రజని అక్కడే నిలుచుంది కదలకుండా. అచంచలంగా, గంభీరంగా నిలుచున్న ఆమె కన్నీటితోనే నాకు వీడ్కోలిస్తోంది. 'ఘక్, ఘక్' మంటూ రైలు కమ్మల గంట్లు తప్పించుకుంటోంది మెయిలు. ఒంటిరెక్క, జంటరెక్క, మూడురెక్కలు, నాలుగు రెక్కలు— ఎత్తురెక్కలలో వాలిన వాటిక్రిందనుంచి బరువుగా దాటుకున్న రైలును ఇంజను అతివేగంగా లాక్కుపోతోంది. నేను దూరమౌతున్నాను రజనికి. నేను కదిలిపోతున్నాను వేగంగా. నా గమనంకంటె వేగంగా గుండె కొట్టుకుంటోంది. నన్ను కాలవాహిని వలె రైలు ఎక్కడికో మోసుకుపోతోంది. కాని రజని అలాగే నిలిచివుంది. అచంచలంగా, ధీమాతో, స్థిరంగా, స్నిగ్ధ హృదయంతో, హాయిగా, సంతోషంతో. నవ్వుతూ చేతిరుమాలు ఊపుతోంది. అదిగో!

నిజంగా రజని జయించింది. కాదు నేనే జయించాను. అట్టే— కాదు— ఆమెదే విజయం అంటున్నారా? ఆమె నాతో అన్నట్టు ఆవృత్తి [illegible] ఖాయం. ఆ విషయంలో మటుకు ఆమెదే పైచెయ్యి. ఆ పసంనుండి ఆమె వైదొలగిందంటే నే గెలిచినట్లేగా. మళ్ళీ రజనికోసం చూశాను. మెయిలు ఆ కొద్దిసేపటిలోను—ఎంత దూరం చేసింది రజనిని! రజనికై కళ్లు పెద్దవిచేసుకుని దూరంలోకి చూశాను. రైల్వే లైనులోని కడపటి ఒంటి ఎర్ర రెక్క ఆవలివైపున పుయ్యబడ్డ తెల్లరంగును ఛేదించే నల్లగీత నన్ను చూచి కిలకిల నవ్వుతున్నట్టు లేచి తల ఆడించింది.

సంపూర్ణము

# దానవుడు - మానవుడు

ము ర యా

* గత సంచిక తరువాయి *

కాళ్లు వణకాడ వెఱగంది కాయమెల్ల - బిట్టు కంపింపగా నొక్క-చిన్నవాఁడు
తోడవచ్చినవారలు వీడిపోవ - జెట్టుచాటున కెట్టులో చేరి నిలచె.

భూమిదట్టించి యుగ్రతన్ బొబ్బరించుచు - ఎవ్వరెవరంచు రభసాన నేగుదెంచు
నసురు దూరాన కనుగొన్న యంతలోనె-చిన్ని బాలుని హృదయమ్ము చెదరి ప్రిదిలె.

కర్మవశమున బాలుండు కంటఁబడిన-వేగపరువెత్తి వచ్చుచున్ డేగవోలె
పిడికిటంబట్టి యసురుండు విసరివైచె - వాఁడు వికలాంగుడైపడె గోడవెన్క.

మాలిఁబిల్పించి తిట్టుంమాటలాడి - చెట్టునకుఁగట్టి బెత్తాలఁగొట్టి కసరి
తూలనాడుచు తూలుచు తోఁటవీడి - దుష్టరూపుడై చొచ్చెను దుర్గమతఁడు.

కంఠనిగళమ్ముఁ దెగవేసి కాళ్ళనున్న - బంధములనూడ్చి వీధులఁబరువులెత్తు
గంగవెఱ్ఱులెత్తిన మదగజమువోలె- నంత నందునుఁ దిరుగాడె నసురుఁడచట.

కోపోపర్బృధ ధూమమట్లడర వ్యాఘూర్ణద్భ్రూవల్లీద్వయం
జేపారన్ కను లగ్నిగుండములునై హేరాళ కాంతిచ్ఛటల్
మైపొంగన్ వికటాపగాగతిని ఘర్మాంభః పృషత్సంఘముల్
దీపించెన్ శిఖితప్తతాళరుచిమ ద్దేహంబు కంపింపగన్.

అణచుకొనలేడు లోని కోపాగ్నినతడు-నిల్వగాలేడు నొకచోట నిమిషమేని
పర్వులెత్తును ఊరకే భయముఁ జెంది - గాలిసోకిన భీరువువోలె నతఁడు.

అతని కోపతాపంబున కంతులేదు - అగ్నిగుండమ్ముగామాఱె నతని యెడఁద
తనువు కంపించిపోయెను తాపశిఖల-శాంతిలేక తపించె నిశాచరుండు.

ఊరకఁ గోపగించుకొని - యూరక దూరును చిన్నిబాలురన్
చేరగ రండటంచుఁ దన-చెంతకుఁ బిల్చును భృత్యవర్గమున్
చేరిన యంతలో నతఁడు - ఛీయనుచుం గడు చీదరించుచున్
వారల మోదుచున్నతడ-వారితుడై చరియించుఁ గ్రూరుఁడై.

రేయి ద్రిమ్మరి హృదయాన రేగెఁ బగలు-సేవకావళి గుండియల్ చెదరిపగిలె
ధూళిధూసరితంబయ్యె తోఁటయంత - కోపవహ్నితోఁ గంపిల్లెఁ గోఁటయంత.

## 6

మోదుగులు విచ్చి కొల్లలై పూచినట్లు - ముద్ద మందారములు రాశిపోసినట్లు
పాలబుగ్గలఁ జిదిమిరాపాడినట్లు అస్తమయ వేళఁ బశ్చిమం బరుణమయ్యె.

ఇరుల దుప్పటముల విప్పిపఱచి మేము-పాపములఁ గప్పి నిజములఁ దాఁపగలము
అంచు గుసగుసపోవుచు నావరించె - సంజచీకట్లు నాల్గు దిశాంతములను.

తెల్లవోయెడి నెలతాల్పు తేటవెలుగు - లల్ల నల్లన మూలల నరసికొంచు
కల్ల కపటాల నెఱుగని కల నిజమ్ము - తెల్ల మొనరించెదమటంచు దిశల సాగె.

వడగళ్ల వానతో వనమంత నెంతయో - చిందరవందరై చెదరిపోయె
నాకులపాటుతో వ్యాకులంబందుచు - పూలతీవలు తెగి నేలఁబారలె
భయదమై హోరున పవనాలు వీవగా - చెట్టులన్నియు నేలమట్టమయ్యె
ఫెళఫెళార్భటులతో పిడుగులు రాలగా - దుర్గము సడికొప్ప తూట్లువడియె.
కారుమేఘాలు తోఁటపైఁ గ్రమ్ముకొనుచు - కుండపోతల నీరముల్ గుమ్మరించె
చిత్రమదియేమొ యూరిలోఁ జినుకుగూడ-రాలినది లేదు సుఖముండెఁ బ్రోలిజనము.

ప్రబలదారుణ నిర్ఘాతపాతములకు - భయదహుంకార నిర్ఘోషపవనములకు
కాల పాథోధరచ్ఛటా గమనములకు - విలయతాండవ నిలయమ్మై నిలచె వనము.

తుణిగిపోయెను కొలనులోఁ దోయజములు-రాలిపోయెను వనములోఁ బ్రసవతతులు
పూతపూచిన భూజముల్ మోడులయ్యె-వనము వనమంతనంతటఁ బాడువడియె.

ఘోరఘాతుక మొనరించుఁ గ్రూరుఁడెవ్వ-డంచు బాలభానుం డుదయాద్రిపైన
చటుల కోపారుణ నయనాంచలములందు-రుధిర కాంతుల వెలుగంగ నుదయమయ్యె.

అరుణకిరణాలతో నుదయాద్రిపైన - నీరజాప్తుడు నీటుగా నిలచినపుడు
రగిలె రతనాలరాశిలో రాగకాంతి-యనగ శోణిమ విశ్వంబు నావహించె.

నాటి యుదయాన నాతఁడు తోఁటలోన - పాపఫలితానుభూతి విభ్రాంతిఁ గొలుప
దిగులుతో మండి యారిన పగలతోఁడ-శిథిలహృదయుఁడై తిరుగాడెఁ జెట్లనడుమ.

నిన్నయు మొన్నయు న్నిచట నిండగు శోభ వెలార్చుచుండు లేఁ
గ్రొన్ననలెన్నియో విరియ గొప్పగ మెప్పులఁబొందినట్టి యీ
చెన్నగు తోఁటయే యిటుల చిన్నెలువన్నెలు మాసిపోవ-నీ
తెన్నున నున్నదా యనుచు దీనతఁజెందిన మానసమ్ముతో.

ఇన్నిదినాల నావనమె ఎంతయొ వింతగ ముద్దు ముద్దుగా
నెన్నొరకాల పూలపొద లింపగుసేడల నల్లిబిల్లిగా
వెన్నెలచాయలో నెదిగి విచ్చిన పూవుల నందగింపఁగా
నెన్నడుగాని యేనెఱుగ నేరనుగా పువుఁదోటచందముల్.

మందమలయానిలమ్ముల చందమేమొ-కొలనఁ దూగాడు కలువల చెలువమేమొ
వెన్నెలవెలుంగులోఁ దోటవన్నెలేమొ-కానలేదాయె నార్ద్రిత లేనికతన.

8

అంత నొకచోట నెంతయో వింతగొలుప-లేతజొంపాల పాన్పుపై నాతఁడొకఁడు
దివ్యలోకాల నేలెడి తేజమలర - కమలబాంధవు కాంతితోఁ గానిపించె.

పాలుగారెడి చెక్కిళ్ల బాలుఁడతడు - వన్నెబంగారుచాయల చిన్నవాఁడు
కన్నుల తటిల్లతల సోయగమ్ము వాఁడు - తేరిచూడగ నెవ్వారు నేర రతని.

"అయ్యయో! అదియేమొకో ఆ కుమారు - కంఠసీమలో నెత్తురు కరుడుకట్టె
కీలుకీలున మేకుల చాలులేమి? - కాయమెల్లెడ రక్తపుఁ గాల్వలేమి?

ఇంతలు చేసినట్టి జనుఁడెవ్వఁడో! - యేటికిఁ జేసెనో కటా
వింతగ నున్న దీ తెఱవు పిన్నవయస్కునిబట్టి మేకులన్
దింతురటే మనోజ్ఞ నవ దివ్యలతాంతములోని మేనిపై
ఎంతటి దుష్టుడేని యిటు లింత వివేచన లేక యుండునే?

ఆయను కేకతో నడరి యామడదూర మపాయ భావమే
పాయక ధైర్యవిహ్వలతఁ బాఱెడి బాలు డితండు వీని నే
మాయలొ చేయుచున్ కడు నమాయకు నెవ్వడు పట్టి యిట్టి అ
న్యాయము సల్పెనో గద దయారసహీనుడు క్రూరకర్ముఁడై."

అనుచుఁ దనమాట తాను గావినిన యతఁడు-తలపులట్టివి హృదయానఁదాల్చినపుడు
కరుణ యొకకొంత మనసులోఁ గలిగినపుడు-కదలి కంపించె క్రౌర్యంబు వదలిపోయె.

అట్టి రాతిగుండియకూడ ఆర్ద్రమగుచు-కరగిపోయెను నతనిలోఁ గరుణ మొదవె
మనసు మారెను దానితో మారె మనిసి-పొంగివచ్చెను దుఃఖమ్ము పొరలి పొరలి.

## దానవుడు - మానవుడు

అడుగు తడబాటు పడుచుండ నడువలేక - పెదవి వణకాడగా నోరు మెదపలేక
తూలిపోవుచుఁ గుప్పగాఁగూలె నతఁడు - కొండ పగులంగ భళ్లునఁగూలునట్లు.

"ఎవ్వఁ డయ్యయో యిళ్లేల యింత నీకు- చేయరానట్టి యపకృతిఁజేసినాఁడు
పేరుఁజెప్పుము వానిని వెదకిపట్టి-కండలను చెండివేసెదఁ గాకములకు.

బాలుడా నీవెచటనుండి వచ్చినాడ - వొంటిగా నిట నిళ్లేల నుంటివోయి?"
అంచుఁ బల్కరించుచు నాతఁ డల్లనల్లఁ- జేరవచ్చెను ప్రేమతోఁ జిన్నవాని.

"చిన్నిపిల్లలఁ బ్రేమింపఁ జేత కాని-ఱాతి హృదయమ్ము నీదయో రాక్షసుండ!
పేరు నూరును నాకేల వెఱ్ఱివాడ - సకలభువనాల నలవోక సంచరింతు.

పుడమి మానవులెందరో పడుచునున్న - బాధ నెఱుగంగగోరి యీ వ్యథలనొంది
జగతిఁ గష్టాలు మాన్పంగ జతనమేను - చాలకాలమ్మునుండియు సల్పుచుంటి.

వలదు వలదోయి యేరిపైఁ బగలుదీర్ప-మనసుపడకోయి క్రౌర్యంబు మానుమోయి
వలచి వలపించుకొను నీవు బ్రతుకుమోయి-మంచిబాటలఁగలదోయి మధురిమమ్ము."

చిలుక పలికిన రీతిగాఁ జెలువమొప్ప-పలుకుపలుకున మాధుర్య మొలుకఁబోసి
నీతి నియమాల విషయాల నేర్పునెంచి - నాల్గుమాటల నేర్పె దానవున కతఁడు.

కరుడుగట్టిన స్వార్థమ్ము కరగిపోవ-ప్రేమభారాన హృదయమ్ము వేగిరింప
కరయుగమ్మును ముకుళించి కనుల మూసి- మోకరిల్లెను నేలపై మోము వాల్చి.

కనుల మిరుమిట్లుగొల్పి ఆకాశవీధి - మెరసి యంతర్హితంబగు మెఱపువోలె
మాయమయ్యెను రక్కసి మనసు మార్చి-బాలు డంతలోననె వెల్గుబాటలోన.

సంపూర్ణము

# పాపపుణ్యాలు

'కనకమేడల'

శ్రవ్యనాటిక

* సంఘారామం ఆవరణలో బౌద్ధ సన్యాసి ధ్యానముద్రనుండి మేల్కొని:

బౌ. స : బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!
ధర్మం శరణం గచ్ఛామి.!

[నిర్మల వాతావరణంలోని నిశ్శబ్దాన్ని చీలుస్తూ జయదేవ, ఆనందులనే ఇద్దరు శిష్యులు—]

శిష్య : గురుదేవులకు నమస్కారం!

బౌ. స : సమయానికి వచ్చారు. నిన్న నేకదూ మీ రొక మహత్తరమైన ప్రశ్న నన్నడిగారు? పాప పుణ్యాలని వేని నంటారనికదూ మీ రడిగింది?

శిష్య : ఔను గురుదేవ్! పాపపుణ్యాలను గురించి సవిస్తరంగా తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో మిమ్మల్ని అడిగాం. మీరు రేపు చెబుతా మని సెలవిచ్చారు.

బౌ. స : ఔను. మీ రా విషయాన్ని వివరంగా తెలుసుకు నేందుకు కొంత శ్రమపడవలసి ఉంటుంది.

శిష్య : అందుకు మేం సర్వథా సిద్ధమే! మీ ఆజ్ఞ మేరకు మేం ఏమైనా చేయగలం!

బౌ. స : మీరిద్దరూ ఒక సంవత్సరకాలం నా ఆశ్రమాన్ని విడిచి వాస్తవ జగత్తులో విహరించ వలసి ఉంటుంది.

శిష్య : మీ ఆజ్ఞ.

బౌ. స : కాని అదీ అంత తేలికైన పని కాదు. ఒకరు రి అధిపతి అంతఃపురంలోను మరొకరు మహాయోగి విద్యానందుని సన్నిధిని శుశ్రూష చేయవలసి ఉంటుంది. ఆ గురుతర బాధ్యతలను మీరు నిర్వర్తించాలి.

శిష్య : అందుకు సిద్ధమే.

బౌ. స : మీరిద్దరూ స్వర్ణగిరి నగరంలో నేఉంటున్నా సంవత్సరకాలం గడిచి నాదగ్గరకు వచ్చే వరకు ఒకరితో నొకరు మాట్లాడకూడదు. నిత్యం మీమీ స్థలాలలో జరిగే విశేషాలను జాగ్రత్తగా పరిశీలించండి.

: సరే.

బౌ. స : ఐతే బయలు దేరండి. జయదేవ్! నిన్ను మహర్షి కప్పగిస్తాను. ఆనంద్! నిన్ను రాజ సన్నిధి నుంచుతాను. మీ కంగీకారమేనా!

శిష్య : మా అభిలాషను చక్కగా గ్రహించారు.

బౌ. స : సరే లేవండి.

## 2

** కాలిగజ్జెల ధ్వని క్రమంగా అంతరిస్తుంది. కొంచెం అలసిపోయినట్టు నిట్టూర్పులు. తాగి తూలిపోతున్న సవ్వడి.

నర : ఆగండి. మీరింకా అలా తాగి మత్తెక్కి పోవడం నేను సహించలేను. ఇప్పటికే మీ గుండెల్లో పేరుకున్న మధువుంగు ..... (కంగారుగా) ఆనంద్! ఆనంద్!...మహారాజావారు మత్తులో స్పృహతప్పిపోయారు. తెలివి తేవడానికి కొంచెం పన్నీరు...... త్వరగా......

[కొంచెం ఆలస్యం]

ఆనం : ఇదిగో దేవీ!

నర్తకి : ఇక నీవు ద్వారందగ్గరికి పోవచ్చు.

[అడుగుల సవ్వడి గట్టిగా వినిపించి సన్నగిలుతుంది.]

మహారాజు : కిరణ్!...... (అధికార స్వరంతో మత్తులో) ఆడడం ఆపేశావేం?—నిన్నెవరాపమన్నారు? ఊఁ—

కిర : ఎవరూ ఆపమనలేదు. ఎవరో ఆపమంటే నేను ఆపేదాన్ని కాదు. మీ మాటపై నడిచేదాన్ని ఇతరుల మాట వింటానా? మీరే చెప్పండి.

మహా బాగా చెప్పావు! కిరణ్ — (వికటంగా నవ్వి) నా మాట వింటావు కదూ!....ఊఁ... ఆ సీసా యిటు తే.

మళ్ళీ మద్యమా!...అందుకు నే నంగీకరించను. నా ప్రాణంతో సమానమైన మీరిలా నాశనమైపోతుంటే నే నెంత కృంగిపోతున్నానో...

మహా ఊఁ—(కోపంగా) ఆపు. అధికంగా ప్రసంగించకు—ముందు మద్యం తే—

కిర మహారాజా! నామాట వినండి. నే నెంతటి నీచురాలనైనా నాకూ ఆత్మ ఉంది. మీ ఆస్థానంలో నేను చేరినప్పటినుండీ మీ పతనానికి నేను వగసున్నాను. మీరు ..

మహా కిరణ్! ...... ఇస్తావా! నన్నే తీసికోమన్నావా!

కిర నా చేతులారా నేను మిమ్మల్ని...

మహా ఊఁ—మాటలు పెంచడం నా కిష్టం లేదు. ఆనంద్! ఆనంద్!

ఆనం : (క్షణంలో వచ్చి) ప్రభూ!

మహా ఆ సీసా ఇటివ్వు—

ఆనం : అధికంగా త్రాగడం ఆరోగ్యానికి భంగం స్వామీ!

మహా అధికప్రసంగం!

ఆనం మీ యిష్టం! (అడుగుల సవ్వడి)

మహా (వికటంగా నవ్వి) ఆనంద్! నువ్వు చాలా మంచివాడివి! (మళ్లీ నవ్వు)

కిర ఔను. మీరు చెప్పిన పని చేసిన వాళ్ళంతా మంచివాళ్ళే...

మహా : కిరణ్! నువ్వూ మంచిదానివేఁ—ఏదీ మళ్ళీ ఒక్కసారి...

కిర నాట్యమా, మద్యమా?

మహా (నవ్వుతూ) ఊఁ—రెండూ మత్తు కలిగించేవే కిరణ్ — నీ కాలిగజ్జెల గలగలలు— గదిలో దాచిన మద్యపాత్రల సవ్వడులు—

కిర మీరు అడుగడుక్కీ గోతిలోకి జారుతున్నారు మహారాజా!

మహా జారినా ఎగ్రబ్రాకినా నీకోసమే—(నవ్వు)

* * ప్రాతఃకాలపు పక్షుల కిలకిలారావాల మధ్య నిశ్శబ్దపు గాంభీర్యాన్ని చీలుస్తూ :

జయదేవ్ : (గంభీరస్వరంలో)

రాగద్వేష వియుక్తైస్తు
విషయా నింద్రియైశ్చరన్!
ఆత్మవశ్యైర్విధేయాత్మా
ప్రసాదమధిగచ్ఛతి.

[అడుగుల సవ్వడి సమీపించగా]

యోగి : జయదేవ్! ఇంకా గీతాపఠనం కాలేదూ!

జయ : నేటి కింతటితో ముగిస్తాను స్వామీ!

యోగి : నీవు గీతా రహస్యాన్ని గ్రహించినప్పుడే వేదాధ్యయనం ప్రారంభం కావడం—మీ గురుదేవులమాట ననుసరించి నీకు వేదాలలో పరిపూర్ణ జ్ఞానాన్ని ప్రసాదించాలనుకుంటున్నాను. అందుకు గడువు కూడా ఒక్క సంవత్సరమే.

జయ ఔను స్వామీ!

యోగి మాటల్ని వినడంకంటే మస్తిష్కంతో పరీక్షించడం మంచిది. న్యాయాన్యాయాల నిమిత్తంగా నీ అంతరాత్మలో జరిగే ఘర్షణ, తత్ఫలితాన్నే నీవు అంతిమ నిర్ణయంగా భావించు. నాకంటె పరమాత్మ స్వరూపమైన భగవద్గీత నీకు అత్యధిక జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది.

జయ : ఐనా మీలాంటి వారి సాంగత్యం, గురు శుశ్రూష లేనిదే ఏ పరిజ్ఞానమైనా అబ్బడం చాలా కష్టం.

యోగి : కాని కేవలం శుశ్రూషా సాంగత్యాల వల్ల లాభం లేదు. మీ గురుదేవుని ఆశ్రమంలో ఉన్నంత తేలిక కాదు ఇక్కడ ఉండడం! నిర్మలమైన, నిశ్చలమైన మనస్సుతో జప తపాలతో మాతోపాటు పాల్గొనడం నీవూ అలవర్చుకోవాలి.

జయ : మీ ఆజ్ఞ స్వామీ!

యోగి : అంతా మనస్సులోనే ఉంది. మానవుని మహా మనీషిగా చేసినా, అల్పవ్యక్తిగా చేసినా అంతా మనస్సుదే బాధ్యత. మనస్సును కట్టుకుంటే కష్టసాధ్యమైన పనంటూ వేరే ఉండదు.

జయ : అది అందరికీ సాధ్యం కావాలికదూ! లేక పోతే మానవుల్లో తరతమభేదాలు ఉచ్ఛ నీచస్థితులు ఎందుకుంటాయి. మనస్సును సాధించడంవల్లనేగా మీరు మహారాజుల కూడా లభించని అనంతమైన యశస్సును శాంతిని సుఖాన్ని పొందారు!

యోగి : నువ్వు పొగడడం, నేను పొగిడించుకోవడం యుక్తమైనవిషయంకాదు. అన్నిటికీ అతీ తంగా ఉండగలిగినప్పుడే మనస్సు అను భూతుల్ని ధిక్కరించకలుగుతుంది. అదే మానవమేధకు చరమావస్థ. అదే మన లక్ష్యం.

జయ : అలాగని కర్మరహితులంగా మనడం ఎంత వరకు సముచితం—

యోగి : అనుభూతులకు దాసులం కాకూడదన్నంత మాత్రాన ఏపనీ చేయకూడదని అర్థం కాదు. స్వార్థరహితమైన ఏపనైనా ప్రజాక్షేమం కోసంచేయడం అనుచితం కాదు. పరార్థ చింతకూడా ప్రబలిపోతే మనలక్ష్యానికే ఆటంకం ఏర్పడుతుంది. ఆలోచనల్ని అరి కట్టడం నేర్చుకోవాలి.

జయ : అందుకు ఏం చెయ్యమంటారో మీనుండి వినాలని నాకోరిక.

యోగి మనస్సును పవిత్రంగా నిర్మలంగా ఉంచు కోవాలి: అందుకు పవిత్ర నిర్మల వాతా వరణం కావాలి. అపవిత్రమైనవాని వేటినీ పరిసరాలకు రానీయరాదు.

జయ : ముఖ్యమైనవిషయం బోధించారు.

యోగి : రేపటినించి ఈ ఆశ్రమభారాన్నంతటినీ నీవే వహించాలి. సాధ్యమైనంతవరకు ఈప్రాంతం తంగా ఉండేట్టు చూడాలి.

జయ గురుతరమైనబాధ్యత నప్పగించారు.

[బయట రథాశ్వాల డెక్కల చప్పుడు]

యోగి ఎవరది!

ఆనంద్ మహారాజావారు ఆస్థాన నర్తకీసమేతంగా తమ దర్శనంకోసం వేంచేస్తున్నారు.

యోగి : అలా రావడానికి వీల్లేదు. ఇంచుమించు గా వెలయాలిలాంటి నర్తకి నా ఆశ్రమాన్ని అప విత్రం చేయడం నేను సహించను. నా దర్శనం కోరితే మహారాజు గారు ఒక్కరే రావచ్చు.

మహా : ఆనంద్! (బిగ్గరగా) యోగీంద్రులతో మేం తిరిగి వెళ్లిపోతున్నామని చెప్పు. మా ప్రియతమమైన వస్తువులేకుండా మేం ఎవరి నమూ చేయము.

యోగి : క్రమ్ముకున్న అజ్ఞానాన్ని కారుచీకట్లు తొలగించలేవు — జయదేవ్!

జయ : స్వామీ!

యోగి : ఇటువంటి అకృత్యాల నెన్నడూ ఆశ్ర మంలో జరగనీయకు. సర్వం పవిత్రంగా ఉంటేనే మనస్సు పవిత్రంగా ఉండడం. మనస్సు పవిత్రంగా ఉన్నప్పుడే మన లక్ష్యాలసాధన.

జయ : అపవిత్రమనీ, పవిత్రమనీ వేనినంటారో కూడా మీరు విశదీకరిస్తే నేర్చుకుంటాను.

యోగి : ఇంతమాత్రం తెలియనివాడివి ఈ ఆశ్ర మంలో ప్రవేశించి ఏం నేర్చుకుంటావు?

జయ : ఈ ఒక్కవిషయం నేర్చుకోడానికే నేను మీ శుశ్రూష చేయడం — మీ ఆశ్రమా న్నాశ్రయించడం—

యోగి : ఇంతటి చిన్నవిషయాన్ని మీకు తెలియ చెప్పలేనంతటివారా మీ గురుదేవులు.

జయ : ఇది చిన్నవిషయం కాదుస్వామీ! మీ దృష్టిలో—

యోగి : మానవుడు జీవితధర్మంగా పెట్టుకున్న నియమాలను ధిక్కరించడం అపవిత్రత. వాటిని సక్రమంగా పరిపాలించడమే పవిత్రత.

[దేవాలయంలోనుంచి గంటల గంభీర నాదం]

జయ స్వామీ! పూజకు వేళయింది.

యోగి పద. పూజాద్రవ్యాలను పరికరాలను సమకూర్చు.

జయ మీ ఆజ్ఞ— —

యోగి సమయమంతా చర్చతోనే గడచిపోయింది. ఈదినం దైవపూజకు విలంబనం కలిగింది—త్వరపడు.

[తిరిగీ గుడిగంటలనాదం ఆరంభమై క్రమంగా సన్నగిల్లిపోతుంది]

## 4

మహా కిరణ్! నిన్ను వదిలి నేను ఎక్కడికి నే ఆశ్రమాన్ని దర్శించాలట! అలా చేయడం నాకు సుతరామూ ఇష్టంలేదు.

మహారాజా! అలా సెలవియ్యడంలో తప్పులేదు. పవిత్రమైన ఆ స్థలంలో అడుగిడే హక్కు కులటనైన నాకు లేదు.

మహా కులటనైనా నీవు నాకు ప్రియురాలివి. భార్యావియోగానంతరం నా హృదయంలో అమృతవర్షం కురిపించినదానివి—నా జీవితానికి ఆనందప్రదాతవు.

మీరు నాపట్ల ఇంత ప్రేమను కనబరచినా అది నా నైచ్యాన్ని కడిగివేయలేదు ప్రభూ!

మహా నీవు నీమరాలవైనప్పుడు, నీవు అపవిత్రవైనప్పుడు నీ పాద ధ్వనులలో ఆనందాన్ని పొందుతూ నిత్యం నిన్నారాధిస్తున్న నేను మాత్రం...

ఇక చాలు. మీరలా తలంచకండి. ఎప్పటికైనా మాణిక్యం మాణిక్యమే, మసిబొగ్గు మసిబొగ్గే! ఎలాగైనా మీరు మహారాజులు!

మహా పాప పుణ్యాలకీ, పవిత్రాపవిత్రతలకీ ఉచ్చనీచ భేదాలేమిటి?—అందుకు మహారాజులైనా సామాన్య మానవులైనా ఒక్కటే—ఏమంటావు ఆనంద్!

ఆనం : నిజం ప్రభూ! పాపపుణ్యాల విచక్షణలో తరతమాల భేద మెందుకు?—

మహా : మరి ఆ మహాయోగి అలా అనడానికి కారణమేమంటావ్?

ఆనం : వారి మనస్సులో ఏముందో ఎవరు చెప్పగలరు. మహారాజా! ఎవరి ఉద్దేశాలు వారివి.

మహా : మరి విభిన్నమైన ఉద్దేశ్యాలు కలిగిన మానవులు విభిన్న వ్యక్తు లేర్పరచిన నియమాలను పాలించాలని నిర్బంధించడం ఎంతవరకు న్యాయం!

ఆనం : ఆ విషయం మహాప్రభువులు మీరే నిర్ణయించాలి.

మహా : పాపపుణ్యాలు మానవుల సంఘం ఏర్పరచిన కట్టుబాట్ల ఫలితాలు—వాటిని పాటించడంలోనే పవిత్రతా పవిత్రతలనే భేదాలుండకూడదు.

[దూరంనించి వస్తున్న సంకెలల ధ్వని సమీపిస్తుంది. పెద్ద పెద్ద నిట్టూర్పులు దగ్గరగా వినవస్తాయి]

ఆనం : మహారాజా! మహామంత్రి మీ సోదరునితో సహా మీ దర్శనం కోరుతున్నారు.

మహా : వెంటనే రమ్మను.

మంత్రి : మహారాజావారికి నమస్కారములు.

మహా : ఏమిటిదంతా—విజయుడెందుకు బంధింపబడినట్టు—నా ఆజ్ఞ లేకుండా......

మంత్రి : మీరు భార్యావియోగంలో విచారగ్రస్తులై ఉన్నప్పుడు, అనంతరం నర్తకీ నాట్యధ్వనులలో విషాదాన్ని మాపుకోడానికి ప్రయత్నిస్తున్నప్పుడు మీ సోదరుడు—సైన్యాధిపతిగా ఉన్న మీ సోదరుడు మీపై కుట్రలు పన్ని తిరుగుబాటుచేశారు. అందుకు ప్రతిఫలంగా......

మహా : మహామంత్రీ! నా సోదరునిపట్ల నీవు అపచారం చేశావు. తిరుగుబాటు చేసినవానిని ఎదిరించి ఓడించి బంధించమని నేనన లేదు-

మంత్రి కాని అది నా కర్తవ్యం ప్రభూ!

మహా సరే—ఇప్పుడైనా సంకెలలు తొలగించు. రాజ్యకాంక్షతో మత్తెక్కిపోయినవారిని మందలించడంకన్నా మన్నించడం మంచిది. కాకపోయినా అతడు నా సోదరుడు. నా రాజ్యంలో సగం భాగానికి అర్హుడు—

మంత్రి : కాదు ప్రభూ—మీరుండగా మీ సోదరునికి ఈ రాజ్యంపై అణగింజంతైనా హక్కు లేదు.

మహా : అని ఎవరన్నారు! అది ఎప్పుడో అధికారం కోసం పెద్ద లేర్పరచుకొన్న నియమం. అందులో స్వార్థం ఉంది. నిజానికి ఈ రాజ్యానికి ఇద్దరం సమానార్హులమే.

మంత్రి : మీరు నియమోల్లంఘనం చేస్తున్నారు ప్రభూ!

మహా : నాకు కావలసినది స్వార్థపరు లేర్పరచిన నియమం కాదు. నా మనస్సుకు తోచిన న్యాయం — మహామంత్రీ! విను — నా రాజ్యంలో సగం—సైన్యంలో సగం నా సోదరుని కప్పగించు-ఆలస్యం చెయ్యకు—

మంత్రి : ప్రభూ!

మహా : ఇది నా ఆజ్ఞ.

[పాదధ్వని క్రమంగా దూరమౌతుంది]

కిరణ్ : మీరు చేసినపని మీకే ముప్పు కలిగించవచ్చు ప్రభూ!

మహా : నా సోదరుడే నాకు ద్రోహం తలపెట్టినప్పుడు ఇంతకంటే వేరే గత్యంతరం లేదు. ఐనా నాకంటే అతడు ప్రజాపాలన సక్రమంగా నిర్వర్తించగలడేమో కాదని ఎవరనగలరు?

ఆనం : కాని స్వామీ...

మహా : ఎవరు దేని కర్హులో వారా పనిచెయ్యడం మంచిది.

కిరణ్ : అరివీరభయంకరులుగాను, ప్రజారంజకపాలకులుగాను ప్రసిద్ధి వహించిన మీకంటే రాజ్యపాలన కర్హులింకెవరు?

మహా : ఇప్పుడు నాకంటే నా సోదరుడే రాజ్యపాలనకు అర్హుడు కావచ్చు. అందుకే అతని భాగం ఇచ్చేశాను. అతనిసమర్థతను కాలమే నిర్ణయిస్తుంది.

ఆనం : మీ న్యాయనిరతి శ్లాఘనీయం ప్రభూ!

మహా అది ప్రతి వ్యక్తి కర్తవ్యం. న్యాయం అనుకున్నదాన్ని ఎంత కష్టగించినా చేసితీరడంలోనే వుంది మానవజీవన సాఫల్యం—

ఆనం : మీరు మహాజ్ఞానులు—

మహా : కాని కిరణ్మయి కాలిగజ్జెలకి దాసుణ్ణి.

కిర అలా అనకండి. ఈ దాసురాలు మీ ఆనందంకోసమే బ్రతికి ఉంది.

మహా : కిరణ్!

కిర : ప్రభూ!

మహా : ఏదీ—ఒక్కసారి నీ కాలిగజ్జెల గలగలలలో తన్మయత్వం పొందాలని కోరికగా ఉంది.

కిర : మీ ఆజ్ఞ శిరసావహిస్తున్నాను.

[ఇంతలో బయట ప్రజల గోల. క్రమంగా అడుగుల చప్పుడు వినిపిస్తుంది. ప్రజలలోని కోలాహలం ఒక్కసారిగా సన్నగిలుతుంది]

మహా : మీరంతా ఎందుకువచ్చారో తెల్పవచ్చు.

[మహారాజుకు జయజయ నాదాలు వినిపిస్తాయి.]

ఒకరు : మహారాజా! మీ పాలనలో ఇంతవరకూ మేం ఎటువంటి కరువుకాటకాలు లేకుండా బ్రతికాం. కాని ఈ సంవత్సరం వర్షాలు లేకపోవడంచేత పంటలు పండలేదు. కాని అధికారులు పన్నులు కట్టమని నిర్బంధిస్తున్నారు. పన్నులుకట్టే తాహతు లేదని మీకు మనవి చేసుకోడానికి వచ్చాం—

మహా : పంటలు పండనివారిని పన్నులు కట్టమని నిర్బంధించినవారిని నేను విచారిస్తాను. మీ అందరి పన్నుల్ని రద్దుచెయ్యమని మంత్రిగారికి ఆజ్ఞాపిస్తాను.

ఆనం : ప్రభూ! వెనక ముందు లాలోచించాలి. ఖజానాలో ధనం తగ్గిపోయిందని నిన్ననే కదూ మంత్రిగారన్నారు. పన్నులు వసూలు చేయనిది—

మహా : ప్రజలు పచ్చగా ఉంటే నే ధనాగారం నిండి పోయేది. మనం పాలించేది ప్రజల్నిగాని పండే భూముల్ని కాదు — భూముల్ని కూడా పండేట్టు, వర్షాలు కావలసినట్టు కురిసేట్టు చేయగలిగినప్పుడే రాజు ప్రజల్ని పన్ను లడగగల హక్కు సాధించగలడు.

[జయజయ నాదాలు తిరిగి విజృంభిస్తాయి]

మహా : మీ రిక వెళ్ళవచ్చు. తినడానికి లేనివారికి ధనాగారంలోంచి ఒక వెయ్యి బంగారు నాణాలు పంచిపెట్టమని నేను కోశాధికారికి ఆజ్ఞ ఇస్తాను.

[మహారాజు లోనికి వస్తున్న అడుగులధ్వని— జయధ్వానాలు సన్నగిల్లిపోతాయి.]

కిర : ధర్మప్రభువులు —

మహా : నీ ప్రేమ నామీద ప్రసరించినంతవరకు—

కిర : ఆమాట మీ రనకండి. నా జీవితాన్ని మరీ అసహ్యంపాలు కాకుండా కాపాడిన మీకు నేను చరణదాసిని.

మహా : ఐతే ఇక నాకోర్కె చెల్లిస్తావు కదూ!

కిర : అంతకంటేనా —

మహా : నాట్యమే కాదు నాణ్యమైన నీ కంఠ మాధుర్యాన్ని కూడా గ్రోలాలని...

కిర : మీ ఆజ్ఞ.

మహా : అనంద్! ఏదీ ఒక సీసా...

కిర : ప్రభూ! నా మొర ఆలకించండి...

మహా : కిరణ్! నేను ఆనందించడం నీ కిష్టంలేదా—

కిర : త్రాగడంలో ఆనందం లేదు ప్రభూ!

మహా : ఆనందం ప్రతిదానిలోనూ ఉంది. చెడ్డదైనా మంచిదైనా మనసుకు నచ్చిన ప్రతి పనిలోనూ, ఆనందం కనిపిస్తుంది.అనంద్... ఏదీ మద్యం —

అనం : ఇదిగో ప్రభూ!

మహా : నీవు మంచివాడవోయ్ — కిరణ్ ఇక —

(ఒక్కసారిగా గజ్జెలు ఘల్లుమంటాయి— కాసేపటికి పాటతో నృత్యం ఆరంభమౌతుంది. అప్పుడప్పుడూ సీసాల చప్పుడు వినిపిస్తుంది. "అనంద్! ఇంకొకటి." అని అప్పుడప్పుడూ అరపులు కూడా వినిపిస్తాయి. అడుగుల చప్పుళ్లు పెరుగుతూ క్రమంగా తరుగుతూ వినబడతాయి.)

పాట

కలలో అలలో కదలిన
కలకలరావా లేవో
దూరతీర సాగరాల
దూరరమ్మని పిలమ— ||కల||
కమనీయ రమణీయ
ఘనప్రణయ కుసుమాల
త్రుంచిపోయెద నెటుల
దూరదేశ తీరాలకు— ||కల||
ధర్మం నిండిన నేలను
ధరిత్రి నమ్మిన ధరణీశుని
ప్రణయం చిమ్మే ప్రభువుల
వదలి యెటులేగెదనో— ||కల||
పాపపుణ్య భావాల
పరిష్కరించే ప్రాంతం
పావన మీ రాగం
వదలి యెటు లేగెద— ||కల||

[ఆయాసం — పెద్దపెద్ద నిట్టూర్పులు— ఎవరో క్రిందికి దొర్లిపోయిన చప్పుడు వినిపిస్తాయి. నాట్యం ఆగిపోతుంది. 'అనంద్!' అని అరపు బిగ్గరగా వినిపిస్తుంది. అడుగుల చప్పుడు, కంగారుగా గది అంతా నిండినట్టు వినిపిస్తుంది.]

## 5

* * నిశ్శబ్ద నీరవ వాతావరణం — ఆశ్రమంలో యోగి:

యోగి : జయదేవ్! జయదేవ్!

జయ : స్వామీ!

యోగి : మగధ రాజ్యాధిపతి మన రాజ్యంపై దండెత్తి వస్తున్నట్టు వార్త వచ్చింది.

జయ : రాజ్యాలగొడవ మనకెందుకుస్వామీ! మనం అన్నింటికీ అతీతులం కావాలని మీరేకదూ వక్కాణించింది.

యోగి : నీవు పొరబడ్డావు. స్వార్థరహితమైన సత్కార్యాలలో భాగం పంచుకోవచ్చునని నేనప్పుడే చెప్పాను.

జయ : ఐతే ఇప్పుడు మనం చెయ్యగలపని—

యోగి : రాజ్యాన్ని శత్రుసైన్యాలనుండి రక్షించాలి.

జయ : అందుకు మహారాజు లున్నారుగదా—

యోగి : మహారాజులు మద్యపానంవల్ల మత్తులోపడి ఉన్నారని తెలియవచ్చింది. రాజ్యాన్ని రక్షించుకో గల జ్ఞానం ప్రస్తుతం వారిలో లేదు.

జయ : మద్యపానంతో మత్తెక్కిపడి ఉండే రాజులు రాజ్యపాలన మెలా చేయగలరు?

యోగి : ఇది అప్రస్తుతమైనవిషయం. రాజ్యాన్నెలాగైనా రక్షించమని మంత్రిగారు కబురంపారు.

జయ : ఐతే మనమేం చెయ్యగలం—

యోగి : ఈ మహారాజ్యంలో అర్ధభాగాన్నేలుతున్న విజయవర్మ ఇందుకు సమర్థుడు. అతడు నామాట జవదాటడు.

జయ : ఐతే నన్నేం చెయ్యమంటావు?

యోగి : విజయవర్మదగ్గరకు వెళ్లాలి.

జయ : వెళ్ళి — —

యోగి : నామాటగా చెప్పు. మీ సోదరులు విడిపోవడంవల్ల మీలోని బలహీనతను గ్రహించి పరరాజు దండెత్తి వస్తున్నాడని, శత్రువుల బారినుండి రాజ్యాన్ని రక్షించుకో గల శక్తి మహారాజుకు లేదని, అందుకు తగినవాడివి నీవేనని కాబట్టి సర్వసైన్యసమేతంగా రావలసిందని నేను కోరానని చెప్పు.

జయ : మీ ఆజ్ఞ— —

[అడుగుల చప్పుడు వినిపిస్తుంది]

యోగి : ఇదిగో — మహామంత్రిగారు సమయానికి వస్తున్నారు. వారితో ఈ విషయం ముచ్చటిద్దాం.

మంత్రి : యోగీంద్రులకు నమస్కారం.

యోగి : సమయానికి వచ్చారు. మహారాజుగారేమంటున్నారు.

మంత్రి : వారింకా మత్తునుండి తేరుకోలేదు. శత్రుసైన్యం సమీపించింది. మనం ముందు జాగ్రత్తలో ఉండకపోవడంవల్ల చాలా అపాయకరపరిస్థితిలో ఉన్నాం.

యోగి : అందుకే ఇప్పుడు విజయవర్మకు కబురంపుతున్నాను. అతడు శత్రువుల్ని జయించగలడు — అందుకు మీరేమంటారు మహామంత్రీ!

మంత్రి : అంతకుమించి వేరే ఉపాయం లేదు. మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి.

యోగి : జయసేన్! తక్షణం బయలుదేరు.

జయ : మీ ఆజ్ఞ

## 6

* * రాజసభలో కోలాహలం—రాజ్యప్రధానోద్యోగులు, మంత్రుల ఎదుట.

యోగి : నిన్నటిదాకా జరిగిన విషయాలన్నీ మీరంతా కళ్లారా చూశారు ఇంతటి రాజ్యాన్ని పరరాజు హస్తగతం చేసుకోవాలని చూస్తుంటే మీ మహారాజు మద్యంత్రాగి మత్తులో మైమరచి పడి ఉన్నాడు. ఇందుకు మహామంత్రి సాక్షి—

మంత్రి : ఔను. మహారాజుగారు అసలు రాజ్యకార్యాలను సరిగా నిర్వర్తించడం లేదు. మంత్రుల ఉద్యోగుల సలహాలను పాటించడంలేదు. వెనుకటిలా కాకుండా మహారాజు మద్యసేవనంలోను...

మహా : ఈ విషయంతా ఎవరో చెప్పనక్కరలేదు. మద్యం సేవిస్తున్నానని మత్తెక్కి ప్రవర్తిస్తున్నానని నేనే ప్రజలకు ప్రభుత్వాధికారులకు చెబుతున్నాను.

యోగి : అటువంటివ్యక్తి రాజ్యం చెయ్యడానికి ఎంతవరకు అర్హుడో మీరే నిర్ణయించాలి.

[గట్టిగా అడుగుల చప్పుడు]

కిరణ్ : యోగీంద్రులను ఒక్క ప్రశ్న అడుగుతాను. రాజ్యకార్యాలలో పాల్గొనడానికి మీరెంతవరకు అర్హులో ముందు మీరు తెలియ చెప్పండి—

యోగి : ఇక్కడిందరధికారులు ఉండగా నీచురాలైన ఒక నర్తకికి జవాబీయడం నేను చేయలేనిపని—

మహా : ఎంతటియోగీంద్రులైనా నిండుసభలో ఇతరులను దూషించడం తగనిపని. ఈ సభలో ప్రసంగించడానికి మీ కెంత హక్కుందో అందరికీ అంతే. నర్తకి నిర్భయంగా తన అభిప్రాయం చెప్పవచ్చు.

యోగి : అయోగ్యులైనవారిని రప్పించి రాజసభ నపవిత్రంచెయ్యడం మహారాజులు చేయవలసిన పనికాదు.

మహా ఇందరిలో యోగ్యులెవరో, అయోగ్యులెవరో మీరు నిర్ణయించగలరా! రాచకార్యాలకు వ్యక్తిగతద్వేషాలు కావు కావలసింది — శక్తిసామర్థ్యాలు —

యోగి : నేనూ అదే అంటున్నాను. తన రాజ్యాన్ని తనప్రజల్ని కాపాడుకోలేని రాజు రాజ్యపాలన కర్హుడు కాదని — —

కిర రాజ్యాన్ని ప్రజల్ని కాపాడుకో లేనంత శక్తి శూన్యులు కారు మహారాజు — కాని ఆ పనికి తాత్కాలికమైన అడ్డంకు లెన్నయినా రావచ్చు.

యోగి : రాజు లెన్ని అడ్డంకులు వచ్చినా తను ప్రధాన కర్తవ్యాన్ని విస్మరించరాదు. ప్రాణాలైనా సరే ఒడ్డి....

కిర : అందుకు మహారాజెప్పుడూ సిద్ధమే. అందుకు వారి గత జీవితమే సాక్ష్యం—

యోగి : కాని ప్రస్తుతం మాత్రం అలా జరగడంలేదు.

కిర : అని యోగీంద్రులైన మీరు విన్నవించడం తగదు. తమ ప్రజలపై మహారాజుగారికి ఎంతటి అనురాగం ఉందో నిన్నమొన్నటి విషయాలనేకం తెలియ జెప్పగలవు.

యోగి రాజ్యపాలనకు కావలసింది అనురాగం కాదు అవక్రవిక్రమం — అనురాగం అవసరాన్ని బట్టే—

: యోగీంద్రులు మాట తప్పిపోతున్నారు. అనురాగం సర్వ ప్రపంచాన్నీ జయించగలదనే యోగి పుంగవుల మాటలనే వారు తిరస్కరిస్తున్నారు.

యోగి : అనురాగం కంటే సామర్థ్యమే రాజ్యపాలనకు ముఖ్యమని నా ఉద్దేశ్యం—

కిర : అనురాగమే సామర్థ్యం కంటే అత్యావశ్యకమని నా నమ్మకం.

మహా : ఇంతకూ యోగీంద్రు లేమంటారు ?

యోగి : రాజ్యం చెయ్యగల శక్తిలేని వారు సింహాసనం ఖాళీ చెయ్యమని—

మహా : అనంతరం సింహాసనాని కర్హులెవరో మీరే చెప్పండి.

యోగి : రాజ్యాన్ని శత్రు రాజులనుండి రక్షించిన మీ సోదరుడు విజయవర్మ అని వేరే చెప్ప నక్కరలేదు.

మహా : ఇందుకు రాజ్యాధికారు లేమంటారు—

ఒకరు : మాఅందరి తరపున నేను మీకు విన్నవించేది ఒక్కటే విషయం. మహారాజుగారు బ్రతికుండగా వారి సోదరులు రాజ్యాధికారులు కాలేరు. ప్రేమతో మహారాజావారు అర్థ రాజ్యాన్ని పోషం సైతం అసంగతమే—

యోగి : ఐతే రాజ్యం అసమర్థుల చేతిలో ఉండవలసిందేనా.

ఒకరు : మహారాజ దు అసమర్థులు కారని మేమంతా ఎరుగుదుము. పరిస్థితులు వారి నీ స్థితికి తెచ్చినాయి. ఐనా మీరన్నట్లు సమర్థులైన రాజసోదరులు విజయవర్మ వెనుకటిలా సర్వసైన్యాధిపతిగా ఉండి రాజ్యాన్ని చక్కబెట్టడంలో తప్పు లేదు.

యోగి : అధికారం ఒకరిచేత ఆయుధం మరొకరిచేత ఉండడం వల్ల ప్రయోజనం శూన్యం. అధికారి కూడా ఆయుధాన్ని చేతబట్టగల సమర్థుడు కావాలి.

కిర : ధర్మాన్ని న్యాయాన్ని కలిగించేది ఖడ్గం కాదు సహృదయం.

మహా : ఇంతటితో ఈ ప్రసంగం చాలు. మహామంత్రులేమంటారు ?

మంత్రి : నేనే విషయాన్నీ నిర్ణయించగల స్థితిలో లేను ప్రభూ! మీరు ప్రజల కోసం మద్యాన్ని నర్తకిని విడిచిన రోజున ఎట్టి చిక్కులూ ఉండవు.

మహా : అది నేను చేయలేని పని.

యోగి : ఐతే రాజ్యాన్ని విజయవర్మ కప్పగించడం మీ ధర్మం.

ఒకరు : అది రాజధర్మం కాదు. ఇందరు రాజోద్యోగులను ధిక్కరించి మాట్లాడటం యోగీంద్రులకు తగదు.

మహా సరే, నా నిర్ణయం వినండి. వృద్ధాప్యపు మత్తులో నా రాజ్యాన్ని రక్షించుకునే శక్తిని నేను కోల్పోయాను కాబట్టి ఇక నించీ రాజ్యభారాన్నంతటినీ విజయవర్మపై విడుస్తున్నాను. నేను సామాన్యునిలా నేటి నుండీ నగరంలో నివసించగలను — కిరణ్! ఇక వెళ్దాం పద.

[అడుగుల చప్పుడు — కాస్సేపు కోలాహలం — తిరిగి నిశ్శబ్దం]

జయ : స్వామీ! నాకో శ్లోకం జ్ఞాపకాని కొస్తున్నది—

యోగి : (నవ్వుతూ) ఏమిటది—

జయ : పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతాం ।
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే ॥— మీరు దేశంలో ధర్మాన్ని స్థాపించడానికవతరించిన దైవ స్వరూపులు స్వామీ!

**7**

* * ఘోరున వర్షం కురుస్తున్న ధ్వని— అప్పుడప్పుడూ తాటాకుల చప్పుళ్లు. కొంచెం దూరంగా ఆ నిశానిశ్శబ్దాన్ని చీలుస్తూ ఒక శ్లోకం వినిపిస్తుంది. అప్పుడప్పుడూ గట్టిగా ఉరుముతోంది.

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ — (శ్లోకం సన్నగా అంతమౌతుంది).

యోగి ఎవరది ?—

నేను స్వామీ!

యోగి ఈ సమయంలో ఇక్కడికెందుకు వచ్చావు.

కిర పరిసరాలలో సంచరిస్తుండగా కుంభవృష్టి ఆరంభమైంది. స్వామీ! గత్యంతరం లేక—

యోగి నా ఆశ్రమంలో ఆడవాళ్లకు స్థానం లేదు. అందులోనూ నీలాంటి...

మీరీ మాట అంటారని నే నెరుగుదును స్వామీ! కాని బయట పెద్దగా వర్షం కురుస్తోంది. హోరుమని ఈదురుగాలి వీస్తోంది. ఈ ఒక్కసారిగా ఈ దీనురాలిని కాపాడండి—

యోగి అది అసంభవం—

కిర ఆధారం లేని కష్టంలో అల్లాడుతున్న ఆడదానికి కాస్త ఆశ్రయాన్నివ్వలేరా స్వామీ మీరు......

యోగి సరే. ప్రాధేయపడుతున్నావు కాబట్టి— బయట గాలివానగా ఉన్నది కాబట్టి నీమాట మన్నిస్తున్నాను. కాని రేపు ఉదయం నేను ప్రాయశ్చిత్తం చేసుకోక తప్పదు. నీవిచటికి రావడమే నేరం—

[ఎక్కడో పిడుగుపడిన చప్పుడు]

కిర : స్వామీ!

యోగి : ఏమి?

కిర : భయంగా ఉంది స్వామీ!

యోగి : అంతఃపురాలలో నివసిస్తున్న నీకు తాటాకుల ఆశ్రమపుగుడిసెలో ఉండటం భయంగా ఉండదూ—

: ఔను స్వామీ!... మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను.

యోగి : ఏమిటది?

కిర : రాజసభలో మిమ్మల్ని — భగవత్ స్వరూపులైన మిమ్మల్ని ఎదిరించి మాట్లాడినందుకు క్షమించండి— ఏమైనా విజయం మీదే—

యోగి : కాదు. ఆడదానివి అంత భయం లేకుండా రాజసభలో ప్రసంగించడం తగని పని ఐనా హర్షించతగినదే— విజయం నాది కాదు. నీదే—

కిర : అదెలా స్వామీ! చివరికి మీమాటే నెగ్గింది.

యోగి అది రాజుగారి సహృదయంవల్ల మాత్రమే - కాని నీ మాటకే రాజసభలో అధిక బలం లభించింది.

[గట్టిగా ఉరుముతుంది]

కిర స్వామీ!

యోగి భయపడుతున్నావా—

కిర కాదు స్వామీ! మీరు చిన్నతనంనుంచే సన్యాసం పుచ్చుకున్నారా?

యోగి లేదు.

కిర మరి వివాహితులేనా—

యోగి ఔను. పెండ్లి జరిగిన కొద్దికాలానికే భార్యతో చిన్న కలహం వచ్చింది—

అంతమాత్రాన ఆమెను వదలివేశారా స్వామీ!

యోగి : లేదు. కాని ఆ కోపంలో ఒక సంవత్సరం ఆమెను విడిచి దేశాటనం చేశాను. తిరిగి ఆమెను కలుసుకోవాలనే బలమైన కోర్కెతో వచ్చాను. కాని ఆమె లేదు. నాకోసం వెదుకుతూ వెళ్ళిపోయిందని విన్నాను.

ఆమె అంటే మీకు ప్రేమ లేదా—

యోగి అందుకే ఆమెకోసం కొన్ని సంవత్సరాలు గాలించాను. కాని ఎక్కడా కనిపించ లేదు. నిరాశ చెందాను. ప్రపంచంమీద ఆశలుడిగిపోయినాయి. సన్యాసం పుచ్చుకున్నాను.

కిర మీ ప్రేయసిని మీరు మర్చిపోయూరా స్వామీ!

యోగి ఇది జరిగి పదిహేను సంవత్సరాలైనా నేనామెను విస్మరించలేదు —

కిర (గద్గదికంగా) స్వామీ!

యోగి : ఏమి!

కిర మీ ఈ "జ్యోతి"ని మీరు గుర్తించలేదా—

యోగి ఆ! నా "జ్యోతి"!! పునర్దర్శనమా!

(దగ్గరగా వేడి నిట్టూర్పులు)

కిర స్వామీ!

యోగి

కిర మీకోసం మీరు ఇల్లు వదలి వెళ్ళిం తర్వాత నేను ఎన్ని బాధలనుభవించానో—

యోగి : జ్యోతీ! నన్నెలా గుర్తించగలిగావు!

కిర : మీరు మరచిపోయినా నేను మిమ్మల్ని మరువలేదు స్వామీ! ఎప్పటికైనా మీ దర్శనంకోసం ఉంటుందా అనే ఆశతోనే బ్రతికాను. నా కోర్కె ఫలించింది. మిమ్మల్ని నేను రాజసభలో గుర్తించాను. మొదట అనుమానించినా చివరికి మీరే అని నిశ్చయించుకున్నాను. అందుకే మిమ్మల్ని కలుసుకోడానికి ఈరాత్రి బయలుదేరి వచ్చాను.

యోగి : జ్యోతీ!

కిర : స్వామీ! పడరానిపాట్లుపడి, పురుష సంఘంలో అవమానితనై బ్రతుకుతెరువుకోసం నర్తకినై చివరికి రాజాస్థానం చేరాను.

[దూరంగా కోడికూత వినిపిస్తుంది. వర్షం తగ్గుతుంది.]

యోగి : (కంగారుగా లేచి) నర్తకీ!

కిర : స్వామీ!

యోగి : నీవు నీచురాలివి—కులటవు రాజనర్తకివి — నా జ్యోతివి కావు. ఛీ! నన్ను కూడా అపవిత్రం చేశావు. పో! వెంటనే ఆశ్రమం వదలిపో—

కిర : మీ దాసిని—కనికరించండి స్వామీ!

యోగి : ఛీ! పో—

కిర : ఆ! నేనేమో అనుకున్నాను. మీరు మహాయోగులని భ్రమించాను. క్షణిక సుఖానికి కులటను కౌగిలించుకొని, అనంతరం అపఖ్యాతికి భయపడే నీచులనుకోలేదు. మీలో హృదయంలేదు. నా జీవిత నాశనానికి కారకులు మీరు. నీచులు—ద్రోహులు—మూర్ఖులు...

[స్వరం క్రమంగా దూరమౌతుంది.]

## 8

* * సంఘారామ ఆవరణంలో బౌద్ధ సన్యాసి గంభీర స్వరంలో!

బౌ. స : అహింసా పరమో ధర్మః
సౌహార్దం పరమావధిః

సదా హృదయ నైర్మల్యం
సత్య మిత్యుచ్యతే బుధైః
[నిశ్శబ్దాన్ని చీలుస్తూ ఆనంద్, జయదేవ్ లు]

ఆనం } : గురుదేవులకు నమస్కారం.
జయ }

బా. స : ఓహో! సంవత్సర కాలం గడచిపోయింది కాబోలు —

జయ : ఔను. మీ ఆజ్ఞానుసారం తిరిగి వచ్చాం.

బా. స : మీ రిద్దరూ గమనించిన విషయాలలో నే మీ రడిగిన ప్రశ్నకు సమాధానం ఇమిడి ఉంది. ఏమంటారు! ఏదీ ఆనంద్! నీవేం చెబుతావు —

ఆనం : మహారాజావారు ధర్మాత్ములు — అంతకు మించిన ధర్మగుణంగల చక్రవర్తి మరొక రుండరు. కులట ఐనా నర్తకి కిరణ్మయి ఉత్తమ భావాలుగల స్త్రీ కాని మహాత్మాని అనిపించుకుంటున్న ఆ యోగి పాపి. కిరణ్మయికి ద్రోహం చేసిన మోసగాడు. రాజ్యపాలనం తెలియనివానికి పట్టం కట్టించిన మూర్ఖుడు.

బా. స నీవేమంటావు జయదేవ్!

జయ ఆనంద్ చెప్పింది నాకు సమంజసంగా లేదు. మహాయోగి పుణ్యాత్ములు. సాక్షాత్ భగవత్ స్వరూపులు. ప్రజా హితాకాంక్షులు. మహారాజు దుర్వ్యసన పరాయణుడు. రాజ్యపాలనా సమర్థుడు కాడు. కిరణ్మయి కులట. పాపి. యోగిని సైతం వంచించిన ద్రోహి.

బా. స : మీ రిద్దరూ పొరబడ్డారు. పాప పుణ్యాలను మానవులు చేసే పనులలో కొలవడం సరి కాదు. మానవ నియమోల్లంఘనం పాపం కాదు. మీ ఇదువురి అభిప్రాయాలలో నే ఇంత భేదం ఉన్నప్పుడు అసంఖ్యాక మానవులకు పాపపుణ్యాలపై విభిన్నాభిప్రాయాలుంటాయి. అందుచేత ఇది పాపం, ఇది పుణ్యం అని మనం నిర్ణయించలేము. పాప పుణ్యాలు దివారాత్రుల్లాంటివి. చీకటి వెలుగుల్లాంటివి. పాపం చెయ్యడంకోసం పుణ్యం చెయ్యాలి. పుణ్యంకోసం పాపం చెయ్యవలసి ఉంటుంది. ప్రజాహితమునే పుణ్యంకోసం ద్రోహునికి పట్టం కట్టించడం పాపం కాదూ! త్యాగి ముక్తికై నర్తకిని సంతోషపరచడము నే పాపంకోసం ప్రజల క్షేమాన్ని అరయడం పుణ్యం కాదూ! పాప పుణ్యాలు సహోదరులు! క్షమాగతేలు. వాటిని నిర్వచించడం ఎన్నటికీ సాధ్యం కాదు.

# బొమ్మలాట - యక్షగానము

యస్వీ. జోగారావు

మన దేశంలో బొమ్మలాట అతి ప్రాచీనకాలం నుంచీ ప్రసిద్ధమైన జానపదకళావినోదంగా పరిఢవిల్లుతూ వచ్చింది. అసలు నాటకకళావిర్భూతికి దారితీసింది అదే అనవచ్చు. బొమ్మలాటకు బ్రహ్మలాంటివాడు సూత్రధారి. సూత్రధార శబ్దం తరువాత తరువాత ఔపచారికంగా రూపకప్రస్తావనలకెక్కినా బొమ్మలాటకు కుదిరినంతగా రూపకానికి కుదరదు. సూత్రం పట్టుకుంటేనే గాని బొమ్మల ఆటే లేదు. అంచాతే ఆ మాట పుట్టింది. రూపకంలో స్థాపనతో సరి సూత్రధారుని వాలకం. తెరముఁగైనా బొమ్మలాటలో చిట్టచివరిదాకా అతని అవసరం వుంటుంది. భరతనాట్యశాస్త్రంలో సూత్రధారశబ్దం వున్నదంటే క్రీస్తుపూర్వం రెండు మూడు శతాబ్దాలనాటికే బొమ్మలాట ప్రదర్శనాలు ప్రసిద్ధి వహించాయన్నమాట.

క్రీస్తుశకం పదో శతాబ్దినాటికివి దేశాంతరాలకు గూడా వ్యాపించాయి. జావాలో వీటిని వాయంగ్ వినోదాలంటారు.1 అవి క్రీ. శ. 1000 నాటికే కడు ప్రసిద్ధములై యీనాటికీ మన రామాయణ మహాభారత గాథలనే ప్రదర్శిస్తూ ప్రజామోదం పొందుతున్నాయని తెలుస్తోంది.2 ఈనాడు బొమ్మలాట ప్రపంచమంతటా ప్రసిద్ధిపొందింది. మన ఆంధ్రదేశంలోకూడా యీ బొమ్మలాట చాలాకాలంనుంచీ ఉంటున్నట్లు ఊహించవచ్చు. పాల్కురికి సోమనాథుని కాలంనుంచీ మన సాహిత్యంలో బొమ్మలాటల ప్రసక్తి తరచుగానే కనిపిస్తోంది. ఉదాహరణకు పండితారాధ్యచరిత్ర పర్వత ప్రకరణంలో 'భారతాది కథలఁ జీరమఱుఁగుల | నారంగ బొమ్మల నాడించువారుఁ | గడు నద్భుతంబుగఁ గంబసూత్రంబు | లడరంగ బొమ్మల నాడించువారు' అని వుంది. ఇందులో వరసగా తోలుబొమ్మలాట, కొయ్యబొమ్మలాటా రెండూ సూచింపబడ్డాయి. వాటినే కన్నడంలో వరసగా చక్కలగొంబె, సూత్రదగొంబె అని అంటారు.

మన ఆంధ్రదేశానికీ బొమ్మలాట మహారాష్ట్రిల నుండి దిగినట్లు పెద్దలు చెబుతారు. అసలు యీనాటికి గూడా అటు రాయలసీమా యిటు కోస్తాజిల్లాలలోనూ అక్కడక్కడ మిగిలివున్న బొమ్మలాటవాళ్లను యోగక్షేమం చేస్తే వాళ్లు మరాటీ వాళ్లని తేలుతుంది. మన రాష్ట్రంలో వాళ్ళ పూర్వుల స్థితిగతు లెలావుండేవో చూచాయగా చెప్తాను. శా. శ. 1130 అంటే క్రీ. శ. 1208 లో వేయబడిన దుర్జయాన్వయులైన విప్పరుల కొండప గుండప నాయకుల ముక్కామల భూదాన శాసనంలో3 "సూత్రధారి బోమలయ" అను నతడొక ప్రతిగృహీతగా పేర్కొనబడ్డాడు. అతడు బొమ్మలాట వాడే కావచ్చు. కాకతీయుల నాటి వరంగలు జిల్లా కూడూరు శాసనం4 చివర 'సూత్రధారి కొమ్మోజన బరహా' అంటే సూత్రధారి కొమ్మోజు వ్రాసినది అని వుంది. ఇది తెలుగు వృత్తాలలో నున్న శాసనం. ఒక పానుగల్లు శాసనంలో5 తూర్పువైపున నున్న

---

1. 'వాయంగ్ ఆటలు—జావా ద్వీపవాసుల వినోదములు' అను శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్యాసము. ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచిక.

2. *'The Mahabharata and the Wayang in Java'—By Dr. B. R. Chatterjee—'India and Java' (Greater India Society Bulletin No. 5. Part I, Pp 48-50)*

3. *South Indian Inscriptions Vol. X No. 247.*

*4. తెలంగాణాశాసనాలు, ప్రథమ సంపుటము. కాకతీయులవి నెం. 55.

*5. తెలంగాణా శాసనాలు—చిల్లర శాసనములు నెం. 18.

* (లక్ష్మణ రాయ పరిశోధక మండలి ప్రచురణ, హైదరాబాదు, 1935.)

వ్రాతలో 'సూత్రధారి బ్రహ్మోజు వెరసిన సూత్రధారుల కౌస్యపల్లిని బానుగంట దళవృత్తి పుడిపండ్లు 20 భీమ సముద్రము వెనుక పుడిమఱుయరు' అని వుంది; ఆ సూత్రధారి బొమ్మోజు బ్రహ్మోజులు పేర్లనుబట్టియే బొమ్మలాట వారైనట్లును, మహారాష్ట్రులైనట్లును ఊహించవచ్చు. ఆ బరహా, వెరసిన అన్నవి కన్నడపు ముక్కలు. మహారాష్ట్రమునకు సన్నిహితమైనది కన్నడ దేశం. అదీకాక బొమ్మలాట పేరెద్దిమ్మలుల కనేకభాషలు రావడమన్నది సహజం. అసలు మరాఠీ బొమ్మలాట వాళ్లు మొదలుత కన్నడదేశానికి వచ్చి పిదప ఆంధ్రరాష్ట్రానికి ప్రాకివుంటారు. పై శాసనాలను బట్టి పదమూడో శతాబ్దినాటికే మన రాష్ట్రంలో వాళ్లు రాజప్రాపకమున నింత భూవసతులు సంపాదించుకొంటూ వున్నట్లు, స్వయంగా తెలుగులో పద్యాల్లోగూడా శాసనాలు వ్రాయగల సామర్థ్యం గలవారైనట్లూ తెలుస్తోంది. తర్వాతి వారు గ్రంథ రచనాప్రోత్సాహకులూ, స్వయం గ్రంథకర్తలు కూడా అయినట్లు ఈక్రింది విషయాలవల్ల తెలుస్తోంది. ఆంధ్ర కవితరంగిణి తొమ్మిదో సంపుటంలో ఉదాహరింపబడిన కోడూరి వల్లభ సూరి చరిత్రంలో అతను పాటి గణితం అనే గ్రంథమును కర్ణాట సింహాసనాధీశ్వరులగు కృష్ణదేవ—అచ్యుతదేవరాయల్లైను కొలిచి మన్ననలందిన 'బొమ్మలాట బిరుపొందిపు కాళని ప్రేరణంబునన్' రచించితినని చెప్పుకున్నాడు. ఆ కాళయ కుమార తాతాచార్యుని శిష్యుడయినట్లు, నెఅదాతయైనట్లును వల్లభసూరి చెప్పాడు. పెనుగొండలో కృష్ణరాయల కోశాధికారిగా వుండి శిల్పకళానిక్షేపమగు లేపాక్షి దేవాలయాన్ని నిర్మించాడని చెప్పబడే విరూపన్న యీ కాళయ తండ్రియే యగునాయని అనుమానము. బొమ్మలాటవారి గురించి శ్రీ చాగంటి శేషయ్యగారొక శాసనవిషయము నుటంకించారు—'కడప మండల మందలి కమలాపురము తాలూకా చిడిపిరాల గ్రామమును చంద్రమయ్యయను నతఁడును (ఇతనిని బొమ్మలాట రయితు అని యందురు), బొమ్మలాట యమృత కవి యను నతఁడును తెర నాటకములాడుటకై పెద చిట్టయ్య యను నతని కిచ్చినట్లొక శాసనమున్నది' అని. దీనినిబట్టి వారికి బొమ్మలాటలందే కాదు తెరనాటకములందును గల అభిమానము తేటతెల్లమగుచున్నది. అంతేకాదు ఆ తెరనాటకములాడువారికి వీరొక గ్రామం దానం చేశారంటే ఆనాటి వారి హుందాగిరీ ఎంతటిదో తెలుస్తోంది. అంటే అప్పటికే ఏ రాయలవారి అనుగ్రహం వల్లనో వారి సీమలో వీరికి కొన్ని వృత్తులేర్పడి వుండవచ్చు. వారి వృత్తికి స్మారక చిహ్నాలుగా నీనాడు రాయలసీమలో కొన్ని గ్రామనామాలు వినిపిస్తాయి. వాటినిబట్టియో, అసలు కులవృత్తిని బట్టియో వాళ్లకా బొమ్మలాట అన్నదే యింటిపేరుగా పరిణమించి వుండొచ్చు. పై శాసనంలో పేర్కొన బడ్డ బొమ్మలాట అమృతకవి రచన లేవో మనకు తెలీవు. ఒక బొమ్మలాట కుటుంబమునకు చెందిన ఒక్క తెలుగు యక్షగానరచన మనకు దక్కినది. అది కిరాతార్జునీయము[6] యక్షగానము. కర్త బొమ్మలాట సాంబయ్య లేక సంబయ్య. అతని తండ్రి బొమ్మలాట రామనుడు, మోహన కవి బిరుదాంకుడు నైన సిద్ధయ. బొమ్మలాట రామనుడంటే బొమ్మలాట అనే గ్రామానికి కరణం వంటి వాడు— ఆ మోహనకవి రచనలేవో తెలీదు. సంబయ్య కిరాతార్జునీయము ప్రశస్త రచనగల యక్షగానం. ఇందు లేపాక్షి వీరభద్ర స్తుతి వుంది. లేపాక్షి అనంతపురం జిల్లా హిందూపురం తాలూకాలో ప్రసిద్ధమైన శివక్షేత్రం. ఆంధ్ర శిల్పకళా నిక్షేపం. అక్కడి కిరాతార్జునీయ కుడ్యశిల్పాల కొక ప్రత్యేకత యందురు. సంబయ్య బహుశా ఆ ప్రాంతంవాడైవుంటాడు. అతని కృతి రచన కవే ఉద్బోధకాలై వుంటాయి. ఈ సంబయ్య కన్నడంలో కూడా కరియబంటన విజయము[7] సారంగధర చరిత్రము[8] అనే యక్షగానాలు రచించాడు. అంచాత కర్ణాటక కవి చరిత్రకు నెక్కి

---

6. దీని ప్రతులు : మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము—నెంబర్లు *D.* 1849, 1850, 1851 & *R* 1143; తంజావూరు సరస్వతీ మహలు—*D C. No.* 476; అడయారు దివ్యజ్ఞాన సమాజ గ్రంథభాండాగారము—*Shelf Nos*: 32 *E* 11 & 32 *F* 7. (గమనిక : తంజావూరు, అడయారు ప్రతులలో నిది సంబయ్య సోదరులు రచించినట్లున్నది. కాని సంబయ్యయే రచించి యుండునని నా నమ్మకము).

7. ప్రా. లి. పు. భాం॥ *D. No.* 1169.

8. ప్రా. లి. పు. భాం॥ *D. Nos.* 1212 & 1220.

నాడు. అందితని కాలము శ. 1750 ప్రాంతమని చెప్పబడింది.

మనకు తెలియవచ్చిన బొమ్మలాటవారి తెలుగు రచన మరియొకటి బొమ్మలాట హాస్యనాటకము. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున దాని కొక తాళపత్ర ప్రతి గలదు. (నెంబరు R. 1894) అది యొక బొమ్మలాట ప్రదర్శనకు ప్రస్తావన. వ్యావహారిక ధోరణిలో నొక చక్కని మాండలికపు నుడిగార ముట్టిపడు వచన ప్రచురమైన సంవాదశైలిలో సరసములైన హాస్యప్రసంగములతో సాగిన రచన. అసలు బొమ్మలాటవా రాడదలచుకొన్నది శ్రీకృష్ణవిలాసమట కాని కేళిగాని పెళ్లియిందలి ముఖ్యవిషయము. గ్రంథకర్త యెవ్వరో తెలీదు కాని ఈ గ్రంథమధ్యంలో ఒక పంచాంగప్రసంగసందర్భంలో 'నందన సంవత్సర భాద్రపద శుద్ధ-అష్టమి బుధవారం' పేర్కొనబడింది. అది గ్రంథరచనా కాలమున కొక భంగ్యంతర సూచన అనుకొంటే స్వామికన్నుపిళ్లెగారి ఇండియన్ ఎఫిమెరిస్ ప్రకారము క్రీ. శ. 1-9-1652 తేదీకి సరిపోతోంది. గ్రంథంలో పలుతడవ లది 'దక్షిణ సింహాసనాధీశ్వరుండు విజయసేతు రఘునాథ భూపాలుని నాటకశాలకు సంబంధించినదని వుంది. ఆ సేతుశబ్దమును బట్టి యిది ఆకాలమున రామనాథ శివగంగ మండలాధీశ్వరులగు సేతుపతులకు సంబంధించినదని తోస్తుంది. వారిలో విజయ రఘునాథ నామధేయులా పదునేడవ శతాబ్దినడుమ గలరు[9]. అందొకరి ప్రాపకమున నీ గ్రంథము వెలసియుండవచ్చు.

ఇంతవరకు చెప్పిన విషయాలనుబట్టి యిప్పుడు బొమ్మలాటవారి స్థితిగతు లధ్వాన్నంగా వున్నా వెనక భేషుగ్గా వుండేవని తోస్తుంది. ఇంక బొమ్మలాటకీ యక్షగానాదులకూ వున్న సంబంధం స్థూలంగా పరిశీలిద్దాం. ఏవో నాలుగు బొమ్మల నటూ యిటూ ఆడించేటంత మాత్రాన అది బొమ్మలాట ప్రదర్శనం అనిపించుకోదు. ఒక కథ తీసుకుని అందలి పాత్రలకు అనుగుణంగా బొమ్మలు తయారుచేసుకుని వాటి నాడిస్తూ వెనకనుంచి పద్యాల్లో పదాల్లో దరువుల్లో ఆయా పాత్రల ప్రవేశ ప్రసంగాదులు, నడుమ అప్రదృశ్య కథానుసంధానం చేసే సంధివచనాలూ వినిపించాలి. అందుకు సాహిత్యాన్ని ఆశ్రయించాలి. బొమ్మలాట ప్రదర్శనాల్లో కేవల గద్య రక్తిగట్టదు. అందుకే ఏ దేశంలోనైనా బొమ్మలాట ప్రదర్శనానికి వెనక గేయభాగాధికమైన రచననే ఉపయోగిస్తారు. పాశ్చాత్య దేశాల్లో సాధారణంగా 'ఓపెరా'లను గేయనాటికల నుపయోగిస్తారు. వాటికిగల సంబంధంగూర్చి 'పపెట్ బుక్' (*The Puppet Book* *) అనే గ్రంథంలో యిలా వివరింపబడింది:

*'Musical plays and operas if specially arranged, can be given by puppets. One advantage of opera on the puppet stage is that the conventional gestures of the singers are well within the capacity of the puppet but besides that there is the possible influence any production might have towards increasing interest in the opera.'*

అంటే గేయనాటికలను ప్రత్యేక దృష్టితో రచిస్తే బొమ్మలద్వారా ప్రదర్శించవచ్చు. అలా ప్రదర్శించడంలో కేవల గేయనాటక ప్రదర్శకులు సాంప్రదాయికంగా చూపించవలసిన అభినయాంశాలను ఆ బొమ్మలే ఆదుకోగలవు. అంతేకాక అసలా గేయనాటక ప్రదర్శనయెడల కలిగే ఔత్సుక్యము ప్రభావం యీ బొమ్మలాట గేయరూపక ప్రదర్శనంయెడల కూడా కలుగుతుంది. జావా ద్వీపవాసులు వారి వాయంగ్ వినోదాల్లో ఉపయోగించే లాకన్లు అను రచనా విశేషాలు గూడా యిల్లాంటివే. సంస్కృతంలో గూడా ధర్మపుత్రికా ప్రదర్శనల కుద్దిష్టమై ఛాయా నాటకాలని వున్నాయి. ఇంగ్లీషులో చెప్పవలసివస్తే 'షాడో ప్లేస్' (*Shadow plays*) అన్నమాట. తోలుబొమ్మలను ఆటలో తెరవెనుకా దివ్వెకు ముందూ వుంచుతారు. ప్రేక్షకులకు కనపడేవి వాటి ఛాయలు మాత్రమే. అందుకే ఆ పేరు. కొయ్యబొమ్మ

9. *Vide. South Indian Epigraphy, Annual Report for 1928-29. Part II. Item No. 76, ie, Sivapuri Record from Ramnad Dt., No 46, Dated Saka 1590=1668 A.D.*

* *Edtd. by L.V.Wall, B.A.; published by Faber and Faber Ltd., 24, Russel Square, London, W.C. 1. Part 5. Item No. 27, Pp 187—198.*

లాటలో బొమ్మలకు తెరమరుగు వుంటుంది. కాని నాటికీ కూడా ఛాయానాటక గ్రంథభాగాలు పనికి రాకపోవు. సంస్కృత నాట్యవిషయిక గ్రంథాల్లో ఎక్కడా ఛాయానాటకప్రసక్తి వున్నట్లు కాన రాదు. సంస్కృత మహాభారతంలో (XIICCXCV, 5) రూపోపజీవనం అనే విషయంగురించి నీలకంఠ పండితుడిలా వ్యాఖ్యానించాడు: 'రూపోపజీవనం జాలమండపికేతి దాక్షిణాత్యేషు ప్రసిద్ధమ్। యత్ర సూక్ష్మవస్త్రం వ్యవధాయ చర్మమయైః రాకారైః రాజామాత్యాదీనాం చర్యా ప్రదర్శ్యతే' అని. అంటే రూపోపజీవన మనునది జాలమండపిక అను పేర దక్షిణ దేశమున ప్రసిద్ధమైనది. అందు పలుచని బట్టపై చర్మ పుత్రికలద్వారా రాజామాత్యాదుల చర్యలు ప్రదర్శింప బడును అని అర్థము. ఈ విషయము నాకు డాక్టరు ఎమ్. కృష్ణమాచార్యులుగారి (*History of classical Sanskrit Literature*) గ్రంథంనుండి ఎరుకపడినది. అందులో దేశంలో వివిధ ప్రాంతాలకూ వివిధ కులా లకూ సంబంధించిన కొన్ని ఛాయానాటకాలు పేర్కొనబడ్డాయి. అవి అన్నీ పదమూడో శతాబ్దికిటీ వలివే. అంతకు పూర్వపు రచనలగురించి తెలియ వచ్చుట లేదు. కాని ఆ ఛాయానాటకకర్తలు చాల మంది రాజాస్థానము లలంకరించినవారనుట గమనింప దగినది. ఆయా ఛాయానాటకేతివృత్తములు అన్నీ పౌరాణికాలే గాని వితలకవి కృతిమాత్రము విశిష్ట మైనది. అది చారిత్రికము. క్రీ. శ. 1489—1650 సం॥ల నడుమ బీజపురమును పరిపాలించిన ఆదిల్షా రాజ వంశ చరిత్రకు సంబంధించినది. సంస్కృతచ్ఛాయా నాటకములందు సుభటుని దూతాంగదము ప్రసిద్ధ మైనది. అది క్రీ. శ. 1242 ప్రాంతమున అనిహిల్‌విడ్ ప్రభువు త్రిభువన పాలదేవుని కొలువున ప్రదర్శింపబడి నది. దూతాంగద మచ్చైనది.10 అందు గద్యభాగము కంటె పద్యభాగమే ఎక్కువ. కడమ ఛాయా నాటక ములు నట్లే యుండునని ఊహింపవచ్చు.

బొమ్మలాటలకు పాశ్చాత్య దేశాలలో ఓపె రాలు, జావాది ద్వీపములలో లాకన్లు, మనదేశంలో సంస్కృతమున ఛాయా నాటకాలూ మొదలైన వాటి వలె తెలుగులోనూ కన్నడంలోనూ యక్షగానా లుప యోగపడుతూవచ్చాయి. యక్షగానము పిదప కాల మున ఒక విశిష్టరూపక క్రియగా రూపొందినా మొదట గేయరూపమున కథాఖ్యానమే ప్రధానాశయంగా ప్రారంభింపబడింది. అందులో పద ద్విపదలు, గద్య పద్యాలు, రాగతాళధారా శేషులకు దరువులూ ఒకటే మిటి ఎటువంటి ఛందోబంధమైనా, ఎటువంటి రచనా విశేషమైనా యిమిడిపోతాయి. అంగహార నాటకం లాగ ప్రయోగించడానికి గాని హరికథవలె ఆఖ్యానించ డానికి గాని, పురాణంలాగ పఠించడానికి గాని పనికి వస్తుంది. బొమ్మలాటప్రదర్శన కనక పాటగా మార్చే సౌలభ్యం వుంది యక్షగానంలో. ఈ నాటికీ కన్నడదేశంలో మైసూరు ప్రాంతమున వారి బొమ్మ లాటలు దక్కలవి సూత్రపు గొంబెలకు రెంటికిని యక్ష గానాలకూ అనుబంధం వుందని తెలుస్తుంది.11 అలాగే మన ఆంధ్రదేశంలో ఈనాడు అక్కడక్కడ మిగిలి వున్న బొమ్మలాట వారి ప్రదర్శనలు చూస్తే వాళ్లు ఆయా ప్రాంతపు యక్షగాన కవుల రచనలను వినియో గించుకొంటున్నట్లు తెలుస్తుంది. బొమ్మలాటల గురించి జానపదులలో కొన్ని నమ్మకాలున్నాయి. ఉత్తర గోగ్రహణం ఆడిస్తే వానలు కురుస్తాయట! వానలకీ ఆ కథకీ వున్న సంబంధం ఏమిటో తెలీదు కాని యీనాటికీ కొన్నిచోట్ల ప్రాంతపు పల్లె ప్రజలా నమ్మకంతో వానలు పడనప్పుడు మూలవపట్నం బొమ్మ లాటవారి నాహ్వానిస్తారు. వాళ్లు చెప్పే ఉత్తర గోగ్రహణంలో ధేనువు కొండ వెంకయ్యగారి విరాట పర్వ యక్షగానంలోని దరువులను గుర్తించవచ్చు

క్రీ. శ. 1850 ప్రాంతమున గంజాం జిల్లా గుత్తి వాడ నివాసి మరింగంటి భట్టరు రామానుజాచార్యులు రచించిన శ్రీరామ నాటకము బొమ్మలాట రామాయణ

---

10. *Published by Panduranga Jawaji Nirnaya Sagar Press, Bombay, Kavyamala Series, 28. Forth edition 1922.*

* *Vide* : (*a*) '*Bhagavata plays in Mysore*', *a paper by Sri L. Narasimhachar, Chap X, Item 11, The Eighth All India Oriental Conference, Mysore, 1935.*

*Vide* (*b*) '*Yakshagana and other plays of Mysore*' *an article by Sri S. Srinivasachar March of india Vol. IV, No. 6, July-August 1952.*

ము12గా ప్రసిద్ధిపొందింది. ఇందలి కథ లక్ష్మణమూర్ఛ. మాధవపట్నం బొమ్మలాట వారి లక్ష్మణ మూర్ఛలో యిందలి పద్యాలూ, దరువులూ వినిపిస్తాయి. అసలు కొందరు యక్షగాన కవులు బొమ్మలాటలను దృష్టిలో పెట్టుకొని రచించడం కూడా కద్దు. ఉదాహరణకు 19 వ శతాబ్ది చివర పీశె సుబ్బరాజు, గాజుల పెండ్లూరి శేషగిరి రాజు అను వారు రచించిన సంత వేలూరు కుశలవుల నాటకము 'ఆరు రాత్రిళ్ళ నాటకమునకును బొమ్మలాటకును ఉపయోగముగా రచింపబడె' నట్లు గ్రంథ ముఖపత్రము మీద నే గలదు. (ఒక ప్రచురణ: వెస్టువార్డు అండు కంపెనీ, మదరాసు, 1931). పర్లాకిమిడికడ నున్న పాతపట్నము వాస్తవ్యుడు కోట వెంకటప్పయ్య శాస్త్రి అను నాయన క్రీ. శ. 1893 లో బాణాసురనాటకం రచించి దానికి పీఠిక తానే వ్రాసి అందులో 'ఈ గేయ ప్రబంధము చర్మవిగ్రహములచే నాడించుటకును, వేషముల ధరించి నాటకమాడుటకును అనుకూలముగ నుండునటుల రచింపుమని నా మిత్రులొక కొందఱు ప్రోత్సాహపఱచినందున నే నందుల కియ్యకొంటిని' అని వ్రాసెను. (ఇది మదరాసు ఇండియన్ లా ప్రెస్సులో ముద్రితము — 1894లో) ఇందు లొట్టికిత్తడు, రత్నాలు, పోలిగాడు అనువారి హాస్యప్రసంగ మచ్చు మచ్చు బొమ్మలాటలలోని జుట్టుపోలిగాడు, బంగారక్క, గంధోళిగాళ్ల ప్రసంగంలాగే వుంటుంది. అసలు వాళ్ల సంబంధం, సందర్భం అటువంటివే. బొమ్మలాట వాళ్లు గొల్లకలాపాల్లోవలె తరచు అమర శ్లోకముల నేకరువు పెడతారు. అమరశ్లోకము లుదాహరింపబడిన యక్షగానము లనేకము గలవు. ఉదా॥ జిల్లెళ్ళమూడి వెంకట రామదాసామాత్యుని జాంబవతీ మానము (ఆంధ్రసాహిత్య పరిషత్తాళపత్ర ప్రతి నెం. 3066) మొదలైనవి. అట్టివి కొన్ని బొమ్మలాటలకు నుద్దిష్టములైనవే అని చెప్పవచ్చు. బొమ్మలాటల్లో కేతిగాడొక సాంప్రదాయిక హాస్యపాత్ర. కేతినాయుడి వాలకం చాలా యక్షగానాల్లో కూడా వస్తుంది. కొన్ని అచ్చయిన యక్షగానాల్లో అందలి పాత్రల బొమ్మలు కూడా అచ్చు కాబడి వుంటాయి. అవి చూస్తే చాలావరకు బొమ్మలాట వాలకాలే స్ఫురిస్తాయి. మీద పేర్కొనబడిన బొమ్మలాట హాస్యనాటకంలో కొన్ని ప్రదర్శనసూచనలు వున్నాయి—'బొమ్మలాటకు మొదట తోడియ ముంగ పాడి, ఆవెనక విఘ్నేశ్వరునిమీద పదం పాడుచున్న విఘ్నేశ్వరుని కొలువెత్తి సభావర్ణన చదివి ఆవెనక విఘ్నేశ్వరుని నాట్యం చేయిస్తే అడించేది ఆ నాట్యం వెనక తెరహాస్యం చెప్పి కొలువు పదం పాడి కథకు మొదలు కొలువత్తేది — ఇక్కడ నోటివేషం చేసేది' మొదలైనవి. ఆ ప్రదర్శనకు హంగుదారులు 'పురుషులు వూదేవారున్నూ, మృదంగాలు గొట్టేవారున్నూ, ముఖాలు మీటె వారున్నూ, తాళాలు వేసేవారున్నూ, దండెలు వేసేవారున్నూ' ఇవి. ఈ ప్రదర్శన ప్రక్రియ కొంత మట్టుకు కొనాటి దక్షిణదేశీయ యక్షగాన ప్రదర్శన సంప్రదాయసంవాదిగా వుంది. బొమ్మలాట సంబద్ధ్య యక్షగానాలనే రచించడం చూస్తే అను బొమ్మలాటలకోసమే రచించారా అనిపిస్తుంది. అయినా విషయాలనుబట్టి చూస్తే బొమ్మలాటవాళ్ళకి నోట తెలుగు పట్టినప్పటినుంచీ, తెలుగులో యక్షగానాలు పుట్టినప్పటినుంచీ బొమ్మలాటలకూ యక్షగానాలకూ అనుబంధం యేర్పడి అది తరాలు గడిచినకొద్దీ పెంపొందుతూ వచ్చిందనిపిస్తుంది. ఇటీవల నాటకాలూ సినీమాలూ వచ్చాక యక్షగానాలు మూలబడ్డాయి; బొమ్మలాట ప్రదర్శకుల దశలే గతులు లేవు. కాని ప్రభుత్వం కాస్త పూనుకొంటే వారి ప్రసంగాలు రికార్డుచేసి, వారి ప్రదర్శనలకు డాక్యుమెంటరీ ఫిల్ములు తీసి, సచిత్రములైన తద్చరిత్ర గ్రంథములను తయారుచేసి ఆ విషయమైన మన ప్రాచీన సంస్కృతీ స్వరూపం తరువాతి తరాలవారి తలపోతల నెమరు వేతలకైనా అందించవచ్చు.

12. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున దీని కొక తాళపత్ర ప్రతి గలదు. నెం. R. 966 రాజమండ్రి గౌతమీ గ్రంథాలయమునను నొక ప్రతి గలదు. దాని నెం. 98. అసలిది లక్ష్మణ మూర్ఛ యను పేరితో 1908 లో ఎద్దనపూడి సంజీవయ్య అండ్ సన్ వారిచే మదరాసు మురహరి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి ప్రకటింపబడినది. తద్గ్రంథసంపాదకులగు యర్లంకి శ్రీ వెంకటేశ్వర్లు నాయుడుగారు 'ఇది చర్మపు విగ్రహములతో నాట్యము చేయుచుండగా.. డ్రామాకు అనుకూలంబగునట్లు...పరిష్కరించినట్లు పోద్ఘాతమున గలదు.

# గ్రహణ సమయం

శ్రీ మంథా వెంకటరమణారావు

* * ఒకానొక సముద్రతీరం; ఉదయం 7 గంటలు; తీరాన తండోపతండాలుగా రకరకాల ప్రజ; నల్లటి అద్దాలు పెట్టుకొని కొందరు ఆకాశాని కేసి చూస్తున్నారు; ప్రజ చేసే గోలలో సముద్రపు హోరు వినిపించడం లేదు; ఆ గోల మధ్య:

: (విరాగిలా చిరునవ్వునవ్వి) గొప్పవారికి కూడా ఎటువంటి పాట్లు!

: మహానుభావులకి కూడా ఎటువంటి ఆపదలు!

: భగవంతుడికి కూడా గ్రహబాధ తప్పదు కదా!

: మనమనగా ఎంత...(పెదవులు విరుస్తాడు).

: నలచక్రవర్తికి మరి చూశారు కదూ ఎటువంటి పాట్లొచ్చేయో?

: హరిశ్చంద్రుడికీ అలాగే.

: అంతవరకూ ఎందుకు — నిన్న మొన్నటి ధర్మరాజు?

: ధర్మరాజువరకూ ఎందుకండీ — ఇప్పుడు మన కళ్లారా చూడబోతున్నాం గదండీ. ఆ భగవానుడు......ఆ సూర్యభగవానుడు సమస్త చరాచర ప్రాణికోటికీ జీవాన్నిచ్చే ఆ తేజోమూర్తి...ఆ కేతువు గాడికి కట్టుబడిపోయి రెండు గంటలు......!

: హర...హర...నేను చూడలేనండి!

: మహాదేవ! ఆ మహానుభావుడు పడే బాధ నేను భరించలేనండి!

: నేనూ చూడలేను......ఇక్కడ ఉండలేను కూడా...ఆ కేతువు నన్ను బాధపెట్టినా బావుండును.

[4 గారు ప్రవేశం]

పడుతుంది స్వామీ పడుతుంది — ఆ భగవాన్నిణ్ణి రెండు మూడేళ్ళకి ఒకసారి గంటో అరగంటో పీడిస్తుంది...పీడ వదిలిపోతుంది — మన నొక్కొక్క గ్రహం పట్టుకుందంటే కొన్ని ఏళ్ళు పిప్పిచేస్తుంది. కోరుకోక కోరుకోక అదే కోరుకోవాలా స్వామీ!?

: ఓహో! జ్యోతిష పండితులవారు ఇలా దయచేశారు!

: ఇదిగో మరి. ఇంత అట్టహాసం జరుగుతోందా...ఇటువంటిది, మన జన్మలో మరి చూడం అంటున్నారుకదూ పెద్దలు?

: వెయ్యి జన్మలకి కూడా ఇటువంటిది ఒద్దు బాబూ.

: వెయ్యి జన్మలమాట దేము డెరుగును కాని ఈజన్మలో జరుగుతోందంటారా? స్వాములు ముగ్గురూ ఒకేసారి బయలుదేరేరు...... జోనాను మరి...ఇటువంటి పుణ్యకాలం ఎప్పుడు...

2 : హర...హర!

1 : మహాదేవ!

3 : హరహర మహాదేవ...

2 : ఇది పుణ్యకాలమా!

1 : ఘోరం!

3 : మహాఘోరం.

2 పాపం —

1 : మహాపాపం అలా అనుకోవడం.

3 : మహాపాపం శమించుగాక!

4 : స్వాములు అలా సెలవియ్యడం నన్ను ఆశ్చర్యసముద్రంలో ముంచింది.

2 : ఎందుకు ముంచిందో మాకు అర్థం కావటం లేదు—

1 : మాకు అవగాహన కావటంలేదు...

4 : ఇది పుణ్యకాలం అని వేలాదివేలుగా ప్రజలు దేశదేశాలనుండీ విచ్చేశారు......స్వాములు అది ఖండిస్తున్నారు.

3 : మనకి ప్రాణం ఇచ్చి, మనని కాపాడే ఆ సర్వేశ్వరుడు, సర్వసాక్షి అయిన తండ్రి వంటి ఆ సూర్యభగవానుడు, కిరాతుడయిన ఆ కేతువు చేతిలోపడి కిటకిటలాడి పోతాడే నాలుగు గంటలకాలం! తమరెలా అది పుణ్యకాలం అనగలరండి .. హర...హర.... నేను చూడలేనండి...

1 : మహాదేవ! ఆ మహానుభావుడు పడే బాధ నేను భరించలేనండి...

2 : నేనూ చూడలేను......ఇక్కడుండి లేను కూడా...ఆ కేతువు నన్ను బాధపెట్టినా బాగుండును...

4 : ఆ విధంగా అయితే స్వాములు...ఈ పాపాత్ములతో నిండిన ఈ సముద్ర తీరానికి వేరే కారణమిమ్మది విచ్చేసి ఉండాలి...

3 : ఎవరు పాపాత్ములు! హరహర!

1 : పాపం శమించుగాక! ఎలా అనగలిగారండీ వీరంతా పాపాత్ములని?

2 : మీ నోరెలా వచ్చిందండీ ఈ మహా పుణ్యాత్ముల నందర్ని అలా అనేందుకు...

4 : స్వాములవారి ధోరణి అగమ్య గోచరంగా ఉంది—స్వాములే సెలవిచ్చేరు...

3 : అతను పడే బాధ చూసి సహించలేక ఆ కృతార్థ గ్రహ విమోచనార్థం ప్రార్థించేందుకే కదండి వచ్చింది...వీరంతా పాపాత్ములెలా అయ్యేరు...

1 : ఆ కిరాతుడి కాళ్లన్నా పట్టుకుని విడిపించుకుందామని వచ్చేరు...వారెలా అయ్యేరండీ పాపాత్ములు...

2 : జ్యోతిషులవారూ...తమరు మహా పాపానికి ఒడికట్టుకుంటున్నారండి.

4 : (ఆశ్చర్యపోయి) ఏమిటి సెలవిచ్చారు... ఏమిటి సెలవిచ్చారు... నేనా మహాపాపిని...

3 ఒడికట్టుకుంటున్నారు...

1 ఆ భగవంతుడ్ని క్షమించమని ప్రార్థించండి.

2 క్షమించరాని పాపం ఇది...అయినా అతను కరుణామయుడు...

4 (నోటసరిగా మాటరాక) అరి భగవానుడా!

3 అదీ—అలా ప్రార్థించండి.

1 క్షమించమనండి అలాగున.

2 అతను కరుణామయుడే...

4 ఎంత అన్యాయం...

అది మానవ నైజం... ..అయినా క్షమించమనండి...

4 ఎంత అన్యాయమైన మాటలు...

2 ఔను—అన్నారు ... అయినా ప్రార్థించండి...

4 మీ ముగ్గురికీ ఒకే ఒక నమస్కారం!

3 అదీ ఆ సర్వేశ్వరుడికే...

4 కాలం, కర్మం అన్నీ కలిసొచ్చేయిలెండి...

2 అయినా ధైర్యం వదలకండి...

4 : అందుకే ఇటువంటి విపరీతాలన్ని... ఈ గ్రహణాలు.. నేనంతా లెక్కవేసి ఉంచేనులెండి...(ఆవేశంతో) ఈ సంవత్సరం ఆఖరయే లోపున సఫా!

: మీరా? మీ పశ్చాత్తాపం నన్ను సంతోష సముద్రంలో ముంచింది.

ముంచుతుందిలెండి.... ఈ సంవత్సరం ఆఖరుకి...ఈ సముద్రం అంతా పొంగి తమ వంటి మహానుభావులందరికీ మోక్షానికి మెట్లు కడుతుంది లెండి....

: అంతా ఆ సర్వేశ్వరుడి కటాక్షం...

: (ఆవేశంలో గట్టిగా) వేసే ఉంచేను ... వేసే ఉంచేను ఈ లెఖ్ఖలు.... ఈ సంవత్సరం ఆఖరుకి ప్రపంచమంతా ధ్వంసం...బుగ్గి... ఊఫ్!! నిప్పు...అగ్నిజ్వాలల్లో మండిపోతుంది...అప్పుడు...మీపని...(పోతాడు)

1 : పాపం...పిచ్చివాడు...

2 : భగవంతుడిలో నమ్మకంలేని మనిషి...

3 : ఆత్మవిశ్వాసం, మనోబలం లేక చీకట్లో కొట్టుకుపోయే పురుషు...

[జనంలో గోల ఎక్కువౌతుంది]

1 : (ఆత్రంగా)ఆపాపకాలం సమీపించిందా..?

2 : ఆ కిరాతుడిప్పుడే నా తండ్రిమీద చెయ్యి చేసుకుంటున్నాడా!!

3 నలుడు బాహుకుడయిపోతున్నాడా? హరహర నేను చూడలేను....

1 మహాదేవ! నేను భరించలేను.

2 హరహర మహాదేవ! నేను చూసి భరిస్తూ ఇక్కడ ఉండలేను కూడా...అయినా... అయినా...ఇన్ని వేలమంది పుణ్యాత్ములు ...అతనికి ఈ ఆపత్కాలంలో అండగా ఉండేందుకు వచ్చారు...

1 లక్షలమంది...

3 : కోటికి తక్కువ ఉండదు ఈ మహా పుణ్యాత్ముల గుంపు...

: దయచూపమని ఈ కిరాతుణ్ణి ప్రార్థించేందుకు వచ్చేరు...

: ఆపద్బాంధవుణ్ణి ఆపసనించి తమ మనోబలంతో కాపాడేందుకు వచ్చేరు...

3 : ధైర్యం ఇవ్వడానికి వచ్చేరు...

2 : అటువంటి సమయాన, మనం—సర్వం అతడేనని, అతడి నామం ప్రతి నిమిషం జపిస్తూన్న మనం...అతడికి అండగా ఉండకుండా పోగలమా...

: (ఒక అరనిమిషం ఆలోచించి) పోయి ఆ మహాపాపానికి ఒడికట్టుకోగలమా!

: (ఒక నిమిషం ఆలోచించి) మహాపరాధం! అది నరకానికి దారి!

: మనకి బాధగానే ఉండుగాక...అయినా సహించాలి...ఆయనే సహిస్తున్నప్పుడు మనం పారిపోవడమా! ఆయన బాధ చూడలేక—

1 : ఛీ!

3 : ఎంత అపచారం!

2 : చూసి...సహిస్తూ... మనసులో ప్రార్థించాలి...

: మొదలయ్యాయా ఆయన ఇక్కట్లు? అయింది సమయం...

తియ్యండి నల్లద్దం...

[మొలలనుండి నల్లటి అద్దాలు తీస్తారు ముగ్గురూ.]

1 : చూడండి మీరు.. నేను మొదట చూడలేను..

3 : నేను చూసి సహించలేను—

2 : నేను చూసి సహిస్తూ ఇక్కడ ఉండలేను...

1 : ధైర్యం...ధైర్యం......ముగ్గురం ఒకేసారి చూద్దాం ధైర్యంగా...

2 : బాగుంది...

3 : అది చాల బాగుంది...

1 : ఒకేసారి ... .. (కొన్ని సెకండ్లాగుమని ఒక్కసారిగా) చూడండి!!

[ముగ్గురూ యంత్రాలంత వేగంగా అద్దాలెత్తి సూర్యుడుకేసి చూస్తారు]

2 : మొదలయినట్టుంది...

3 : మొదలయిపోయింది...

1 : చిన్న భాగం తెగిపోయినట్టుందప్పుడే...

3 : హరహరా...

1 : మహాదేవ...

: హరహర! మహాదేవా!...ఏవో మచ్చల్లా కనిపిస్తున్నాయి భగవానుడిలో...

: చంద్రుడిలోని మచ్చలా లేదు .. ....రెండు మూడు చోట్ల ఉంది...

: రూపాయలంత ఉన్నాయి మచ్చలు... గొప్ప బాధగా ఉండి ఉంటుంది...

పెద్ద ముక్క కొరికేసేనప్పుడే...

[ఇంతలో సముద్రతీరాన ఉన్న "లౌడ్ స్పీకర్ లు" గొంతు సవరించుకున్నాయి కీచుశబ్దంతో...కొన్ని సెకండ్ల అనంతరం అందునుండి శ్రీకంఠం]

శ్రీకంఠం : ఇది రేడియో సిలోన్—ఇదివరకెన్నడూ లభించని, ఇకముందు లభించబోని ఈ మహత్తరమైన అవకాశాన్ని పురస్కరించుకొని, రేడియో సిలోన్ ఇప్పుడు జరుగనున్న సూర్యగ్రహణమ్మీద ప్రత్యక్షవ్యాఖ్యానం, కొలంబో అబ్జర్వేటరీనించి ప్రఖ్యాత

వైజ్ఞానిక శాస్త్రవేత్త డాక్టర్ ఐదుగారు చేయగా ప్రసారిస్తుంది...ఒక హెచ్చరిక - ఈ గ్రహణాన్ని బాగా నల్లటి అద్దాల గుండా చూడాలి......లేనప్పుడు నయం కాని, జన్మాంత అంధత్వం కలగవచ్చు.. డాక్టర్ ఐదుగారు...

డాక్టర్ 5: (బొంగురు గొంతుతో) గ్రహణం ఇంకా మొదలు కాలేదు...కొద్ది నిముషాలలో ప్రారంభం కానున్నది. అంతవరకు కొద్దిగా ఓపికపట్టమని నా ప్రార్థన...

స్త్రీ గొంతు: అంతవరకూ ఫిలిమ్ సంగీతం వినవచ్చు—

["మేక్లీన్స్ టూత్ పేస్టు" అడ్వర్టయిజ్ మెంటు వినిపిస్తుంది...దానిని అనుసరిస్తూ.. "చూడగ చేచెలి నా...కనుల చూడగదే".. పాట...]

2 : ఏమిటి?! ఆ పరమాత్ముడికి బాధలింకా మొదలు కాకపోవటమా...ఎవడా అన్నది? స్పష్టంగా ఉం... సగానికి సగం ముక్క తెగిపోడం నా కళ్ళారా చూసేను... ఇంకా మొదలు కాకపోడమా? మాంచి పట్టులో ఉంటేను...

3 : మొదలయితే లేవనడం అన్యాయమే...

2 : వాళ్ళకి సానుభూతిలేదు...

1 : ఆ అన్నవాడెవడో పాపాత్ముడు...

3 : వాడికి మరి మోక్షమే లేదు...నరకమే గతి .. హరహరా...

['6' ప్రక్కనించి తొందరగా పోతూ ఉంటాడు.]

2 : ఇదిగో పుణ్యాత్మా...ఒక మాట...

5 : (వస్తూ) ఎన్నా సామీ?

3 : ఆపద్బాంధవుడి బాధలు మొదలయ్యేయని మేం అనుకున్నాం, చూసేం కూడా... ఎవడో పాపి లేదంటున్నాడు...మీ రేమంటారు....

1 : సగం ముక్క తెగిపోతేనే...

6 : ఓహో! మీరు మన సైడ్ వాళ్ళేనా....

3 : బాధలు మొదలయ్యేయనేనా తమ విశ్వాసం పుణ్యాత్మా?

6 : ఎవరి బాధలు స్వామీ?

2 : ఆపద్బాంధవుడివి...

6 : ఈ బాధనుంచి విముక్తి మరో నాలుగు గంటలకి కాని కాదు స్వామీజీ!

1 : మొదలయ్యేయని ఒప్పుకున్నారుకదా...

6 : ఇప్పుడా...యేనాడయినా ఎవ్వరికీ మనసు మనసులో లేదు స్వామీ......ఈ నాలుగు గంటలు ఎలా గడుస్తాయా అని కాచుక కూర్చున్నాను...ప్రాణాలు బిగబట్టి...

2 : ఔను...అంబరం అంతే మరి ...ఆ బాధ...

6 : నాలుగు గంటలంటే మజా ఆ బాబూ! నాదీ ఆంధ్రాయే లెండి...కాని అయ్యరని పేరు మార్చేను..... అలా చెప్పుకుంటేనే కాని గడవదు స్వామీ......తమరు స్వాములు కాబట్టి మనవి చేసుకుంటున్నాను...

1 : అలానా?

6 : చిత్తం —తమరు చూసేఉంటారు......ఆ రోడ్డు ప్రక్కని పెద్ద పందిరా బోర్డూ గట్రా..

2 : ఏ పందిరా?

6 : పెద్ద పందిర...మలబార్ హోటలన్న బోర్డు అదీను... నే నేనండి దాని ప్రొప్రయిటర్ని....

3 : మీరూ ఈ బాధ పంచుకో నెందుకేనా వచ్చేరు?

6 కాదా స్వామీ మరి? సాయంపడేందుకూ కూడా వచ్చేనండీ......దఫాకి రెండు వేలమందికి ఏర్పాటు చేయించేను......వేడి వేడి ఇడ్లీ సాంబార్...వెన్నలా నోట్లో కరిగిపోతుందండి....అప్పుడే ఫిల్టర్ తీసిన కాఫీ... దఫాకి రెండు వేలమందికండి...

: ఇప్పుడా!! తిండా!!!

: కాదు స్వామీ......ఇప్పుడు కాదు... అందుకే కదా బాబూ ఎవరికీ మనసు మనసులో లేదన్నాను......గొప్ప బాధపడిపోతున్నారు బాబూ అందరూను........ఉదయంనించీ చాలామంది కాఫీ చుక్కన్నా తాగలేదు...ఇంక ఈ నాలుగు గంటలూ అయిపోతే చాలు...చూస్తారు కదా, ఇలా కాకుల్లాగ ఒచ్చి వాలిపోతారు నా దుకాణమ్మీద...

1 : అంటే?

6 : అనకూడదుగాని ... అందరికీ, దృష్టయితే గ్రహణమ్మీద ఉందికానీ .... మనస్సెక్కడుంది ... మలబార్ హోటల్ మీద ... అందుకే అందరూ వచ్చేదారిలో కట్టించేను.

2 : ఏమి శేమిటే!

1 : అపచారం! అపచారం!

: వచ్చిన పుణ్యాత్ము లందరికీ తీరని అపచారం...

: నువ్వు పుణ్యాత్ముడ వనుకున్నాం....

: ఎందుకొక్కాను స్వామీ... నేను రాకపోతే ఇన్ని వేలమంది ప్రజ తార్ మని చస్తురు, తాగేందుకు కాఫీచుక్క లేక...

3 : ఓరి పాపాత్ముడా!

2 : ఓరి అసత్యవాదీ!

1 : పో! నీదారిని–(నల్ల అద్దంగుండా సూర్యుణ్ణి చూస్తూ) ఆశ్చర్యం! ఆశ్చర్యం!

2-3 : ఏమిటది...

1 : ఇందాక మనం చూసినప్పుడు ఇంత ముక్కపోయిఉండేది ... ఇప్పుడు చూడండి ... పూర్తిగా ఉంది బింబం...

2-3 : (చూసి) వింత! చాలా వింత!

1 : ఎలా అయింది!

2 : పట్టి వదిలేసివుంటాడు కేతువు...అయినా, ఇన్ని లక్షలమంది ప్రజ కిందినించి గోల చేసి, ప్రార్థిస్తూఉంటే ఎంత రాక్షసుడయినా, వాడికే దయకలుగుతుంది మరి...

: అంతే అయిఉండాలి...

: నిజంగా భగవంతుడు ఈసారి...

: (అసంతృప్తిగా) అంత వేగం వదిలేస్తాడనుకోలేదు...

: (నిరాశగా) బాగా బాధపెడతా డనుకున్నాను...కాని...

: తమరు నన్నేమన్నా నాకు కోపం లేదు... కాని, స్వాములు ఈ పాపాత్ముణ్ణి పావనం చెయ్యాలి...

: పావనమా?

6 : చిత్తం...

2 : ఎలాగ...

6 : ఈ గ్రహణం అయిపోయేక...

2 : అయిపోయింది...

6 : ఇంకా మొదలే కాంలే...అయిపోడమా...

1 : మేమంతా చూసేమయ్యా...చిన్న పట్టు పట్టి వదిలేసేడు కేతువు...ధైర్యం చాలక....

6 : ఇంకా మొదలు కాలేదు స్వామీ... మొదలయి నాలుగు గంటల కాలం ఉంటుంది... తమరు చిన్న మేఘం అడ్డు పడితే చూసి ఉంటారు...

: నువ్వు కిరాతుడివి...

: ఒకసారి అయింది...మళ్ళా అతని బాధ కోరుతావా...

: (ఆలోచించి) అలా నేకానీండి స్వామీ... ఈ పాపాత్ముణ్ణి తరింపజెయ్యాలి...

2 : ఎలాగ...

1 : చెప్పు...

3 : ఆలోచిస్తాం...

6 : అంతా అయ్యేక నా గృహానికి...

3 : ఎక్కడ నీ గృహం?

6 : హోటలే నా గృహం స్వామీ...దయచేసి ...చెరొక ప్లేటు ఇడ్లీ, సాంబారు...చెరొక కప్పు కాఫీ స్వీకరించి నన్ను పాపవిముక్తుణ్ణిగా చెయ్యమని నా ప్రార్థన.

3 : ఏమిటీ!

1 : ఏమిటేమిటీ!!

6 : నన్ను తరింపచెయ్యమని...ఒక్క దమ్మిడీ కూడా స్వాములు ఇవ్వనవసరం లేదు... ...తమరి పాదధూళివల్ల నా గృహం పావనం అవడమే నా కోరిక......

: భగవాన్! భగవాన్!

: ఈ మాటలు వింటున్నవి మా చెవులే!!

: తీరని అవమానం! మాకు తీరనిఅవమానం...

[7 తొందరగా కెమెరాతో పోతూ ఉంటాడు.]

: మిష్టర్! మిష్టర్!

7 : తీరుబాటు లేదు...తొందరగా వెళ్ళాలి...

6 : ఒక్క నిముషం...వన్ మినిట్...

7 సారీ! అవతల, నిన్న తటస్థైన గ్రహణభిక్షువుల సంఘపు అధ్యక్షుడితో అపాయింట్మెంట్ ఉంది ఇప్పుడు...

6 : వాళ్ళ సంఘం గ్రూప్ ఫోటో ఏనా పేపర్ కి?

7 : ఇటువంటి సెన్సేషనల్ వార్తలు మిస్ అయితే ఇక్కడికొచ్చి ఏం లాభం...

6 : వారంతా ఇటువేపే వస్తారు ... తొందర లేదు...

7 : మీ దేం పోయింది ... గ్రహణం మొదలవగానే వాళ్ళంతా జట్టుకింద విడిపోతారు... ఎవరి పొజిషన్ కి వారు పోదూ? ఆ నాలుగ్గంటలూ ఊపిరాడదు కదా వాళ్ళకి ... అప్పుడు గ్రూప్ తియ్యడం కుదరదు కదా... గ్రహణం అయి, వాళ్ళ పంపకం అయిపోగానే సంఘం రద్దయిపోతుందట....అప్పుడు నాకూ తీరుబాటుండదు...అవతల సైంటిస్టులంతా ఉన్నారు...వాళ్ళని ఇంటర్వ్యూ చెయ్యాలి...

[8, 9 ప్రవేశం]

8 : ఏమిటి సంగతి...

9 ఏమున్నా సెన్సేషనల్ న్యూసా?

7 తొందరగా ముష్టివాళ్ళ...సారీ ..భిక్షువుల సంఘం, అధ్యక్షుడి దగ్గరికి వెడుతూ ఉంటే ఈయన నాపేరు...

6 : నేను మీకు పూచీ ఉంటాను సరా? వాళ్ళంతా నా హోటల్ లో ఫలహారం చేస్తున్నారు ... ఇప్పుడింకా కాఫీలో ఉండి ఉంటారు...నేను ఆ హోటలు ప్రొప్రయిటర్ని...పైగా వాళ్ళు వచ్చేదారే ఇది...

9 : ఓహో! అలానా!

7 : అయితే ఏదో తొందరగా చెప్పండి మరి...

6 : మీకు మంచి ఫూలైన వార్త—నాకూ మంచి సాయంగానూ ఉంటుంది...

8 : వార్త!...ఏమిటి?

7-9 : (పుస్తకంతీసి) చెప్పండి...

6 : ఈ ముగ్గురు స్వాములూ మహానుభావులు ..

[అందరూ స్వాములని చూస్తారు].

భగవత్సంభూతులు...వీరి ముగ్గురి ఫోటోలు తియ్యాలి...

8 : ఎందుకూ?

9 : ఎందరో స్వాములొచ్చేరు ... దిగంబరులొచ్చేరు ... అందరి ఫోటోలూ తీస్తూ కూర్చుంటే ఇంక అయినట్టే...సారీ...

6 : అందరిలోకి వీరు శ్రేష్ఠులు... నేను ఘంటాపథంగా చెప్పగలను...

7 : అయితే...వార్తలు?

6 : ఈ స్వాములు నాయందు కరుణించి నా హోటల్ పావనం చేస్తామని మాట ఇచ్చేరు...గ్రహణం అయ్యాక అక్కడికొచ్చి ఇడ్లీ, సాంబార్ ...కాఫీ పుచ్చుకుంటామని మాట ఇచ్చేరు...అన్ని కోరికలకీ అతీతులయిన ఈ మహానుభావులనే లొంగదీసిన నా ఇడ్లీ, సాంబార్ ని ఏమనాలి..."సర్వసంగ పరిత్యాగులైన మహర్షులను సైతం లొంగదీస్తిన ఇడ్లీ, కాఫీ!" అన్న హెడ్డింగ్ పెడ్తే ఈ వార్త ఎలా ఉందంటారు...

[స్వాములు కోపంగా మాట్లాడుతారు ఏదో...కాని ప్రెస్ వారి గోలమధ్య అది పైకి రాలేదు.]

7 : ఏం మజా వార్త...వహ్వా!

8 : అమోఘం! అపూర్వం...అయిన వార్త ...

9 : ఇవాళన్నీ విపరీతాలే మరి...ఎప్పుడూ లేని గ్రహణం...ముష్టివాళ్ళ సంఘం ... స్వాములపై ఇడ్లీ విజయం...ఓహోహో!

: తియ్యండి...రెడీ...

[ఒక స్వామి చెయ్యి తన రెండు చేతులలోకి తీసుకుని చిరునవ్వు విసుర్తాడు.]

8 : (కెమేరా నొక్కి) థాంక్ యూ...

9 : (కెమేరా నొక్కి) థాంక్ యూ...

2 : అన్యాయం! అన్యాయం!!

1 : పాపాత్ముడా...పాపాత్ముడా....

[లౌడ్ స్పీకర్ లోనుండి డాక్టర్ 5: గ్రహణం మొదలయింది]

7 : పదండి...మలబార్ హోటల్ వేపు...... వేగం ... గ్రహణభిక్షువుల సంఘం విడిపోతుంది...

6 : అరుగో...వారే అంతా ఇటు వస్తున్నారు.

2 : ఇప్పుడా మొదలయింది!

1 : అంతా అన్యాయం...ఎక్కడ చూసినా...

3 : అటు వేపు పోదాం పదండి...ఇక్కడంతా పాపం...పాపం...

[1, 2, 3 పోతారు......గ్రహణ భిక్షువుల సంఘం వస్తుంది. రెండు వందలమందిలా ఉంటారు. ఒక వరసని అందరూ నడుస్తూ ఉంటారు...కొందరు సభ్యుల చేతులలో బోర్డులున్నాయి...."పదికి తక్కువ పుచ్చుకోం" అని]

7 : అధ్యక్షులు క్షమించాలి...ఒక్క ఐదునిముషాలు...

10 : మాకు తీరుబాటు లేదు...గ్రహణం మొదలయిపోయింది.

6 : ఏమండోయి పదిగారూ..మరిచిపోకండేం ?

10 : మరో ఐదునిముషాలకి కనపడవయ్యా నీ డబ్బు నీకు చెల్లించేస్తాం...

6 : తొందరలేదులెండి...మీ కార్యకలాపాలు ముగించుకున్నాక అంతా మరొకసారి రారా ఏమిటి? మీ రెండువందలమందికి సీట్లు రిజర్వుచేసి ఉంచుతాలెండి ... అప్పుడే మొత్తం డబ్బు చెల్లించేద్దురుగాని...

10 : తెలీక నీ హోటలుకి వచ్చేమయ్యా...నీవి చాలా ఎక్కువరేట్లు—మా అందరికీ వంద రూపాయలయింది బిల్లు—

6 : అబ్బెబ్బే! అదేం ఎక్కువ... అందరూ పుచ్చుకుంటున్నదే. .ఇంతకీ సరుకు నాణ్యం చూసేరా? అదీకాక మీమీద ఇంత నమ్మకం ఉంచి అరువు మీకిచ్చినవాడెవడున్నాడు.

10 : అదా సంగతి...అందుకనా అయింది అంత ఎక్కువ బిల్లు?! అదే అన్నాడాయన...

6 : ఎవడు? ఎవడా అన్నది...అబద్ధం..'అంటీ ప్రోపగండా'-

10 ఆ కమ్యూనిస్టు హోటల్ ప్రొప్రయిటరు ...

7 కమ్యూనిస్టు హోటలా...

8 ఎక్కడ?

నే వెళ్ళి అతన్ని ఇంటర్వ్యూ చేసిరావాలి. ఎక్కడుంది...

10 ఆ మర్రిచెట్టుకింద ఉన్నాదయ్యా...

6 అక్కడ, పందిరా గట్రా ఏం లేదే?

10 లేకపోతే నేం...అన్నీ చెడ్డ చవక...కాఫీ అర్ధణా....ఇడ్లీ కాణీ...

నేన్నమ్మను... దివాలా ఎత్తీడానికని పెట్టేడా...?

10 మా కదంతా ఎందుకు గొడవ...గ్రహణం అయిపోగానే మమ్మల్నందరి, ఒచ్చి మన్నాడు...

7 ఇందులో ఏదో గమ్మత్తుండి ఉండాలి...

8 ఇదొక ఉసారయిన వార్త.

9 ఇంకేమన్నా దాని విశేషాలున్నాయా ?

10 : మా సంఘపు సభ్యులంతా అందులో సభ్యులుగా చేరిపోయేందుకు అతను మాట తీసుకున్నాడు...

9 : నే నక్కడికి వెళ్ళి వస్తాను...

[9 వెళ్తాడు]

8 : దయుంచి నాలుగయిదు ప్రశ్నలకి జవాబివ్వాలి...

6 : మీదగ్గర దమ్మిడీ అన్నా లేనపుడు ఇప్పుడు, మీకు కాఫీ, ఇండ్లీ అరువిచ్చి, అంతసాయం చేసే నే...కొంచమన్నా మీకు విశ్వాసం లేకుండా ఆ కమ్యూనిస్టు వాడి హోటల్ కి వెడతామంటున్నారే...

10 వెడితే వెడతామయ్యా ... ఏఁవిఁటి నువ్వనేది...నువ్విస్తావా కాణీకి ఇడ్లీ...ఔను మరి...మరో ఐదు నిమిషాల్లో కనబడు నీ పైసా పారేస్తాం...

8 మీ సంఘం ఎప్పుడు స్థాపించారు...?

10 : నిన్న సాయింత్రం.

7 ఇంత అమోఘమైన ఆలోచన ఎవరికి తట్టింది?

[104 ముందు కొస్తాడు]

104 : నాకు...

8 మీకా—అయితే మీరే సంఘాధ్యక్షులు కాలేదేం ?

104 : ఆలోచన నాకొచ్చినా అతను పనులు చేయించడంలో బాగా అనుభవం ఉన్న మనిషి... మరి నేను రోజల్లా తిరిగినా ఒకనాడొక కాణీ అన్నా ఆర్జించలేను ... అతని కెంత తెలివి...ఎన్ని గమ్మత్తులు...రోజుకి రూపాయికి తక్కువ లేకుండా ఆర్జిస్తాడు...ఈ ఊర్లో అతందే కదా పైచెయ్యి... పెద్ద పెద్ద స్వాములే నా హోటల్ కి వచ్చేరు . నేను చేయించిన వస్తువుల రుచి ఆ కమ్యూనిస్టు వాడి హోటల్ కెలా ఒసుంది...

10 ఎందుకు రాదు...నీదే నేంటి హోటలు... ఏంటయితే మాకేం...చవకగా ఎక్కడొస్తే అదే మంచి హోటలు మాకు...

7 : మీ సంఘం ఆదర్శా లేమిటి?

104 : ఉన్నా యున్నాయి—అప్పుడే ఒకటి సాంధించేం...

8 ఏమిటది?

104 : ఈ సంఘం లేకపోతే మాకెంత అన్యాయం జరిగిఉండును. మా సంఘం ఏర్పాటయ్యేక, మరో వందిమందిని రప్పించడానికి లారీలు పంపించబోయింది యాత్రికసహాయ కార్యాలయం...

10 : రెండు వందలమంది చాలరుటండి బాబూ.... ఎంత వీళ్లు దానంచేసినా...ఇక్కడవాళ్లుండగా పైవాళ్లని తేవడం అన్యాయం కదా బాబూ...

7 : అన్యాయమే మరి...

104 : వాళ్లు లారీ లింకా పంపుదా మనుకుంటున్నారు, మా సంఘం గూఢచారి ఆ సంగతి కనుక్కున్నాడు...మేం వెంటనే సత్యాగ్రహం మొదలెట్టేం ఆఫీసుముందు...

8 : సత్యాగ్రహమా!

10 : కాదా మరి—లారీలు వెళ్లకుండా రోడ్డుకి అడ్డంగా పడుకొని ఆపేం...

7 : లాఠీచార్జి అయిందా?

104 : ఏమన్నా తప్పచేస్తేకదా లాఠీచార్జి.

8 : లారీలు వెళ్ళేయా....

7 : లేదా?

10 : వాటితేరం ఇంకా...

6 : నా సొమ్ము ఇక్కడ చెల్లించు ఇప్పుడు...

10 : ఇప్పుడెక్కడకుం దయ్యారూ సొమ్ము?... మరొక్క ఐదు నిముషాలు పోయేక కనిపించవయ్యా, మొహాన పారేస్తాం...

6 : మీవెంట తిరగడానికి మీ నౌఖర్ని కాను, డబ్బు చెల్లించి కదులు.

7 : ఇంకా ఏమిటి మీ ఆదర్శాలు?

104 : ఈ గ్రహణం అయిపోగానే మా సంఘం విడిపోతుంది, దీని అవుసరం మాకుండదు కనక...మేం పదిరూపాయలకి తక్కువ దానం పట్టం...

8 : సబబుగానే ఉంది.

104 : మేం రెండువందలమందీ ఆర్జించిన మొత్తం అంతా ఒకచోట కలిపి అది సరిగ్గా రెండువందల వంతులు వేసేసుకుంటాం...సంఘ సభ్యుడు కానివాడు, ఈ చుట్టుపక్కల కొస్తే ఒప్పుకోం...

: అదే కమ్యూనిస్టు సిద్ధాంతం... మీరంతా కమ్యూనిష్టులా ఏం?

104 : అదేమిటో మాకు తెలీదు ... మా సంఘం ఉన్నది ఒకే రోజయినా, అందరూ ఒక చోట కలిసి, ఒక మాటమీద నిలబడడంవల్ల ఎంత లాభం ఉందో అందరికీ బోధపడుతుంది. పెద్దపెద్ద నాయకులు జరిపిన బహిరంగ సభలకి నేను హాజరయ్యేను...డబ్బున్న వాళ్ళెవరన్నా కొంత ధర్మం చేస్తారేమో అని..ఛీ! మచ్చుకొక ధర్మాత్ముడూ లేడే . దమ్మిడీ లాభం లేకపోయినా వాళ్లు చెప్పిందంతా వినేవాణ్ని...ఏదో యుద్ధం ఒస్తుందని అందరూ కేక లేసేవాళ్లే.. యుద్ధం ఎందుకొస్తుంది. చెప్పండి? ఒకచోట మాలాగ కలిసి ఒక మాటమీద నడుస్తే ఎందుకొస్తుంది...అదే మా సంఘం చాటుతుంది...

6 : ఇదిగో...నా డబ్బు!

10 : ఏమిటయ్యా జబర్దస్తీ .... ఒక్క దమ్మిడీ కూడా ఇంకా వసూలు కాలేదు... ఇప్పుడెక్కడ్నించి తెమ్మంటావ్?...

: తిన్నప్పుడా పాటి జ్ఞానం లేకపోయిం దేమిటి?

10 : నువ్వు అరువిస్తున్నావ్ కదా అని తిన్నాం.. ఇంతకీ ఆ కమ్యూనిస్టు హోటల్ ఉందని నీ హోటల్లో తినేసేక తెల్సింది.. లేకపోతే నీ హోటలేం మాకు ఖర్మ!

: ఇంకా ఏమిటి మీ సంఘం ఆదర్శాలు, ఉపాధ్యక్షులుగారూ ?

104 : చాలవుటండీ ఆ ఆదర్శాలు? ఇంతకన్న ఎక్కువ ఆదర్శాలూ, గొప్ప ఆశలూ ఏ సంఘానికున్నాయి...

[దూరంనుండి కేక! పదిగారూ ... పది గారూ...]

10 : ఇలా రండి ఇలా రండి...

6 పైసా చెల్లించి మరీ కదలండి...

104 : యాత్రిక సౌకర్య కార్యాలయ కార్యదర్శి గొంతుకలా ఉంది...

10 : ఏమిటయ్యా నీ పైసా? జబర్దస్తీ ఎక్కువై పోతున్నాది...ఐదు నిముషాలు ఓపికపడితే పట్టు, లేకపోతే నీ తాత్తో చెప్పుకో... పో...

6 : (కోపం పట్టలేక) మాటలు తిన్నగా రాని య్యరా ముష్టిచెధవా...ఇవాళ నువ్వొగో సంఘం పెట్టేవని పెద్దవాడివయిపోయేవేం .. నిన్న పొద్దున్న నువ్వే నా హోటల్ ముందు నిల్చున్నది గుడ్డివాడివేషం వేసుకొని....

10 : అయ్యరూ...నీ మాటలు సరిగా రానీ... నిన్న నే నేమైతే నీకేం? ఇవాళ మనిషికి మర్యాదా ఇయ్యి...దిబ్బయ్యరు హోటల్లో పదేళ్లకింద ఇడ్లీకి పప్పు రుబ్బేవాడెవడో నువ్వు మరిచిపోయేవ్ కాని, నేను మరిచి పోలేను....

6 : రేపు మళ్లా నా హోటలుముందు సొట్టవాడి వేషం వేసుకు కనబడ్డావా అప్పుడు నిజంగా నీ కాళ్ళు విరిచేస్తాను...

10 : పోరా...పోరా...రేపట్నించీ నీ మొహం ఎవడు చూస్తాడు? ఇవాళొచ్చినడబ్బుతో నామట్టుకి నే నొక కిల్లీబడ్డీ పెట్టుకుంటాను.

8 : అయ్యరుగారూ...మీ రతన్ని అలా అవమానపరచడం ఏమీ బాగులేదు...

6 : చూడండి వాడి పొగరు! వంద రూపాయిల దాకా, కిటేసేరు రెండువందల మందీ కల్సి ...డబ్బుమొహతే చూసేరా?

: ఇదేదో లేబర్ డిస్ప్యూట్ లా ఉంది... నాలుగో పేజీకి పనికొస్తుంది...

: (అయ్యరుతో) మీరన్న మాటలకి ఆ పెద్ద మనిషి దావా లేవచ్చు మీమీద పరువు నష్టానికి.

6 : వెళ్ళి పోలీసుల్ని తెస్తాను. అప్పుడు తెలుస్తుంది నీ తమకం.

10 : పోవయ్యా పో... వందమంది పోలీసుల్ని తే.

104 : ఇంతకీ ఆయన హోటల్లో ఎవరు తిన్నారు?

10 : (104 కళ్లలోకి చూసి అర్థం చేసుకొని) ఏమో?

104 : ఐతే ఆ పోలీసెందుకు...

10 : అది అతనికే తెలియాలి...

6 : ఏమిటే ఘోరం! చూడండి ప్రెస్ వారూ... వంద రూపాయలు ఎగకొడదామని చూస్తున్నాడీ దగాకోరు...

104 : అయ్యరబద్ధమాడినా, తక్కినవాళ్లకి తెలివి లేదూ? రెండువందలమంది ముష్టివాళ్లకి ఎవడన్నా వందరూపాయల కాఫీ, టిఫిను అరువిచ్చేడంటే ఎవరు నమ్ముతారు...ఏపోలీసు నమ్ముతుంది. పోలీసు నమ్మినా ఏ జడ్జీ నమ్ముతాడు ?

8 : మంచి లాజికల్ గా ఉంది పాయింటు.

10 : ఎందుకు పోలీసుల్ని తెస్తావో లేవయ్యా...

6 : ఎంత అన్యాయం...ఎంత అన్యాయం... ఈ ముష్టిచెధవల్ని నమ్మడం నాదే తప్పు... చూపిస్తానుండు నా తడాఖా...(వెళ్తాడు).

[రేడియో సిలోన్ ద్వారా, గ్రహణమ్మీద డాక్టర్ ర గారి వ్యాఖ్యానం వినిపిస్తూనే ఉంటుంది...మధ్యమధ్యని చిన్న విరామం.. ఆ విరామసమయంలో "డెపిల్" "బ్రిల్ క్రీమ్" అడ్వర్ టైజ్ మెంట్లు...]

[యాత్రిక, సౌకర్యకార్యాలయ కార్యదర్శి 211 ప్రవేశం]

211 : మమ్మల్ని గంగలో ముంచుతున్నారే, మిమ్మల్ని నమ్మినందుకు పడిగారూ...

10 : అబ్బే ... మేమంతా తయారుగానే ఉన్నాం...

211 : ఏమిటి తయారు ... గ్రహణం మొదలయిపోయి పదినిమిషాలయిపోయింది...యాత్రికులంతా గగ్గోలెత్తిపోతున్నారు...ఏదీ... అంతా వెతుకుతునుకదా...మీలో మచ్చుకొక్కడున్నా ఎక్కడా ఉంటేనా? పోనీ నిన్నను ఆ లారీలు పంపి, మరొక వంద మందిని తెప్పిస్తాం అనుకుంటే పీకలవరకూ తెచ్చేరు...ఇంతమంది యాత్రికులకీ మనుష్యులని సరఫరా చెయ్యగలమని మీరు చేతిలో చెయ్యివేసి మాట ఇచ్చేరని కదా నేను నిశ్చింతగా ఉన్నాను...తీరా మొదలయేసరికి ఇదేమిటి ... యాత్రికులంతా ఒకటే గగ్గోలు!

10 : ఇదుగో రెక్కలుకట్టుకు వాల్తున్నాం...

8 : ఒక్క సెకండు ఆగండి...

7 : మరొక్క సెకండుండండి...

[కెమెరాలు ఎక్కుపెడతారు]

రెండు కెమెరాలు: క్లిక్ ... క్లిక్ ...(మరొకసారి) క్లిక్...క్లిక్...

8 : రేపటి "దేశబంధు"లో మీ బొమ్మలు, మీ సంఘంయొక్క మహోద్దేశం ఉంటుంది...

7 : రేపటి "ఎర్రజెండా"లో మొదటి పేజీలో మీ బొమ్మలు...104 గారు వివరించిన ప్రపంచ శాంతికి మార్గాలు ఉంటాయి చూసుకోండి..

[333 ప్రవేశం]

333 : నేను సూచిస్తా ప్రపంచశాంతికి మార్గం...

8 : తమ రెవరు?

104 : వీడు పొగ్గా పంతులెండి...ఈ ఊళ్లో స్కూలు మాష్టరీచేసి పిచ్చి ఎత్తిపోయేడు...

333 : నేను మీలాటి మనిషిని కాను...నా బుర్ర మీలాటి బుర్ర కాదు ... నా దృక్పథం మీలాంటిది కాదు...ఈ ప్రపంచపు హద్దులు దాటిపోయిందది...

7 : ఏమిటి తమరు సూచించే శాంతిమార్గం...

333 : నాలుగే మార్గాలు. .అవి చాలా సులభం... రేపంటే రేపు ఆచరణలో పెట్టి శాంతి తేవచ్చు...అందరికీ తెల్సు ఆఖరి ప్రయత్నంగా శాంతికి మార్గం అదేనని...కాని దానినుంచి దూరంగా పోతున్నారు...

211 : యాత్రికులు గగ్గోలు పెడుతున్నారు పదండి.

10 : పదండందరూ...మూడు భాగాలుగా విడిపోండి...కుడివేపొక జట్టు...ఎడంవేపొక జట్టు ... ఇక్కడొక జట్టు సర్దుకోండి.... (గట్టిగా) మూడు జట్లుగా విడిపోండి!

333 : యాత్రికులు, తల్లడిల్లిపోతున్నారు...గగ్గోలు పెట్టేస్తున్నారు ..ఔను పాపం...(నవ్వి) ఈ వీధి కుక్కలకి ఎముకముక్కలు పారేస్తారు కామోసు...

[మూడు జట్లూ విడిపోతాయి]

104 : పంతులుకి అమావాస్యనాడు బాగా వెర్రెక్కుతుందిలెండి...

211 : కుడివేపు జట్టు నాతో రండి...

[కుడివేపు జట్టు 211 తో పోతారు]

333 : ఈ వీధికుక్కల సంగతి నిన్నటివరకూ ఎవరికీ అక్కర్లేదు...ఇవాళ కావాలి...ఇవాళ అవి లేకపోతే పని జరగదు...

10 : ఎడంవేపు జట్టు నాతో రండి....

[ఎడంవేపు జట్టుతో 10 వెళ్లిపోతాడు]

333 : యాత్రికులు గగ్గోలెత్తిపోతున్నారా... ఔను పాపం...ప్చ్! ఎత్తిపోరూ మరి... సమయం మించిపోతోంది...... అరగంట కాలం దొర్లిపోయిందప్పుడే...ఈ అరగంట కాలంలోనూ కొన్ని వేలమందన్నా పుణ్యం సంపాదించుకోని ఉందురు పాపం...

104 : ఇక్కడి జట్టు నాతో ఆమీదకి వచ్చి ఎవరి స్థానానికి వారు వెళ్లండి....

[104 మిగిలిన జట్టుతో పోతాడు మీదికి]

333 : యాత్రికులు గగ్గోలెత్తిపోతున్నారా... ఔను పాపం...ప్చ్! ఎత్తిపోరూ మరి... ఇటువంటి సదవకాశం ఈజన్మలో ఒస్తుందా జారిపోతే...వీళ్లముందు పడేసే ప్రతిదమ్మిడీ భద్రంగా భగవంతుడి బ్యాంకిలో ఉండి... వందరెట్లయి వచ్చే జన్మలో రావద్దూ మరి...

: ప్రపంచశాంతికి నాలుగు మార్గాలూ ఏవో చెప్పేరు కారు...

333 : ఈ సిద్ధాంతం వీళ్ళ బుర్రలో ప్రవేశపెట్టిన 'ఫేనటిక్' ఐన్సిన్ అంతటివాడు.. ఇసుక రేణువులారా నమ్మండి...బురద తినండి... బురద రాసుకోండి...మంచిదే.. మంచిదే ...ఎవరు బ్రతికినా బ్రతికేరే...

: ప్రపంచశాంతికి మార్గాలు...

: 'లివ్ అండ్ లెట్ లివ్' సిద్ధాంతం నాది కాదు...ఈ మానవ సముద్రానిదీ కాదు... ఈ మనిషి తను బతికడు...ఒకరిని బతక నివ్వడు...అది మనిషి సత్తా...కాని నటన . పైకి నటన.. ఆ సిద్ధాంతం ఆచరణలో పెడదామని వ్యర్థప్రయత్నం...ఈ లక్షలక్షల మంది ప్రజ ఎందుకొచ్చిన ట్టిక్కడికి... ప్రపంచశాంతికా? ఈ రాబందులన్నీ ఎందుకు వాలే యిక్కడ ... ప్రపంచ శాంతికా...చెప్పండి...

: ఎప్పుడూ జరగనటువంటి గ్రహణం జరుగుతోందని మీకు తెల్సా?

333 : ఒకదాని మాంసం ఒకటి పీక్కుతినేందుకొచ్చేయి...వాలేయి...ఇంకొక జన్మకూడ ఎత్తి ఒకదాన్నొకటి పీక్కుతినే ఉద్దేశంతో వచ్చేయి...ఒక దుమ్ము ముక్క పారేస్తే, వంద దుమ్ముముక్కలు ఆకాశంనించి రాల్తాయన్న నమ్మకంతో వాలేయి... రాబందులు...రాబందులు...

[9 ప్రవేశిస్తాడు]

: ఆ కమ్యూనిస్టు హోటల్ కాఫీ చాలా బాగుంది. మాంచి వార్తకూడా సంపాదించేను...

: ప్రపంచశాంతికి నాలుగు సూత్రాలూ సెలవిచ్చేరు కారు...వేగం రాసుకుపోతాను. అవతల చాలా పనులున్నాయి...

: పనిలేనివాడీ ప్రపంచంలో లేడు...పనిలేని వాళ్ళంతా గోరీలకింద ఉన్నారు ...వాళ్ళంతా ప్రపంచశాంతికి సహకరించిన మహత్తర పురుషులు...

: ఆ హోటలు మనుషంతా ఎర్రదేశంనించి వచ్చిందంటున్నారు...ఆ ప్రొప్రయిటరు అందరిదగ్గరా వచ్చే ఎలక్షన్కి ఆ పార్టీకి వోటు వేసేందుకు వాగ్దానం తీసుకుంటున్నాడు... నేనూ ఓ వాగ్దానం పారేసి ఇడ్లీ, కాఫీ పూర్తిగా ఎక్కించి వస్తున్నాను...

: ప్రపంచశాంతికి...

: పుట్టిన ప్రతివాడూ ప్రపంచశాంతివినాశకారకుడే.. చచ్చే ప్రతిఒక్కడూ...అందుకు తోడ్పడే మహత్తర పురుషుడే...ఈ లక్షల కొలదీ ప్రజ రావడం ఒకవిధంగా ప్రపంచ శాంతికి తోడ్పడవచ్చు...ఈతొక్కిసలాటలో కనీసం ఒక వెయ్యిమందన్నా ఈసముద్రంలో పడి ప్రాణం పోగొట్టుకున్నవారైతే వాళ్లు ప్రపంచశాంతికి కొంత సహాయం చేసినవారౌతున్నారు...ఆ వెయ్యిమందికీ, ప్రపంచానికీ సంబంధించిన సమస్యలూ, బాధలూ పరిష్కారం అయిపోతాయి...కాని అది పూర్తిగా ప్రపంచశాంతి కాదు...

8 : షాకింగ్!

9 : ఏమిటి సంగతి...ఏదన్నా హెడ్ లైన్సుకి పనికొచ్చేదా?

8 : షాకింగ్ !!!

333 : ప్రపంచ శాంతికి ఇవే నాలుగు మార్గాలు... ఒకటి ... ఇప్పుడు జేనినయితే మానవత్వం అంటున్నారో, ఆ మానవత్వం కాని మానవత్వాన్ని మంటకలపండి...
రెండు...మీ సహజమైన రాక్షసత్వాన్ని పెంపొందించండి...

8 : ఘోరం!! ఘోరం !!!

9 : పిచ్చివాడు! పిచ్చివాడు!

333 : మూడు — ఒక వెయ్యి హైడ్రోజన్ బాంబులు చేసి అట్టే పెట్టుకోండి....

8 : హైడ్రోజన్ బాంబు! మై గాడ్ !!

333 : ఒక సుముహూర్తాన మంగళ వాయిద్యాలతో వెయ్యి విమానాలమీద బయల్దేరి, ప్రపంచాన్ని వెయ్యి భాగాలుగా చేసి... వెయ్యి బాంబులూ...వెయ్యి భాగాలలోనూ వెయ్యండి...

8 : పిచ్చివాడని వీడిని ఒదిలేస్తున్నారు కాని ప్రపంచానికి వీడు శత్రువు....పోలీసు కీవార్త చెప్పేవరకు నాకు శాంతిలేదు...

333 : ఉంటుంది శాంతి..ప్రపంచమంతా శాంతే.' వాంఛ ... లేదు ... ద్వేషం ... లేదు... క్రోధం.. లేదు... ఈర్ష్య... లేదు... అశాంతి లేదు...

9 : నువ్వూ లేవు... నేనూ లేను...ఫూల్!

333 : పుట్టుక లేదు...చావులేదు .. నువ్వూ లేవు... నేను... లేను...శాంతి...సర్వత్రా శాంతి.. భూదేవికౌగిలిలో...ఆమె లోతులలో... అనంత వాయువులలో... కలిసిపోవడమే... ఏకమవడమే మనిషికి శాంతి...

[పోలీసుఉద్యోగి 212 ప్రవేశం]

212 గ్రహణభిక్షువుల సంఘం అధ్యక్షులు ఎవరిక్కడ?

8 హమ్మయ్య...వచ్చేరూ! మొదట ఇక్కడ ఇతనుండడం చాలా ప్రమాదకరం...విపరీత భావాలున్న మనిషి...అది ప్రపంచశాంతికి భంగకరం...

7 : అతనే నాడయో పనిమీద పోయేడు...... అయ్యారుగోలేనా...అది నమ్మకండి...మాకు తెల్సు నిజం...ఆ ముష్టివాళ్లందరికీ అయ్యారు వంద రూపాయలు అరువిచ్చేడంటే మీరు నమ్మగలరా?

9 : అయ్యారు మాటలు అబద్ధం...

8 : ఈ అశాంతిపరుడిమీద తగువిధంగా చర్య తీసుకుంటారని నా నమ్మకం...

212 : ఎటువేపు పోయేడతను...

7 : ఇలా ఎడంవేపు...

[212 పోబోతాడు]

8 : ఈ ప్రపంచశాంతి భంగకారినికూడా తీసుకుపొండి...

212 : అతను పిచ్చివాడని తెలీడంలేదూ? అతను మా పాత పిచ్చిపంతులయ్యా ... శాంతికి నాలుగు మార్గాలూ చెప్పేడా?

8 : ఘోరమైన మార్గాలు...అందుకే...

212 : రోజూ అవే అరుస్తాడు...పిచ్చి వాడడు వల్ల మీకేం నష్టం?

8 : కాదు...మీరు ష్ట...

212 : మిష్టర్...మీకూ ఉందా?

8 : ఏమిటి?

212 : బుర్రలో పురుగు...

[212 చిరునవ్వు నవ్విపోతాడు

8 : అవమానం...అవమానం...

డాక్టర్ 5 : గ్రహణం సంపూర్ణదశని సమీపిస్తుం దింకొక పావుగంటలో...

7 : క్విక్—పదండి...సైంటిస్టు లున్నచోటికి పోదాం...

8 : నాకు మనస్సు బాగులేదు...

9 : పదండి...

[7, 8, 9 వెళ్తారు; భిక్షువు - 213 ప్రాకుతూ వస్తాడు ... ఒంటిమీద సరిగా బట్టలేదు. కుష్ఠురోగం అతని శరీర అవయవాలని చాలా చోట్ల లేకుండా చేసింది... మూసేంగుకు ఏవగింపు కలిగిస్తూ ఉంది ఆకారం...ప్రాకడమే చాలా కష్టం అయిపోతున్నాది...]

213 (హీనస్వరంతో) బాబూ...బాబయ్యా...

333 ఎవరు నువ్వు...మరికొన్ని గంటల్లో ప్రపంచ శాంతికి తోడ్పడేటట్టు కనిపిస్తున్నావ్...

213 బాబూ...

333 ఏమిటి ?

213 ముష్టివాణ్ణిబాబూ...

333 ప్రపంచంలో ఎవరు కాడు? అందరూ ముష్టివాళ్లే...అందరూ ఏదో ఒకటి కావాలని కోరేవారే...

213 ఎన్నో పాపాలు చేసినాను బాబూ....

ప్రతివాడూ పాపే...బతకడమే పాపం... చావడమే పుణ్యం...

213 'పూరువ జలమంలోన యెన్నో పాపాలు చేసినాను బాబూ...అందుకే యీ జలమం లోన ఈ బాధలు...

333 మనిషై పుట్టినవాళ్లంతా పాపం చేసినవాళ్లే ...నువ్వే పుణ్యం కొంత చేసేవ్..!అందుకే బాధ లనుభవిస్తున్నావ్...బాధలనుభవిస్తున్న వాళ్లు చెడు ఆలోచించరు...

213 ఈ జల్మంలోనూ బతుకిలాగే అయిపోనాది బాబయ్యా... ముష్టి బతుకయిపోనాది తండ్రీ—

333 : ఫరవాలేదు...ఇక్కడే ఉండు... నువ్వు వాళ్లకి కావాలి...నీకూ ఏదో కొంత పడేస్తార్లే...

213 : బాబయ్యా! తమరు దరమ దాతల్లా అగబడన్నారు..

333 : నేను ధర్మదాతని కాను...

213 : నా మొర ఆలకించండి సామీ...

333 : ఎవడి మొర వినేందుకన్నా నే నిక్కడ తయారే...ఇంకెవరున్నా తీసుకురా...

213 : ఈ జలమం మరో రెండురోజుల కైపోతాది బాబయ్యా...

333 : ప్రపంచంలో కొంత అశాంతి తగ్గుతుంది... నీకు పూర్తి శాంతి దొరుకుతుంది...

213 : కాళ్లు పోయినాయి ... సేతులు పోయినాయి...ఏ గోరపాపం సేసినానో బగమంతుడు నన్నిలా పుట్టించినాడు తండ్రీ...ఈ జలమలో యిలాటి రోజు రాదు ... ఈ పున్నె కాలంలో కూడ ముష్టెత్తుకునికూకుంటే యిలాటిది మరోసారెప్పుడొత్తాది బాబూ...

333 : (మాట్లాడడు)

213 : ఈ పున్నెం ఉన్నప్పుడు...ఆ సముదరంలా తానం సెయ్యాలన్నా సెయ్యగల్నా బాబూ...ఏ దరమదాతన్నా అరుపిత్తాడని ఈ సరికొచ్చినప్పటికి పేణంపోనాది...మరి నా జలమ కింతేనా...యింకో జలము కూడా యింతేనా...దరమదాతలు కటాచ్చించాలి.

333 : ఆ సముద్రంలో ముంచేమన్నా నా నిన్ను.. పద...

213 : అంత పనిసెయ్యమన్న బాబయ్యా... నన్ను ముడితే యీ గోరమయిన రోగం... కాని...బాబయ్యా...

333 : ఇంకేమిటి?

213 : ఈ పున్నెకాలంలో కసింత సాయపడవా తండ్రి...

: ఏమిటి చెయ్యడం చెప్పు...

213 : (సంతోషంతో) దరమాత్ములు...

: అదనకు...నేను కాను...

213 : నిన్నల్లా కష్టపడి మూడుకాన్లు సంపాదించినాను. ఈ జల్మకల్లా యీ రేపేళ కసింత పున్నెం సేసుకుందామని...

333 : సేసుకో...

213 : ఒచ్చే జల్మలోనన్నా యీ రోగం లేకుండా వుంటే సాలు...ముష్టిజలమెత్తినా బాద నేదు కాని ఈ గోరమైన రోగం ఒద్దు బాబూ...

333 : కష్టాలుంటేనే చెడు ఆలోచనలు రావు...

213 : ఈ రోగం సిన్నసిన్న ముక్కల నన్ను తినేసింది ..ఏమేమి పాపం సేసేనో...ఈ జలమకన్నా కసింత పున్నెం సేసేయోగం నేదా బాబూ...

333 : నీకు మతిలేదు...

213 : నేదు బాబూ...బుద్ధికూడా నేదు బాబూ.. ఆ బగవంతుడు నన్నిలా పడేసినాడు పెపంచకంలో...నాకు పున్నెం పెసాదించవా బాబూ...

333 : (విసుగ్గా) ఏమిటి చెయ్యమంటావ్...

213 : మొలకావడ సంచిలోన నిన్నటి మూడు కానులూ ఉన్నాయి బాబూ...తమరిలా బోరికి సెప్పటానికి సిగ్గవుతున్నాది. ఈ పున్నెకాలంలోన ఆ డబ్బులు నేను మీకిత్తున్నా...తీసుకోండి బాబూ...

333 : (ఆలోచిస్తూ ఉంటాడు.)

213 : అగరహం ఒచ్చినాదా బాబయ్యా... (ఊరుకోని) ముడిసిజలమెత్తినాక నాకూ పున్నెం కావాలనుంటాది బాబూ...కాని బగమంతుడు ఈ గేసారం రాసినాడు నాకు...ఏ దరమాత్ముణ్ణో కటాచ్చించమండానికన్నా బయం ఏసిందె...తమరిని సూడగానే యెందుకో దయిర్యమయినాది.. ఈ డబ్బులు పుచ్చుకొని నాకు పున్నెం పెసాదించరా మా ప్రబో!

333 : (క్రిందకు వంగి చిరునవ్వుతో) చచ్చిన మనిషి తిరిగి పుడతాడన్న నమ్మకం నాకు లేదు. ఇప్పుడు నువ్వు నాకు మూడు కాన్లూ ఇస్తే, ఒకవేళ మరొక జన్మ నువ్వెత్తినా, ఆ జన్మలో లక్షాధికారి వౌతావన్న నమ్మకమూ లేదు... నాకిచ్చి నీకేం లాభం?

నమ్మకం లేని నా కిస్తే నీకు పుణ్యం ఎలా వస్తుంది..

213 : పరవా లేదు బాబూ...తీసుకోండి...

333 : నిన్ను మోసంచేసి, నన్ను నే మోసం చేసుకోలేను...నేను తీసుకోను...

213 : నాకు సంతోషంగానే ఉంది...మోసం ఏమీ లేదు బాబయ్యా...

333 : నేను పుచ్చుకోను...

213 : (కన్నీళ్లతో) పుణ్యం వచ్చినా, పాపం వచ్చినా బాద లేదు...ఇందండి...

333 : (లేచి) నువ్వా డబ్బులుకూడా ఇవ్వక్క్లేదు...మరోజన్మ నువ్వ ఎత్తవ్ లే...

213 : ఇంకా కోటి జలమూలెత్తాలి బాబూ...

333 : నీకు పిచ్చెత్తింది...

213 : బగమంతుణ్ని నమ్మరా బాబూ...?

333 : ఆకాశమ్మీద కోట్లకోట్ల నక్షత్రాలూ, వాటిగ్రహాలూ, శూన్యంలో త్రేంాడుతూ ఒకదానికొకటి ఢీకొనకుండా ఉంటూన్నట్టు చేసేశక్తి, ఈ ప్రపంచంలో అమాయకమైన చెట్లు, లతలు పుట్టించే శక్తి, సెలయేళ్లని నదులని ప్రవహింపజేసే శక్తి, సముద్రం ప్రపంచాన్ని ముంచకుండా అరికట్టే శక్తి నా భగవంతుడు ... అందులో నాకు నమ్మకం ఉంది...కాని మీరు వాటిని చూడలేరు ...ఈ రాబందులు ఆ శక్తిని, ఆ అమాయకత్వాన్ని చూడలేవు... అసూయ, ద్వేషం, క్రూరత్వంతో కూడుకొని ఒకదానినొకటి చంపుకొనే ఈ రాబందులు ఆ శక్తి నెలా చూడగలవ్ ... ఒకదానికొకటి చంపుకొని, అశాంతి రేపేకన్న, అన్నీ ఒకేసారి గాలిలో, మట్టిలో కలిసిపోతే ఎంత శాంతి !

13 : బాబూ...దయసూపించండి...

333 : లేదు... లేదు

[333 వెళ్తాడు]

213 : బగమంతుడా! దయసూపవా తండ్రీ!

ఒక యువకుడు—214 }
ఒక యువతి —215 } (ప్రవేశం)

215 : ఇక్కడ చూడండి 214 గారూ ... ఈ దృశ్యం..ఎంత చూడ ముచ్చటగా ఉందో...

214 : ఓహో ! అమోఘంగా ఉంది...

215 : ముక్కూ చెవులూ ఎగిరిపోయేయి...

214 : మండలు, పాదాలు కూడా ఆహుతయిపోయేయి...

215 : ఈవ్యాధి వీసునిషినన్నా ఇంతగా ప్రేమించడం నే నిప్పటివరకూ చూడలేదుస్మా...

214 : ఇంతగా ప్రేమిస్తుందని నేను విననే లేదు సుమండీ...

215 : నేను తప్పించి ప్రపంచం అంతా ఇలాటి వాళ్లుంటే ఎంత బావుంటుంది...

214 : ప్రపంచం అంతా కూడా ఇలాఉంటే మరీ ఎంత బాగుంటుంది !

213 : (హీనస్వరంతో) బాబూ...పుణ్యం దయ సేయించండి ... బాబయ్యా ... దరమాతములు...

215 : ఆ గొంతులోని బాధ ఎంత సొంపుగా ఉంది చెవులకి...

214 : ఇంత హాయినిచ్చే ధ్వని నే నింతవరకూ విన లేదు...

215 : చూడండీ ... గ్రహణం ఎంతవరకూ వచ్చిందో...

214 : (చూసి) మూడువంతులు అయిపోయింది... ఇంకా ఒక్క వంతు ఉంది...

215 : నే ననుకున్నట్టయితే అబ్బ! ఎంత బావుంటుంది...

214 : ఏమిటనుకున్నారు ?

215 : ఆ మేఘం చూసేరా ... ఆ పెద్ద నల్లటి మేఘం...

214 : ఆఁ...ఆఁ...చూసేను...

215 : మెల్లి మెల్లిగా వస్తోంది తేలుతూ...

214 : ఆఁ...వస్తోంది...

215 : అది సరిగ్గా...ఆ సమయానికి...

214 : హాఁ...చాల్చాలు...బోధపడింది ... బోధపడిపోయింది ... అబ్బ ! చాలా బావుంటుంది...

215 : ఈ లక్షల కొద్దీ వచ్చినవాళ్లెంత బాధపడతారు....

214 : కిటకిటలాడిపోరూ ?

215 : అదంతా చూడాలనిఉంది ... కాని అటువంటి అవకాశం ఎంత అదృష్టం ఉంటే

దొరుకుతుంది నాకు...

214 : పూర్వజన్మలో ఎంతో పుణ్యం చేసుకుంటే నే కాని...

215 : నా అదృష్టంలో నాకు బాగా నమ్మకం ఉంది...ఆ మేఘం సరిగ్గా ఆ సమయానికే అక్కడికొచ్చి తీరుతుంది...

214 : తప్పకుండా వస్తుంది...మరొక సంగతి...

215 : గ్రహించేను...ఆ సైంటిస్టుల సంగతి...

214 : ఔను...ఎంత మజాగా ఉంటుంది...

215 : ఎన్నెన్ని గోళాలనించొచ్చేగ ... ఏవో చూసేసి, ఏవో కని పెట్టేద్దామనే...

214 : నిన్న రాత్రల్లా వాళ్ళకి నిద్రలేదేమో...

215 : ఇక్కడికొచ్చినదగ్గిర్నించీ లేదు నిద్ర... బెంగపెట్టుకు వస్తున్నారు.... మేఘం వస్తుందేమోనని...ఆ మేఘం మెల్లిగా తేలుతూ వెళ్ళి ఆ కాస్త సమయం అడ్డుపడిపోతే... భలే...

214 : మంచి గుమ్‌గా ఉంటుంది...

215 : ఐదువందల మైళ్ళ దూరంనించి వచ్చినందుకు మంచి మంచి దృశ్యాలే చూడగలుగుతున్నాను...

214 : వెయ్యి మైళ్ళనించి వచ్చినందుకు భలే సంగతులే కనిపిస్తున్నాయి...

215 : చూసేరా...ఆ ముళ్ళబల్లమీద పడుకున్న సన్యాసిని...

214 : ఒంటికాలుమీద రెండురోజులయి నిల్చున్న ఆ ధిగంబరుడో?

215 : ఆ ముళ్లల్లోకి అతడలా కన్ మూసి కూరుకుపోతే ఎంత బాగుణ్ణు...

214 : ఆ దిగంబరుడలా నిల్చునేకన్న కాళ్లు మీదకి పెట్టి తల కిందకి వేలవేసి ఏ చెట్టుకన్నా గబ్బిలంలా వేలబడితే బాగుంటుంది.

[ఊరుకొని]

మనం ఇద్దరం కలియడం ఎంత అదృష్టం!

215 : ఔను...

214 : మన ఇద్దరి అభిప్రాయాలూ ఏకమవడం ఎటువంటి సంఘటన!

215 : గొప్ప సంఘటన...

214 : మన ఇరువురి దృక్పథం ఏకీభవించడం?

215 : అసంభవమయినా సంభవించిన నిజం...

214 : కనక...

215 : ఔను తెల్సింది...

214 : పూర్తిగా విని...

215 : నాకూ అదే మనసులో ఉంది...అందుకనే భయపడుతున్నాను...

214 : నాకూ భయంగా ఉన్నా ధైర్యంచేసి చెప్పేను...

215 : మనం పెళ్లిచేసుకుంటే...మీరు బాధపడితే నే కాని నాకు ఆనందం ఉండదు...

214 : అయితే ఇంకేం ... ఇద్దరి అభిప్రాయాలూ ఒకటే...మీరు యమయాతన పడితే నే కాని నాకు సుఖం, తృప్తి రెండూ ఉండవు...

215 : ఇప్పుడే పదండి ... రిజిస్ట్రార్ ఆఫీసుకి...

214 : పదండి...

215 : పోనీ...ఇదంతా అయిపోనీండి...ఇటువంటి అనుభవం మరి ఎప్పుడు వస్తుంది...

214 : ...సదవకాశం ఎప్పుడు లభిస్తుంది....

215 : అమీద కెక్కడో ఒక యోగి సముద్రంలో చిన్న పడవలో వెల్లకిల్లా పడుకొని, నుదుట దీపం పెట్టుకొని సూర్యుడ్ని నల్లద్దాలు లేకుండానే చూస్తున్నాట్ట...

214 : రెండు కళ్లూ తాగున పేలిపోతాయి...ఎవరో అమ్మాయి మనవే వస్తోంది...

215 : పువ్వులూ అవీ పెట్టుకొని ... అల టిరకం నాకు పడదు...

214 : సెరజాణలా ఉంది...

215 : సందేహం లేదు...మగాడెవడన్నా దొరుకుతాడేమో అని చూస్తోంది...

214 : ఇటువంటివాళ్లని గుండేసి పేల్చాలి...

215 : అంతకన్న పెట్రోలు పోసి అంటించేస్తే నే బాగుంటుంది...

[యౌవనంలో ఉన్నా అది పోగొట్టుకుంటేమో నన్న అనుమానాన్ని రేకెత్తించే స్త్రీ—216 ప్రవేశం]

213 : అమ్మా!...పుణ్యం దయచేయించవా తల్లీ.

215 : ఏం పిల్లా...ఆ ముళ్లమీద పడుకున్న మనిషి అందులో కూరుకుపోయేడా...

216 : లేదండి...ఎందుకు కూరుకుపోతాడూ... అతనికి మాంచి మహాత్తుంది...

వాడింకా అలానే ఉన్నాడా...చెట్టుకి వేళ్ళాడదామన్న బుద్ధేమన్నా పుట్టిందా..?

216 అలానే ఉన్నాడు బాబూ...

215 : బాగులేదేమో...పోనీ ఆ మేఘమన్నా సమయానికి కొంత ఉపకారం చేస్తే...

214 : మీరు అనవసరంగా వ్యథ పొందకండి... అన్నీ సవ్యంగా అనుకున్న ప్రకారం జరుగుతాయి...అన్నీ చూసి ఆనందించవచ్చు...పదండి...అలా వెడతాం...

(216 ని చూసి) నామీద కన్నేస్తున్నావ్ కాని పెట్రోలు వేసి ముట్టించేస్తా పిల్లా...

216 అయ్యబాబోయి !!

215 (వెళ్ళిపోతూ) గుండేసి పేలుస్తేనే బాగుంటుం దిలాటివాళ్ళని...

216 హమ్మోయి !

214 లేదు పెట్రోలే...

215 ఒప్పుకోరా ?

214 ఈ విషయంలో మాత్రం...

215. అందుకు మిమ్మల్నే మొదట ... (ఇద్దరూ దూరం అయిపోతారు)

216 అయ్య బాబోయి! అయ్యబాబోయి!

213 (హీనస్వరంతో) అమ్మా! పున్నెం దయసేయవా తల్లీ...

216 అమ్మ బాబోయి...

213 పున్నెం దయసేయించు తల్లీ...

216 (క్రిందకి చూసి దృశ్యం భరించలేక) అబ్బా!

213 తల్లీ...పున్నెం దయసేయించు తల్లీ...

216 (మాట్లాడకుండా చూస్తుంది.)

213 తల్లీ...

216 ఏం చెయ్యమంటావ్ ... అందరూ...ఆ సూర్యుణ్ని చూసేవాళ్ళేకాని ... నా వేపు ఒకడూ చూసినవాడ్లేడయ్యా.. కాళ్లు పీక్కుపోయేయి...

218 పున్నెం దయసేయించు దరమతల్లీ...

216 ఆ బాబు పెట్రోలేసి ముట్టించేస్తానన్నాడు... ఆ తల్లి గుండెట్టి పేల్చేస్తుందిట...ఇంతవరకూ ఒచ్చింది నాగతి...ఇష్టముంటే ఒస్తారు...లేకపోతే పోతారు...

ఆ మాటలు విన్నావా....(కళ్ళనీళ్లు పెట్టుకొని) కాళ్లు పీక్కుపోయేయి...అందరూ ఆ సూర్యుణ్ని చూడ్డమే కాని...

[కూలబడుతుంది ఇసుకమీద]

213 : కటాచ్చించమ్మా !

216 : పొద్దున్న చేత డబ్బులుంటే...కాఫీ తాగేను.. ఒక పైసాకూడా లేదు...నీకివ్వాలనుంది కాని ఎక్కడ్నించి తేను...అంతమంది ముష్టివాళ్ళు అంతంతలా ఆర్గిస్తున్నారివాళ...నీకూ ఒస్తుందిలే....

213 : రెండువూ రోజుల్లోపల, పేణంపోతాది.. నాకేల తల్లీ డబ్బులు...

216 బతికి ఈ బాధపడేకన్న చావే మంచిదిలే.

213 సిన్న ఉపకారం సేసిపెట్టు తల్లీ...

216 ఏం చెయ్యమంటావ్...డబ్బులు తెప్పించి?

213 పున్నెం పెసాదించాల తల్లీ...

216 పుణ్యమా...

213 ఔనమ్మా...

216 నే నివ్వటమేమిటి? నే నెన్నో పాపాలు చేసిందాన్ని...ప్రతిరోజూ పాపం చేస్తేనే కాని నాపొట్ట గడవదు ... దేవు డిస్తాడు పుణ్యం...

213 : నువ్వే ఆ బగవంతుడివి తల్లీ...నువ్వే రచ్చించాల...ఈ జలముకి...

216 : ఏం చెయ్యాలి...

213 : మొలనున్న సంచిలో మూడు కాన్లున్నాయి...అవి తీసుకుని పున్నెం దయసేయించమ్మా...

216 : ఓహో! దానం చేదాం అని చూస్తున్నావా...(నవ్వుతుంది).

213 : నవ్వొస్తాన్నాదా అమ్మా...

216 : లేదు...ఎంచెంచి, నాకు, పుణ్యంకోసం నువ్వు దానం ఇస్తానంటూఉంటే నవ్వొచ్చింది...

213 : ఓరయినా ఒకటే తల్లీ...

216 : నాదంతా పాపపు బతుకయ్యా...నా కిస్తే నీకు పుణ్యం రాదు...పాపం ఒస్తుంది...

213 : నేదమ్మా...పున్నెమే ఒస్తుంది...నీకు బగమంతుడ్లో నమ్మకం ఉంది...నాకు తెల్సు'' నీ కిత్తే పాపం రాదు...

216 : అందరికీ దేవుళ్లో ఏదోవిదంగా నమ్మకం ఉంటుంది...కాని నాలాటిదానికి ఇలాటి సమయంలో దానంచేస్తే పాపమే ఒస్తుంది నీకు... నేను పుచ్చుకోను...

213 : నన్ను కాపాడవా తల్లీ...

216 : ఇంకేమున్నా నీకోసం చేస్తాను...

213 : తల్లీ...

216 : ఒద్దయ్యా...

213 : నేను పాపాత్ముణ్ణి... నాకు పున్నెం నేదు...జలమ జలమాలా ఇనాగే పుట్టి యీ రోగంతో నే సావాల...పెబూ!...

[సేటు - 217 ప్రవేశం... చేతిలో డబ్బు సంచితో].

217 : ఇలా రండిలా రండి...సుస్తివాళ్లంతా... మామూల్లువాడికి ఇరసై ... కుంటివాడికి నలభై...గుడ్డివాడికి అరసై..రెండూ ఉన్నవాడికి నూరు..సంపూర్ణగ్రహణ సమయం ...ఇంకెక్కడికో పోకండి...ఇలా రండి..

150 : (వస్తూ) నాకు గుడ్డీ, సొట్టా నేదుకాని ఏభై ఇత్తేనేకాని రాను...

217 : వేగం... వేగం రా మరి...ఇంద...పో... ఇంకా...ఇంకా ఎవరున్నారు....

150 : (213 ని మూసి ఆశ్చర్యపోయి) ఓరి...నువ్విక్కడున్నావట్రా... ఏడ సచ్చేవో అనుకున్నా...ఏపాటి గడించేవు...బాగా నాగేసుండాల...

216 : నీకేల అతని గోల...ఒచ్చినదారిని తిన్నగా పోక...

150 : ఒసేవ్...పిల్లా! నువ్వా...యారవో అనుకున్నాస్మ ... సూ సే వా ... డబ్బు.... గల్లలా...సాయంత్రం ఈయాళ కన్పించు... యెప్పుడూ నాపని రోడ్డుమీదకానీ, పగక్కా నిల్చోడం, నువ్వు యాడితోనో రంసుసేత్తూ పోతావుంటే యెుర్రి యెదవలాగ సూద్దం అయిపోనాది ... ఈయాళ మనం అమీర్ సాయిబ్! సాయింత్రం మరి సెట్టుకాడికి రా..

216 : అందాకా ఇలా ఒకపది అడ్వాన్సు పారే..

150 : అనుబగం నేకపోయినా నీరంసలన్నీ తెల్సే పిల్లా...నే న్లొంగే గటం కాదు...సాయింత్రం రా...(213 తో) ఓరి ... నిన్నే... సేటు ఏభై యిచ్చినాడని యారితోనూ సెప్పమాక...పగే యిచ్చినాడను...

216 అలాగే వెళు ... నీకు సేటు ఎంతిచ్చేడో తెల్సుకోనే స్థితిలో అతను లేడు...

510 : సాయింత్రం కలుద్దాం...[150 వెళ్లాడు]

217 : ఇంకా ... ఇంకా ... రండి ... మంచి గ్రహణకాలం ఒచ్చేసింది ... ఇది దాటిపోతే మీకు దమ్మిడీఅన్నా దొరకదు... రండి ... మామూల్లుమనిషికి మరో ఇరసై ఎక్కువ...కుంటివాడికి..."ఎనభై ... గుడ్డివాడికి వంద...రెండూ ఉన్నవాడికి నూటఇరసై...

[120, 121, 122, 123 ప్రవేశం]

120 : నాకు కుంటి...

121 : నాకు గుడ్డి...

122 : నాకు రెండూనూ...

123 : నాకు కుంటి, గుడ్డి, చెముడు .... నాకు మూడొందలిస్తేనే కాని పుచ్చుకోను...

217 : రండి...దగ్గరగా రండి...వేగం...సమయం దాటిపోతుంది...

[దూరంనుండి కేక : "ఒరేయి ... ఇలా రండ్రా ... అందరూ ఇటు రండ్రా... 126 ఒగరుస్తూ వస్తాడు]

126 : (ఒగరుస్తూ) నా యెంట రండ్రా ... ఈ అయిదు నిమిషాలూ దాటిపోతే దమ్మిడీ రాదురా...బంగారు కాసుల్రా ...పిడికెడేసి కాసుల్రా...రండి ...

అందరూ: ఎక్కడ....ఎక్కడ...

126 : పెద్ద కోటీశ్వరుడొచ్చినాడు ... ఈడికా డెందుకుంటారు... నాను రెండు సార్లు దూరి .. రెండు జేబులనిండా కాసులే నింపుకొచ్చినాను .... పెద్ద దుకాణం ఎట్టేను రేపు... రండి ... యేగం...యీడికాడెందుకు దరిద్రం...

[126 పరుగెత్తి పోతాడు]

120, 121, 122, 123 — పదండి ... వేగం ...వేగం...

217 : ఇవి పుచ్చుకొని పొండి...ఇవి పుచ్చుకొని పొండి...మీకు పుణ్యం ఉంటుంది ....

120, 121 (పోతూ) పోవయ్యా...పోవయ్యా...

122, 123 (పోతూ) నువ్వేంటయ్యా...దరిద్రం...

[పోతారు నలుగురూ...]

217 : ఇలా రండిలా రండి...ఏరుకుందలిస్తాను... ముష్టివాళ్ళిలా రండి .... బాబూ ... ఇలా రండి..

[211 వస్తాడు]

చూసేవయ్యా...ఎంతపనయిందో ... మరో వందమందిని తెప్పించమంటే నా మాట విన్నావూ...? సరిగ్గా సమయానికి ఏడీ... ఒక్కడూ లేడు ... ఏమిటి నువ్వు చేసిన సౌకర్యం ?

211 : నన్నేం చెయ్యమన్నారు..నిన్న వాళ్ళంతా సత్యాగ్రహం చేస్తేనే...

217 : లాఠీచార్జి చేయిస్తే కట్టిపోను...

211 : అంత సులభంగా లొంగే ఘటాలా అవి? అయినా ఆ సంఘం అధ్యక్షుడు పదిగాడు మాటిచ్చాడు కదా అని ఏమో అనుకున్నాను....ఉండండి వెళ్ళి పంపుతాను... ఒకరిద్దర్ని...కుంటివాళ్ళూ ... గుడ్డివాళ్లూ దొరకడం కష్టం...మామ్మూలువాళ్ళు దొరకొచ్చు...

217 : ఇంకా ఎప్పుడు వెళ్ళి పంపుతావయ్యా! (బేజారెత్తిపోతూ) ఇంకొక్క నాలుగు నిమిషాలే ఉంది మహా పుణ్యకాలం ... (పిచ్చెత్తినట్టు) ఎలాగ ... ఎలాగ... ఏం చెయ్యడమిప్పుడు...

211 : హమ్మదీ! ఇడుగో!! చూడండి!

[క్రింపని పడున్న 213 ని చూపిస్తాడు.]

217 : భగవాన్ ... కరుణామయా...కాపాడేవ్

211 : ఇటువంటివాడు... మీరు ప్రపంచమంతా గాలించినా దొరుకుతాడా..ఆణిముత్యంలాటి వాడు దొరికేడు కదూ...మహా పుణ్యం మీ పాదాలదగ్గరి కొచ్చింది...ఇక నేం ... కానీయండి..(చిరునవ్వు పారేసి పోతాడు).

217 : కాపాడేవ్ తండ్రీ ... (216 ని చూసి) అమ్మా! ఇతను నీ తండ్రా?

216 : (సంకోచించి...ఆఖరికి) ఔను బాబూ...

217 : అటువంటి తండ్రి ఉన్నందుకు నువ్వెంత అదృష్టవంతురాలవమ్మా...

216 : నేనా బాబూ!

217 : ఔను తల్లీ...నువ్వే..నీ అదృష్టం పండింది.. పదివేలు ఈ సంచిలో ఉన్నాయమ్మా... ఇదంతా నీ తండ్రికే...అంటే నీకు కాదా మరి...

216 : పదివేలు ! పదివేలు ! అతనివి.... ఇదుగో అయ్యా! వింటున్నావా ? నీ అదృష్టం పండింది...నే చెప్పలే...పదివేలు సేట్‌జీ ఇస్తున్నారు.... పుచ్చుకో!

213 : (మాట్లాడక వింతగా చూస్తూ ఉంటాడు)

217 : మోకాళ్ళమీద కూర్చొని వంగి) ఇదుగో... నిన్నే ... ఈడబ్బు...నా మనఃపూర్వకంగా నీకు దానంచేస్తున్నాను...పుచ్చుకో.. వేగం వేగం...

216 : తీసుకో అయ్యా...తీసుకో...

213 : (నీరసంగా) నాకేల బాబయ్యా డబ్బు.... డబ్బు నే నేం సేసుకొనేది .... ఆ డబ్బుచ్చుకుంటే నారోగం నయమయిపోతాదా ? నాకాళ్లూ, సేతులూ ఒత్తాయా బాబూ .... మల్లా.... నాపాపాలు పోతాయా ... నాకు పున్నెం....ఒత్తుందా బాబూ...

217 : నీకూతురికోసం ... నీకూతురు మంచి ఇల్లు కట్టుకుంటుంది...

[333 ఇంతలో వచ్చి అంతా చూస్తూ ఉంటాడు]

నిన్ను ఆ మంచిఇంట్లో ఉంచుతుంది...

216 : బాబిస్తున్నప్పుడు తీసుకో....ఒద్దనకు తప్పు..

213 : (216 తో) నా మూడుకానులూ నువ్వు తీసుకోనేకపోయేవ్? ఈ పదివేలూ నన్ను తీసుకోమంటున్నావ్ .... నా మూడుకాన్లు

తక్కువేటి? ఈ పదియేలు యెక్కువేటి... రెండూ ఒకటే....అతనికీ పున్నెం కావాల ...నాకూ కావాలి...నా మూడుకాన్ల కెంత పున్నెం ఒత్తుందో....అతని పదియేలకీ అంతే ఒత్తుంది...నీకది డబ్బులాగొపించింది....నా డబ్బులు కన్పించ లేదు...

216 : (కన్నీళ్ళతో) నామాట నమ్ము....నీ మూడు కాన్లు తక్కువని కాదు....సేటు నాకు పది వేలు దానంచేస్తానంటే పుచ్చుకుంటూ నను కున్నావా? నేను తగను ... నాది పాపపు బతుకు...నమ్ము....

217 : సమయం మించిపోతోంది...ఇంద..ఇంద..

213 : (కష్టమ్మీద కూర్చొని) బాబయ్యా ... ఇవ్వండి...కాని బాబయ్యా....ఇచ్చేముందు ...చిన్న సాయం చేసి పెట్టు తండ్రీ....

217 : ఏఁవిఁటి...ఏఁవిఁటి...చెయ్యాలి? చెప్పు.. వేగం...

213 : బాబయ్యా ... నా మొలనున్న సంచిలో మూడుకాన్లున్నాయి...నాకు మనసుసంతోసంగా ఇత్తున్నా...తీసుకోండి తండ్రీ...

216 : ఇదుగో అయ్యా....ఒద్దు...ఒద్దు....

217 : (విస్తుపోయి) ఏఁవిఁటి...

213 : అయి తీసుకోండి బాబయ్యా.... మీ పది యేలు నే న్తీసుకుంటాను....

216 : అయ్యా....(ఒక నిశ్చయానికొచ్చి)...నాకిచ్చి...నాకిచ్చి... నే న్తీ సుకుంటాను...

217 : క్షేనిక్తా మూడుకాన్లూ...

213 : నే నిత్తున్న దానం బాబూ...

216 : ఇదుగో అయ్యా....ఆగు... నేను తీసుకుంటాను నీ మూడుకాన్లూ...

217 : (పట్టరానీ కోపంతో 213 ని ఒక తోపు తోస్తాడు...213 వెనుకకి ధఢేలున పడతాడు)

218 : రామసెంద్రా...రామసెంద్రా...

333 : (ముందు కొచ్చి గట్టిగా) రా బం దు! రాబందు!

217 : ఓరి బద్మాష్! ఎంత మోసం చేద్దామని చూసేవ్...మూడుకాన్లిచ్చి పుణ్యం నువ్వు సంపాదించి...పదివేలు కూడా కాజేద్దా

మన్నా చెయ్యలేదు..ఈ ఒక్కసారన్నా చెయ్యలేకపోయేనయ్యా ఆఖరికి...

మని చూసేవ్....నిన్ను పోలీసుల కప్పచెప్తానుండు....

216 : (గట్టిగా) పో!....రాక్షసుడా .... పో!

217 : ఉండండి మీ పని పట్టిస్తాను ... మీ ఇద్దరి పనీ...మాంచి నాటకం ఆడేరే .... (డబ్బు సంచీతో పరుగెత్తిపోతూ) ఎవడన్నా గుడ్డివాడు....ఒక్క గుడ్డినాడిలా రండి... పది వేలు దానం చేస్తారండి ... బాబోయి ... మరొక్క నిమిషమే ఉంది....

[మరి మాటలు వినిపించవు]

333 : రాబందు!....రాబందు!!

216 : ఇదుగో ... అయ్యా...నామాట వినిపిస్తున్నాదా....

213 : (బెక్కుతూ) రామసెంద్రా ... పాపాత్ముణ్ణి...సెమించు తండ్రీ...మరో జలమకే..

216 : ఇదుగో అయ్యా...నీ మూడుకాన్లూ ఇలా ఇయ్యి...ఇదుగో తీసుకుంటున్నాను... సంతోషంతో తీసుకుంటున్నాను .... ఇస్తున్నానను...వినిపించిందా...

213 : రామసెంద్రా...రామసెంద్రా...

216 : (చెవిదగ్గర) నీ మూడుకాన్లూ ఇచ్చేస్తున్నానను...నేను తీసుకుంటున్నా ... ఇంకో నిమిషం మంచి పుణ్యం ఉందిట...అను... ఇచ్చేనను...

213 : చె...మిం...చు ..తం...డ్రీ...

[ప్రాణం వదుల్తాడు]

333 : (ముందుకు వచ్చి గట్టిగా)పోయేడు..శాశ్వత శాంతి దొరికింది ప్రపంచానికి...కాదు...ఒక జీవికి...ప్రపంచానికి శాంతి లేదు...ఎక్కడ చూసినా రాబందులే...రాబందులు... ఈ రాబందులన్నీ చావాలి ... చెల్పండి... చెయ్యండి ధ్వంసం..అంతమవండి అందరూ ...అంతమవండి...

216 : (213 మీదపడి ఏడుస్తూ) నీకు ఆ కొంచమన్నా తృప్తిలేకుండా చేసేను...ఇవ్వలేకపోయేను..ఈ బతుకులో ఒక్క పుణ్యా

సూర్యగోళంలోని రహస్యాలు కనుక్కొందుకి వచ్చేరు..ఈ ముష్టివాడి బ్రతుకు రహస్యం తెల్సుకోండి...ఈ కుష్టురోగి డబ్బు కెందుకాశించలేదో గ్రహించండి...ముళ్ళమీది సన్యాసి మహత్తుకి కారణాలు అన్వేషిస్తున్నారు...పుణ్యంమీద నమ్మకమున్న ఏ పుణ్యాత్ముడూ ఈ మూడు కాళ్లూ ఎందుకు పుచ్చుకోలేడో కారణం తెల్సుకోగలరా? శాంతికోసం ప్రపంచాన్ని గాలిస్తున్నారు ... ఈ దరిద్రుడి బతుక్కి శాంతి ఎందుకు లేదో కనుక్కుంటే చాలు ...కనుక్కోలేరు...లాభం లేదు... రాబందులు.... పేల్చండి...ధ్వంసం చెయ్యండి...ఒకే ఒక శ్మశానం....మహాశ్మశానం చెయ్యండి ప్రపంచాన్ని...అప్పుడు ...అప్పుడన్నా..ఆ మహాశ్మశాన వాటికలోనన్నా శాంతికి ... అమాయకత్వానికి ... దొరుకుతుంది...జాగా...నీడ...

[పోతాడు]

216 : (వెక్కి వెక్కి ఏడుస్తూ) జన్మలో ఎన్నో పాపాలు చేసేను ... ఇప్పుడు ఘోరమైన పాపం చేసేను...క్షమించు తండ్రీ!!

[తెర]

# అయిదు నిమిషాలు

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి
శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

ఈ అయిదు నిముషాలలో :
ఏకలా వి
లాసినీ మంజు మంజీర రవళి శ్రవణ
మధురమై స్మృతి కృతి నశింపక నిలుచునో !
ఏ వినీల
నీరదరథస్థ విద్యున్మణీ ప్రదీప్తి
తరళితమ్మయి ఇరులెల్ల విరిగిపడునో !
ఏ వికస్వ
రాంబకోజ్ఝితాంబక కదంబాహతములు
భావనలు పైకిలేచునో పరిణమిల్లి !
ఏ వసంత
కిసలయోన్మత్త మధుర పికీగళమ్ము
కోయనుచు పల్కరించునో తీయగ మము !
ఎన్నడో అ
పోహాల బలాన విడివడి పోయినట్టి
స్నేహలతికలు కలసి పుష్పించునేమొ !
అయిదునిముషా లనంత కాలాబ్ధిలోన
కణము లైదింటి పాటియు గావు గాని
ఏటికో మాకు వీనిపై ఇంత మమత !

ప్రవేశం ఉచితం!

# రు. 25,002 లను

గెలువండి

మొదటి బహుమతి
రు. 20,001లు*
రెండవ బహుమతి
రు. 5,001లు

* మొదటి బహుమతిని గెలుపొందిన వారు ఒకరుగాని లేక అందరూ కలిసి గాని అదనపు రు. 20,001లను బిడ్డల ఆస్పత్రికిగాని లేక వార్ధకునిగాని యిచ్చే హక్కునుగూడ గలిగియుంటారు.

## మరియు ఇంకొక రు. 20,001లు ధర్మార్థం యివ్వబడును!

## గొప్ప డాల్డా క్విజ్ లో

ముగింపు తేదీ:
30వ సెప్టెంబర్ 1955

### మీరు చేయవలసిందల్లా

ఒక ఎంట్రీఫారమ్‌ను మీ డాల్డా వ్యాపారివద్ద తీసుకొని అందులోనున్న సులువైన 18 వాక్యములను పూర్తి చేయండి. మీ జవాబులు ఒక ప్రత్యేక తీర్పరి సంఘము చేత నిర్ణయించబడిన వాటితో ఏకీభవించిన యెడల, మీరొక బహుమతిని గెలుపొందెదరు. ప్రవేశ రుసుము లేదు— 5 పౌనుల డాల్డా గుర్తుగల వనస్పతి డబ్బాయొక్క పై మూతను మాత్రము ప్రతి ఎంట్రీతోను పంపండి. ఒక 10 పౌనుల డబ్బాయొక్క పై మూత మీకు రెండు ఎంట్రీలకు అర్హతను గలిగించును.

ముఖ్య విషయం
ప్రతి ఎంట్రీయున్న సీలు చెదరకుండావున్న డాల్డా డబ్బాయొక్క పూర్తియైన పై మూత చేర్చి పంపబడినదా యని దృఢపర్చుకోండి.




బొంబాయి, సౌరాష్ట్ర, హైదరాబాద్ మరియు మైసూరు రాష్ట్రములందు నివసించువారు తప్ప తదితరులందరూ పాల్గొనవచ్చును.

## మీ డాల్డా వ్యాపారివద్ద ఒక ఎంట్రీ ఫారమ్‌ను తీసుకోండి

HVM. 250-X52

# కలగూరగంప

## దుష్యంతోపాఖ్యానము : నన్నయ

శ్రీ యడవల్లి ఆదినారాయణ

మొన్న జూన్ భారతిలో కలగూరగంపలో పడిన మిత్రశ్రీ కొడవంటి శంకర నరసింహ బ్రహ్మం గారి విమర్శకు సమాధానము :

భారతమున ప్రకరణమును బట్టి యిచ్చట భరత వంశానుక్రమణిక వర్ణ్యము. కాన దీనిని దుష్యంతోపాఖ్యానమనుట లెస్స. శకుంతలోపాఖ్యానము కాదు. వర్ణ్యభాగము నే దృక్పథమున కవి రచించెనో యీ నామము పాఠకులకు చూపును. ఆ దృక్పథమున చూచిననే కవిహృదయము సమగ్రముగ నవగాహనము కాగలదు

మిత్రశ్రీ బ్రహ్మంగారి విమర్శకు సమాధాన ప్రసక్తి లేకుండెడిదే. కాని వారు అచ్చటచ్చట రసిక లోకమును, విమర్శక లోకమును, విజ్ఞలోకమును తమ విమర్శనకు అనగా నన్నయ అనవధాన రచనకు వారు చూపిన నిదర్శనములకు నిర్ణయములకు నిర్ణాయకులుగా చేసియున్నారు కనుక తప్పనిసరియైనది.

నన్నయను కొందఱు ఆదికవి యనిరి. ఏ దుర్ముహూర్తమున నెంత సహృదయముతో ననిరో తదాది శిఖపట్ల గోత్రమే. పోనిండు, అతనికి ముందున్న కవి ఫలాన యని నిర్ధరింపఁ జేసినదా యనిన దానిని మన విమర్శకులే చేసినట్లు తోపదు. అట్టిపట్టున నా పెద్ద వచ్చువరకైన నన్నయ నాదికవి యనుట యపాయకరమేమో నిష్పాక్షికులైన విమర్శకులే యోజింపవలె. ఆదికవి నని తా ననలేదు. అసలు భారతము మొదట తాను రచించుచుండెనని యనక ప్రథమ పురుషలో నన్నయ యనువాఁ డుండె. అతడు రచించుచుండెననెను. అట్టి నిరహంకారమూర్తిని ఆదికవి యన్న నేమి? చివరకవి యన్న నేమి? అసలు కవి యనకున్న నేమి? బాధ లేదు, కాని 'ఆదికవి' అని పేరు పెట్టిన మాత్రనే తద్భావ సామ్యముతో ఆదికవి వాల్మీకి తోడను, వ్యాసునితోడను పోల్చి రానన్నయ్యను?

'వ్యాసునికి మెఱుగులుదిద్దె నన్నయ' యన్న దానిలో వ్యాసునిపై గౌరవభావమూ బాధించునది. నన్నయపై నీర్ష్యయా? 'వ్యాసో నారాయణో హరిః' అను దృష్టిలో పూజ్యభావమున నామహర్షి శ్రేష్ఠుని గ్రంథమును నోటపట్టు విర్హత మనకు లేదని చేతులు కట్టుకొని మోకరించుట నాకు పరమసమ్మతమే. వ్యాసవాల్మీకులు మనకు తేరి చూడరానివారు. మన విమర్శకు లీ భావము పడిరేమో యన్న 'పితా — దుహిత' శబ్దవిచారణ చేయుపట్టుల 'మూలభారతమునకు కాళిదాసుగారు మెరుగులు తీర్చినా'రనిరి. కావున వ్యాసభగవానుని నితరకవులతో పోల్చి తక్కువపరచుట వారికి సమ్మతమే యనిపించుచున్నది. అప్పుడు నన్నయ దిద్దె నన్న విప్రతిపత్తియేమి, నిజముగ మెఱుగులున్నచో? వ్యాసులు సమీచీనులై నన్నయ కాకపోయెనా తెలుగువారికి? నిష్పాక్షికత్వ సత్యాన్వేషణప్రవణతలు, సహృదయత, స్వాభిమానరహితతలు ఏతద్విషయ తత్త్వైకనిర్ణయదీక్షకత్యావశ్యకములు.

తెలుగుకవులు యథామూల పరివర్తనమును గాక యనౌచిత్యము పరిహరించి రసోచిత కథోన్నయనము చేసిరనిరి. దీనికిముందు 'వ్యాసుని శకుంతలోపాఖ్యానమున లోపములున్నవనియు, నన్నయ మెరుగులిడెననియు కొంతటి విమర్శకులు వ్రాసిరని బ్రహ్మంగారు రచించుటలో వ్యాసునిలో లోపములు లేవని భావించినట్లు స్పష్టము. లోపములున్ననే కదా, తెలుగు కవులు అనౌచిత్యము పరిహరించుట, ఈలోపము లేకుండుట

యొక్క శకుంతలోపాఖ్యానమున నేనా యావద్భారతి మున కూడనా? అయిన తిక్కనాదులు వ్యాసునికి 'మెఱుగులు వెట్టి'రను లోకాభిప్రాయ మసంబద్ధమా? అట్లుగాక నన్నయానూదిత వ్యాసభాగములలో తక్క మిగిలినవానిలో లోపము లున్నవా?

తరువాత శ్రీనాథుడు నైషదాంధ్రీకరణాంత శపథ వాక్యముల సత్యత విమర్శకులు పరిశీలించి చూచిరా?—

మహాభారతబద్ధ నిరూపితార్థము నే రచనా కౌశలమున వ్యంగ్యవైభవము మెఱయ గోరంత వాచ్యము చేసి కొండంత ధ్వనింప చేయగూడదా? ఇది గురూహ్యమా? నిజమే, పాపము. లేకున్న నన్నయాంధ్రీకరణ మనవధానముగా కన్పట్టునా? ఆతని రచనాశిల్ప మంజరి యూహకును సులభముగా నందదు. ఆతడే చెప్పెనుగదా "సారమతిమై కవీంద్రుడైనవానికే తత్ప్రసన్నకథా కలితార్థయుక్తి లోనారయ నేర్పు కల్గుననియు, అటుల లోనారసినగాని మేలన జాలడనియు", కావున సామాన్యులకు దురూహ్యమే. ఆతని రచన ప్రత్యక్షర వ్యంగ్యవైభవ విభాసితము.

వ్యాసభగవానునికి భారతాంధ్రీకరణము కర్తవ్యమైయుండగా కాళిదాసు శాకుంతల గాథ యేల? భారతిగాథయేల? నన్నయ క్రొత్తగ్రంథము వ్రాయబూనుచుండెనా? లేక వ్యాసుని కథాభాగమును దిద్దతలచుకొనెనా? లేదే. ఏ కవి రచనాశిల్పము వానిదే! ఏ కథా కథన మార్గము దానిదే. నన్నయ పూర్తముగ వ్యాస హృదయము నెరిగి యనువదింపబూనుకొనెను గాని యనవధానముగ గాని మూలము నంతటి యమూలార్థము నెఱుగక గాని తన భారతాంధ్రీకరణము చేయలేదు.

విమర్శకులు నన్నయ యనవధానరచన కుదాహరించినవి చూడుడు. ప్రాదుర్భావాత్మకములైన ఆత్మజ—జనక శబ్దముల వాడుట—రక్షణ, పోషణార్థకములైన పితా దుహితా శబ్దములు మూలమున కనుచితములుగ వాడబడగా వానిని వీడుట—ఇంతటి సామంజస్యము పరిశీలింతము. దుహిత యనగా పెంపబడినది. పిత యనగా రక్షకుడు అనిరి. కణ్వుని దుహితననియు కణ్వుడు నా పిత యనియు శకుంతల మూలమున చెప్పినది. అనగా కణ్వునిచే పెంచబడితిని, కణ్వుడు నన్ను రక్షించెను, అని. "శరీర సంరక్షణాదిభిః తాత కాశ్యపో అస్యాఃపితా"—కాళిదాసు. వీనిని సఖి పలుకును. కాని నన్నయ శకుంతల కణ్వుని 'ఆత్మజ'ను కణ్వుడు నా 'జనకుడు' అన్నది—వ్యాస శకుంతలకు కణ్వుడు పాలన పోషణకర్తగనే భావన. నన్నయ శకుంతలకు కన్నతండ్రిగ—ఏది యుత్కృష్టమో చూడుడు—కన్నతండ్రి భావన లేనిచో శాకుంతలమున నాల్గవ యంక స్వారస్యమేమున్నది? ఈ కన్నతండ్రి భావన కణ్వునికున్న లోపమే—జితేంద్రియు డగుటచే—ఆత్మజ, జనక శబ్దములు కణ్వుడు వాడినను కవి వాడినను దోసమే. కాని శకుంతల వాడుట లెస్స కూడ. ఇక కణ్వుని పల్కులు చూడుడు. "ఏము దీనికి భయత్రాతల మగుటచే గురులము. (ఇది పితాశబ్దార్థమే.) ఇదియు మాచే నభివర్ధిత యగుటచే (దుహితాశబ్దార్థము) మాకు హృదయానందినియైన కూతురు. ఇట్లు పితా, దుహితా శబ్దార్థముల యౌచితి నెరిగియే మెరుగులు తీర్చి పై రచన చేసియుండ వానిని వీడెననియు ననవధానరచన యనియు ననుట సమంజసము కాదు. కాక శకుంతలకు కణ్వ ఉభయత్రాతగనే సంబంధము. ఇది అహింసా భూతదయలు పారముగన్న జితేంద్రియుని భావనారీతి. భయత్రాణన మనగా—ఆపద్భయము నుండియు, భవభయమునుండియు నని తెలియవగును కాననే గురువుల మనెను. విశ్వామిత్రునకు శకుంతల తనుజ, కణ్వునకు ఆత్మజ, కణ్వాశ్రమసంవర్ధన విశేషమున నామె భవభయ విమోచన మందినది. అందుచే భయత్రాతలము గురువుల మనుటే లెస్స. ఇక శరీర సంవర్ధనమున కర్తృత్వకము వాడక ప్రేరణార్థకము వాడుట. ("మాచే నభివర్ధిత"-అనగా మా ప్రేరణచే ఆశ్రమస్థులు పెంచిరని యర్థము,) శ్లాఘాపాత్రము, ఇది యిట్లుండ మూలముననున్న పితా, దుహితా శబ్దముల నే వాడిన కాళిదాసు మూలమునకు మెరుగెట్లు పెట్టెనో తెలియదు. అట్లయిన నన్నయ వీరిరువురికిని మెరుగిడెనన వచ్చునా!

రెండవది — మేనకా విశ్వామిత్ర ఘట్టమును శకుంతల చెప్పుటలో గల యనౌచిత్యము, మూలమున మాత్రము మేనకా విశ్వామిత్రుల కూతుననియే చెప్పింపక "గాలికి గుడ్డ జారిపోగా మేనక దిగంబరయై సిగ్గుతో భూమికిదిగి విశ్వామిత్రు ముందరకు వచ్చినది" మొదలగు తలిదండ్రుల కామగాథను శకుంతలచే

చెప్పింప నేల ? ఇదిమాత్ర మప్రస్తుతము కాదా ? అయినచో మహర్షులట్లేల వ్రాయుదురు ? ఏదో ప్రయోజన ముండవలెను. మాతుము, ఈ గాథను చెప్పునది కణ్వుడు; అదియు మరొక మహర్షితో నాతడు శకుంతల జన్మక్రమమునుగా చెప్పును. కణ్వుని కూతురన్న నెంత యబ్బురమును సంశయమునో, మేనకా విశ్వామిత్రుల తనుజ యన్న నంతియే. అందులకే మరల సందేహములు ప్రశ్నలు పుట్టకుండునట్లు, మహానిష్ఠాగరిష్ఠుడై ఘోరతపము చేయు విశ్వామిత్రుడు మేనకవలలో పడుటకు సన్నివేశమేమో వ్యాసుడు కణ్వుని ముఖమున వర్ణింపించెను. అచ్చట నవరసము కాన చెప్పి యుండవచ్చును. శకుంతల కేల? అనిన ఇచ్చటను దుష్యంతుడు మరింత సందేహాస్పదుడగును. అదియుగాక తనతండ్రి వచ్చుదనుక దుష్యంతుడు తన కతిథి గాన నాతనితో మాట్లాడుచుండవలె. అప్రస్తుతమును, రసభంగకరమును నైన విషయము పనికిరాదుకదా. అదియుగాక ఆత్మకథ చెప్పుచున్నది. ఎంత యుత్సాహముండును. అసలు దుష్యంతుని జూచిన ప్రథమ క్షణమునుండియు నేలాగో యాతనిపై ప్రీతి జనించినది. ఆతనితో నెంత మాట్లాడినను ప్రియముగనే యుండెను. ఇది సహజము. కావున మూలకథారహస్యము చెడకుండ నీ ఘట్టమును పొందు చెడకుండ నమితము గాకుండ చక్కగా నన్నయ రచించెను. ఇందు వర్ణితమైన మేనకా విశ్వామిత్ర ఘట్టమునందలి శృంగారము అంగియగు శకుంతలా దుష్యంత శృంగారమునకు ఉద్దీపన విభావము. కణ్వాశ్రమస్థ యగుటచే శకుంతలయు నామె నిరుపమాన సౌందర్యమును తనకు బాధావహమగుచున్నదే గాని ఉత్సాహజనకమై ముందడుగు సాగించుటలేదు. శకుంతలా దుష్యంత ప్రణయగాథకు నిరోధక వాతావరణమే యెక్కుడున్నదిగాని ఉద్దీపక సామగ్రి కన్పింపదు. అందుచే రసపోషణ దృష్టిలో నన్నయ, మూలకర్త విగతవస్త్రను చేయుట కంగీకరించిన మేనకారూపమునే జుగుప్సాకరము కాకుండ సావయవముగా నొండు రెండు మాటలలో వర్ణించెను. రసదృష్టి కదికి ముఖ్యతమము. ఈ పల్కుల శకుంతల ముద్దరాలితనమును, తండ్రి దోసము లేల చెప్పునను నమ్మికయు స్పష్టములు. అందును తండ్రి తానై చెప్పినట్లు పల్కించినాడు కవి. "అయోగ్య పరపురుషుడే" అన్న దోసము పరపురుషుడే యైనచో కవి జాగ్రత వహించునాడే. కాబోవు భర్త కనుకను, మించి తానాతనితో మరిమరి మాటాడ నిచ్చగలది కనుకను, కవి యుచితమే యని చేసినాడు. అంతియే కాని యిది కవి యనవధానతమాత్రము కాదు. ప్రయోజనము నుద్దేశించియే వాడెను. నేటి మన పరిసరానుభవములతో మన నాగరికతా దృక్పథములో నాటి యాశ్రమ మర్యాదల జూడరాదు. వ్యాస శకుంతల తత్త్వము నెఱిగి నన్నయ శకుంతలను పరిశీలింపవలెను. కాళిదాసుని శకుంతలకును వ్యాసుని శకుంతలకును భేద ముండవచ్చును. కాళిదాసు శకుంతలా తత్త్వమున నితిహాస శకుంతలను జూడరాదు. అట్లని యనుచితమున్నదని తలపకుడు. నాటి యాశ్రమపరిస్థితులబట్టి వ్యాస శకుంతలా పాత్ర చిత్రణము జరిగినది. దానికి తూచ తప్పక నన్నయ తన శకుంతల రూపురేఖల దిద్దెను.

ఇక అవినయార్థస్ఫోరకమనబడిన "అతిరుచిరాగతుండయిన............" అను పద్యవిషయము. ఈ పద్యము ఈ భాగములో నున్న శిల్పభూయిష్ఠములైన పద్దెములలో నొకటి. భావిశకుంతలా దుష్యంత వివాహసూచకమును, పృథ్వీభర్తకు లతాలలనలు సేసలువెట్టుట భావిశుభాకాంక్షలతో చేయు బహుమానవిశేషమును సంప్రదాయస్ఫోరకమునుగా వర్ణింపబడినదిందు. పెండ్లికుమారునికి దీవనలతో సేసలువెట్టుటకు ముత్తైదువలు తగరా? ఇది నాగరక జనవృత్తమా? ఆశ్రమస్థులు చేయరా? ఇక ఈపద్దెమున నలంకారరచనము చే పెండ్లికొమరుడైన దుష్యంతు డలంకృతుడౌట సూచితము. ఇట్లు సర్వాంగసుందరమై ఔచితీపారముగని వ్యంగ్యవైభవమున వెలయుచు భావికథాసూచన చేయు నీపద్దెమవినయార్థస్ఫోరకమెట్లో తెలియదు. ఇందలి లతాలలనలు నాగరిక స్త్రీజనవృత్తము కలవారలైన కాళిదాసుని నవమాలికాదులెట్టివారు. నవమాలికావృత్తాంతమును ఆశ్రమమధ్యమున నే యుంచెనే కాళిదాసు. నన్నయ వర్ణించినది తత్తపోవన ముఖభాగమున. ఇక దీనికి మూలమును దానిని విమర్శకు లర్థము చేసికొనిన తీరును చూడుడు. "మనోరమమైన వనమున దుష్యంతుడు ప్రవేశించెనట. ఆకసమునంటుచు పుష్పిత శాఖలుగల వృక్షములు గాలితాకున విచిత్రమైన పుష్పవృష్టిని మాటిమాటికిని కురియుచు మధురధ్వనులు

చేయు పక్షులచే నినదింపజేయబడినదైనది."—ఇది మూలము—దీనికి విమర్శకుల వ్యాఖ్యానము: శాంతమైన వనమున రాజును తదితరులును ప్రవేశించిరి. వృక్షాగ్రములనున్న పక్షులు బెదరి పై కెగిరిపోయి కూయదొడగినవి. తదుత్పాతన వేగమున పక్షిమారుతో చ్చలితమై శాఖలనుండి పూలు రాలినవి ఇది స్వభావ సుందరము, అని. మూలమును విమర్శకుల భావమును పోల్చినచో మూలమును వారు సరిగ చూడలేదేమో అనిపించుచున్నది. మూలభిన్నమైన యర్థమే స్వభావ సుందరమట మూలయుక్తమెంత సుందరమో?—నా సమాధానము: మనోరమమైన యాశ్రమము అని యుండ శాంతమైనది యనుట తప్పు. రాజు ప్రవేశించెనని యుండ రాజును తదితరులు ననుట తగదు. పూలు రాల్చుటయును, నినాదము చేయుటయును వృక్షముల మూలముననై యుండ పక్షులు బెదరి పైకెగిరిపోయి కూసినవనియు, ఆ గాలితాకున పూలు రాలెననియు ననుట తగదు. ఇట్టి యమూలకార్థ భావనయే విచారణీయము. మూలమునందలి సౌందర్యము చూడుడు. ఆ వనము రాజు మనస్సును రమింపచేయుచు ముందునకు కొనిపోవుచున్నదనుటకై 'మనోరమమ్' అనెను. ఇది భావిశృంగారగాథకుపస్కారకము. శాంతము విరోధకారకము. పునః పునః అనుటచే మాటిమాటికి కావలెననియర్థము. వ్యసృజంస్తే ద్రుమాః-అనుటలో వృక్షములు కర్తృత్వము వహించి కోరి వదలుచున్నవని యర్థము. అంతియేగాని పక్షుల రెక్కల గాలితాకున కాదు. అట్లనుట నిష్ప్రయోజనకరమే కాక మూలార్థసౌందర్యభంజకముకూడ. పక్షుల కూతల మూలమున భావిశుభాకాంక్షలును, మాటిమాటికి పూలను కోరి వదలుచున్నవనుటచే భావి శకుంతలా దుష్యంత వివాహ మంగళాక్షతలును గమ్యమానములు. దీనినే పై పద్యమున నన్నయ కడు రమ్యముగా చిత్రించెను. మూలార్థబోధ కలుగక నన్నయ వ్యంగ్య రచనా సంప్రదాయ మెరుగనిచో నిది యవినయార్థ స్ఫూరకమే యగును. పోనిండు వారి భావనయైన సుందరమా యన్న కాదే. పక్షులు బెదరి పై కెగిరి కూయుట యేల? బెదరుటకు దుష్యంతుడు హింసకుడా? కాదు. అదియును గాక కాళిదాసు "విశ్వాసోపగమాదభిన్నగతయః శబ్దం సహన్తే మృగాః" అనుటచే నాశ్రమములోని ప్రాణులు అపాయశంక లేక విశ్వాసము కలుగుటచే చలింపకున్నవనియె. కాన ఆశ్రమజీవుల తత్త్వము నెరిగినచో 'బెదరి' అని యనరు.

ఇక నన్నయ రచనలోని సౌందర్యము. శకుంతలకు ప్రకృతికాంతయు, లతాలలనలును బంధుగణము. కాన చెలికత్తె తరఫున దుష్యంతుని కాతిథ్యమిచ్చుచున్నదా యనునట్లు ప్రకృతి వర్ణింపబడుట యసహజమా? అనుచితమా? పక్షుల మధురధ్వనుల కన్న నాడు తుమ్మెదల నినాదము మంజులతరముకదా. కాకను పూలు రాలుటకు కారణము చూపవలెనుకదా. ఇక నతిథిసత్కారము కణ్వుని తరఫున శకుంతల కెంత యావశ్యకమో తత్తపోవన చరాచరముల కన్నిటికి నంత యవశ్య కర్తవ్యమే. ఇది కణ్వుని యుదాత్తతకును తపోవన సంప్రదాయములకును మెరుగే గాని తరుగు కాదు. కాగా వేటాడి యలసివచ్చు వీరశిఖామణికిని రాబోవు శృంగార గాథకును తగిన మనోరమమై మనోహరమైన వాతావరణమా కూర్చవలసినది, సర్వేంద్రియశమము కూర్చు శాంతరసస్ఫోరక వాతావరణమా. అందుచే నన్నయ యున్నంతలో నాయకునకును ప్రకృత కథకును రసమునకును కావలసిన పరిస్థితుల కల్పింప యత్నించెను. ఇది ప్రతిభావంతుడైన కవికి తగునో తగదో విజ్ఞులు యోజింపుడు. ఇంత మనోహరార్థ గాంభీర్యములుగల యీ పద్దె మవినయార్థబోధకముగా కన్పట్టుట విచారకరము.

తరువాత 'తన్మునివల్లభ మందిరమ్మునన్' అన్నది—దీనికి బైటకానియా యర్థము ఈ సప్తమికి లోపల నెక్కడో కూర్చున్నదనియే గ్రహించుట సరసులకు తగదు. ఇంత వ్యంగ్యవైభవముగల పద్దెము ఇంత సుకుమారార్థద్యోతకమైనది తెనుగు సారస్వతమున లేదనుట యత్యుక్తి కాదు. కాళిదాసుని "శాంత మిద మాశ్రమపదం—స్ఫురతి చ బాహుః" అను రెంటికినిగల బలవత్తర విరోధమును, "కుతః ఫలమిహాస్య" యను సందిగ్ధతయు నిందు కలవు. "తన్వి, పయోజదళాయతాక్షి, సంకుల మిళితాళి నీలపరికుంచిత కోమలకుంతలన్ శకుంతల యను కన్యకఁ గనియె—నని శుద్ధాంతదుర్లభమైన యా సౌందర్యఖనిని చూడగా కలిగిన యాశారేఖను, పరమ తపోనిష్ఠాగరిష్ఠుడైన తన్మునివల్లభమందిరస్థ యగుటచే గల నిరోధకతయు సూచించుటకు వాడబడిన పద్య

సౌందర్యము నర్థ గాంభీర్యము పాత్రముతో భావ చిత్రణ కౌశలమును గమనింపక శకుంతల ఇంట నున్నదా? బయట నున్నదా? యను ప్రశ్నపరంపరచే కుస్తీపట్టు చాల విచారకరము.

పరబాలికను చూడగనే ప్రత్యంగసౌందర్యైక లగ్నమైన దృష్టి దుష్యంతున కున్నదా? ఈ వర్ణన చేసినది కవియా దుష్యంతుడా? దుష్యంతుడేయయిన నష్టమేమి? కాళిదాసు డేమి చేసెను? మొదట నుండియు కడవరకును నామె బహిస్సౌందర్యమును వర్ణింపని పట్టు కలదా? అందువలని దుష్యంతపాత్ర పోషణౌచితి నన్నయ తానె వాడిన మూడు ములకే పోయినదా? పోనిండు. అసలా విశేషణములను ఆవరణమును ఏల? అనిన చూతుము. పెలలిత సమాసరచనయందలి రమ్యత యద్వితీయ శకుంతలా సౌందర్యస్ఫోరకము. ఇదియొక విశిష్టమైన వ్యంగ్య రచనావిశేషము. ఏమియు లేక శకుంతల యున్నంతనే దుష్యంతుడు వలచెనన్న, స్త్రీమాత్ర నేరినైన వలచు నంతటి నీచుడు కాడా? ఆమె శుద్ధాంతదుర్లభమైనది కావును అపూర్వ సౌందర్యరాశియు గాననే నిరోధక వాతావరణమునగూడ దుష్యంతుని మనసు పర్వినది అంతేగాని స్త్రీలను వర్ణించు వ్యామోహముండి ఔచిత్యమెరుగనివాడైనచో నామె నతిమాత్రముగా వర్ణింపలేడా? అనవసరము — ప్రస్తుత కర్తవ్యము దుష్యంతవంశవర్ణనమును, భరతజననమును గాని శకుంతలా దుష్యంతుల ప్రణయగాథ నొక శృంగారకావ్యముగ సృజించుట కాదు. కాని ఇతివృత్తవశమున నాతిమాత్రముగా వర్ణింపక తప్పలేదు కావున నంతలో ఔచితి నెరిగి రచించె. ఈతడే శృంగారగాథల రచించుటలోను, నందుల పాత్రపోషణ చేయుటలోను, స్త్రీపాత్రచిత్రణవర్ణనల చేయుటలోను ఔచితి నెరుగకున్న తెలుగుకవులెవ్వరు నెరుగరు. స్త్రీవర్ణన లతిమాత్రముగ చేయక వదలినది నన్నయ తక్క మరెవ్వరున్నారు. తెనుగు శిల్పపుతోటయైన తిక్కనార్యుడే రసాభాసమున ద్రౌపది నమితముగా వర్ణించి విమర్శకలోకము నున్నన కెక్కెనే. శ్రీనాథుని చెప్పనక్కరలేదుకదా. అసలిట్లు వర్ణించుట దోషమా? కాదే. వర్ణనలుద్దీపనవిభావములని సంప్రదాయజ్ఞు లెరుగుదురుగాక. వర్ణితవస్తుభావనమునగాని పాఠకులు రసానుభూతి నందరు. దుష్యంతునకు శకుంతలా సుందరమూర్తి ఎదుట నున్నది. కాన రసావిష్టుడైనాడు. పాఠకులకేది యామె సౌందర్యమూర్తి. తత్స్ఫురణకే నాయికానాయకవర్ణనము ఇది యత్యావశ్యకమని ఎఱుగవలెను. కాననే కాళిదాసు చేసినరసపోషణ చేయగలిగెను. శాంతరసముశృంగారమున కంగిగా నుండరాని విరుద్ధరసము. తత్సన్నిధానమున నితర రసభావ వ్యవధానముల శృంగారపోషణము చేయవలెను. అందులకే వీరరసపోషకమైన వేట మొదలైనవి చేయుటయు, శాంతము నెక్కువ వర్ణింపకుండుటయును.

అసంఖ్యాకులైన శిష్యులుండ నొక్కడే పోయి మాలినీతీరంబున నున్న శకుంతలను కణ్వుడు చూచెనని మూలమున కలదు. ఆతని శిష్యులేమైరి? అని శంకించిరి మొదటి వ్యాసకర్తగారు.-- దీనిని శకుంతలా దుష్యంతుల సమావేశమున కణ్వుడు పంక్తికై పోయినప్పుడు శిష్యులేమైరని అరిరనుకొని నన్నయయందు నట్లె వ్రాసెననుట వ్యాసమును సరిగా చూడని లోపము.

మూలమున కణ్వుని తలచుకొని దుష్యంతుడు తన కృత్యమునకు దిగులు చెందెననియుండ, నన్నయ, శకుంతల భీతిల్లెననుట శోభాతిశయము కాదు అనుటలోని మంచిచెడ్డల విమర్శ: ఇప్పట "కణ్వునకు శకుంతల కూతురు. దుష్యంతుడు పైవాడు. తప్పు కలిగినప్పుడు తనవారిపైకన్న నితరులపై కనలు పూనుట సహజము కాన శకుంతలకన్న దుష్యంతుడే కణ్వుని గూర్చి భయము పొందవలెనను విమర్శక సిద్ధాంతము. కణ్వపాత్రౌన్నత్యము నెరిగి పలికినది కాదు. ధర్మస్వరూపుడు, కరుణానిరతుడునైన మహా తపస్వి పెంపుడుకూతురై తండ్రికి చెప్పకుండ పరుడు దొరకగనే స్వతంత్రించి వివాహమాడిన శకుంతల భయ మందుట యా పాత్ర కెంతయు మెరుగు. ఈ భీతిలో శాపభయముకన్న తన కర్తవ్యోల్లంఘన దోషభయము చూపుట యుత్కృష్టతరము కాదా! దుష్యంతుడు చేసినది విధిచోదిత కర్మమే కనుక భయమక్కరలేదు. కణ్వుడట్టి పట్టుల కనలడని దుష్యంతు డెరుగును. అట్లు కాక తన చర్యకు కణ్వుడు కనలునేమో యని భయమందినచో తాను చేసిన దధర్మమును భీతి యున్నదైన దుష్యంతుని పాత్రయే పాడగును. కావున దుష్యంతుడు విచారించుటకన్న శకుంతల చింతిలుటే యుక్తము.

ఇంక తుచ్ఛకామావేశమును కణ్వుడు వచ్చునంతకు క్షణమైన నిల్పజాలని దుష్యంత పాత్రపోషణ విమర్శ. ఈ దోషము నన్నయది కాదు. మూలముననే కలదు. దోసమైన వ్యాసుడేల వ్రాయును? దుష్యంతుడు శకుంతలను గాంధర్వ వివాహమున చేపట్టెను. గాంధర్వ వివాహమున నేమి? ఎప్పుడు జరుగును. "తనకు మఱి తాన చుట్టంబు తాన తనకు గతియు తన్నిచ్చుచో తాన కర్త యనగ వనజనేత్ర గాంధర్వ వివాహమతిరహస్యమును నమంత్రకమును నగుచు నొప్పు." అని నన్నయ. — "త్వయాద్యభద్రే రహసి మామనాదృత్య యఃకృతః పుంసా సహ సమాయోగో నసధర్మోపఘాతకః, క్షత్రియస్య హి గాంధర్వో వివాహః శ్రేష్ఠ ఉచ్యతే, సకామాయాస్సకామేన నిర్మంత్రో రహసి స్మృతః—" అని మూలము.

కాముకులైన నాయికానాయకులు అమంత్రకముగా రహస్యముగా స్వతంత్రించి చేసికొనునది గాంధర్వము. ధర్మ్యము. ఇది క్షత్రియులకు శ్రేష్ఠము. ఇందు దుష్యంతుడు అనాయకురాలిని మోసగించిన దేమి? ధర్మము కాని దానిని ధర్మముగా చెప్పిన దేమి? తుచ్ఛ కామమును క్షణమైన నాపుకొనని దోషమేమి? దుష్యంతుడు సర్వసంగ పరిత్యాగియై సన్యసింపవచ్చెనా ఆశ్రమమునకు? లేదు. విమర్శకుల యూహాప్రకారము కణ్వునికై యాగినచో గాంధర్వ మెట్లగును. అసలు కథ యిట్లేల జరుగు. గాంధర్వము శ్రేష్ఠము కాన నదియే దుష్యంతుడు చేసె. పెద్దలకై ఆగిన దోసముకాదు. ఇందు దుష్యంతుని పాత్ర మూలమునగాని, నన్నయ భారతమునగాని పోషింపబడినదే గాని దూషింపబడలేదు.

మూలమున శకుంతల "విభ్రాజమానాం వపుషా తపసేన దమేనచ" యనియు "శ్రీరివ రూపిణీ తాపసీ వేషధారిణీ" యనియు నున్నది. నన్నయ శకుంతలకను వేదురు కలదు. ఈ పాత్రచిత్రణము నన్నయ శీలపోషణసామర్థ్యమును వెలువరచుచున్నది అను విమర్శ. వ్యాసుడు వాచ్యము చేసినదానిని నన్నయ వ్యంగ్యముగ మాపెను. గ్రంథవిస్తరభీతిచే చాలింతును.

కాన సహృదయవిమర్శకులు బ్రహ్మంగారి విమర్శలోని యుక్తాయుక్తముల గ్రహింతురుగాక. స్నిగ్ధహృదయముతో జిజ్ఞాసువులై చూచినగాని మహాకావ్యముల యర్థగాంభీర్యము రచనా విశేషములు గోచరింపవు. కాన నన్నయ తెనుగుబాసకును నాంధ్రీకృత భారతమునకును జాతికిని నష్టము కల్గింపలేదు.

# రెండభ్యుదయ గేయాలు

## శ్రీ కురుగంటి సీతారామయ్య

జూన్ 10 తేది "స్వతంత్ర"లో నొకటియు, జూన్ నెల భారతిలో నొకటియు, రెండు గేయములను చదివి యానందించితిని. వీనిని రచియించిన యుభయులును సుప్రసిద్ధ కవులే! రెండును రెండు విధములైన యభ్యుదయ రచనలకు మచ్చుతునకలు. స్వతంత్రలో ప్రచురించినదాని శీర్షిక "నా కొంచెం నమ్మకమివ్వు." దీనిని రచించినది "బైరాగి." భారతిలో ప్రచురించినదాని శీర్షిక "ఆర్తగీతము". దీని రచయిత "బాలగంగాధర తిలక్." రెండింటిలోను రచయితల యసమర్థత సామాన్యలక్షణము. ప్రథమ గీతికలో నమ్మకమిచ్చువారెవరో కవి యెవరి నడుగుచున్నాడో తెలియదు. ఇందు తనకు శక్తియున్నట్లును, కాని యెవరో తనకు నమ్మకమిచ్చుటలేదనియు ధ్వనించుచున్నది. "మానవేయుని నొసటివ్రాలు" "కాలుడు" "పరమశివుడు" (ఉత్తశివుడు కాదు) "నందన నికుంజాలు" మొదలైన నుడికారములున్నందున యభ్యుదయ కవియయ్యు పూర్వ సంస్కృతీ వాసన కొంచెమో గొప్పో యింకను మిగుల్చుకున్నట్లు కనపడును. "నొసటివ్రాలు" తుడిచివేయుటకు తన యసమర్థత "నిస్సహాయ మానవేయ" పదములోనుంచి తొంగిచూచుచున్నది. ఇక పోతే తనకు నమ్మకమిచ్చిన, తా నేయే కార్యములు చేయునది తెల్పినాడు. "సూర్యచంద్రులను మింటినుండి నెట్టివేయును." "బ్రహ్మాండాన్ని చాపలాగ చుట్టేను." "నొసటివ్రాలు కొట్టేస్తాడు" "కాలునిమీద కలబడతాడు" "పరమశివుని శూలాగ్రాన తలక్రిందుగ నిలబడతాడు." తుదకు "ఆకాశపు ఊదారంగు తొను చించి చొక్కాలేనివారందరికి కుట్టిస్తాడు" ఇవి ఈయన చేయు పనులు. అశక్తుని కెల్లప్పుడు నత్యాశ సహజము. ఆ యత్యాశయంతయు నీ గీతమున నిండి పిండీకృతమై యున్నది. అశక్తకార్యపరంపర గీతమున వెల్లివిరియుచున్నది. ఊహకందని విషయము గీతములో నిండియున్నది. అసహజ వాతావరణముతో పిక్కటిల్లుచున్నది. నేటి

యభ్యుదయ రచనలలో కనపడునట్టి "చితికిన టొమాటో" "ఆరిన అప్పడం" "ఎంగిలి పళ్లెం" మొదలైన నుడికారములు కలవు. "పతాభితో" బాటు గీతమునందంతటను "అహంభావ భావము" మూర్తీభవించినది. పతాభి గీతములయొక్క చిహ్నములు పోకడలు కూడ యిందు కలవు. కాని యీ భీభత్సమునకు నడుమ, కవికి సంఘమును బాగుచేయవలెనను సదుద్దేశ్యము "జీవిత సభాభవనం నుంచి అన్యాయాన్ని దౌర్జన్యాన్ని మెడబట్టుక గెంటేస్తాను" అనుమాటలలో వ్యక్తమగుచున్నది. కవి చేయదలచిన పనులలోనిది స్వల్పమైన యేకదేశము. రెండుపంక్తులలో మాత్రముకలదు. మిగిలినదంతయు నశక్తాహంకారమే!. అసంభవకార్యోద్యమమే! సాహిత్యదృష్టితో చూచిన నిదియొక యూహాపరంపర. కవియొక్క యాత్మీయత ద్యోతకమగుచున్నది. అంతయు వాచ్యమే కాని యెచ్చటను వ్యంగవాసన లేదు. తనకంటె బలము కలవానిపై కసి తీర్చుకొనుట చేత గాక "నిన్నేమి చేయుదునో చూడు" అని బెదరించినట్లున్నది యావద్గీతవస్తువు. సృష్టికంటె విలక్షణమైన సృష్టిచేయగల కవిబ్రహ్మ "మరోసత్రం కట్టించే" విధమిది కాదు. ఒక వాతావరణమును కల్పించి పాఠకుని నమ్మించిన గాని యీవిలక్షణ సృష్టికి తావులేదు. కవి కెవరైన నీపనులను చేయగల నమ్మకము లిచ్చినను, కవి యీపనులను చేయలేడనియే పాఠకుని నమ్మకము గీతపఠనానంతరము పాఠకులు నూతన ప్రపంచములోనుంచి వెలువడున ట్లనుభవింపవలయును. "కొండలైన పిండిగొట్టవచ్చు"ననెడి వేమన వాక్యమునకు, "కొండలు పిండికొట్టేస్తాను" అనెడి యీ వాక్యమునకు నెంత భేదమున్నదో గమనింపదగును. కాని యశిథిలపదబంధముతో, గేయము మాత్రము చక్కని "రీతి"లో నున్నది. తాను సిగరెట్టు త్రాగువాడనెడి కవి స్వీయచరిత్ర కొంచెము కలదు. "సిగరెట్" ఉపమాన పరంపరలోని మూడంశములందును నెంతమాత్ర ముదాత్తత లేదు. ఉదాత్తతాహేయత లీ రెండును గేయమున కనపడుచున్నవి. ఇన్ని ఘనకార్యములు చేయదలచిన కవి "కొయ్యతుపాకిదొర"నని తెల్పుకునియున్నాడు. అనగా నతనిసాధనమున కెట్టి శక్తియు లేదని విదితము. కవియొక్క తెచ్చిపెట్టుకున్న కృత్రిమ చిత్తవృత్తి యీ గీతమున ప్రతిబింబించుచున్నది.

ఇక రెండవగీతమునకు వత్తును. ఇందు ప్రస్తుతపు దేశస్థితి కన్నులకట్టిన ట్లగపడుచున్నది. కవి చుట్టునూ చూచుచున్న దృశ్యములును, వానినుండి తప్పింపలేని యశక్తతయు, స్థితిగతులను తెల్పుకొనుటకు తావులేమియు నిందు గోచరము లగుచున్నవి. కరుణరసపూరితములైన దృశ్యములను లోకమునుండి గ్రహించి వానికి సాహిత్యమునకు కావలసిన యుదాత్తతను కల్పించినాడు కవి. అశక్తతతోబాటు కవియొక్క నమ్రతయు, దేశము యొక్క హీనస్థితి యున్నంతకాలము తానేమియు సాహిత్యసేవ చేయలేకపోవుటయు తెల్పుచు సాహిత్య సృష్టి చేసినాడు. "మర్రిచెట్టుక్రింద మరణించిన ముసలివాడు", "వంతెనక్రింద ప్రసవించిన నిండు చూలాలు", "మురికి కాల్వప్రక్కనే నిద్రించిన పసిబాలుడు" "తాను నిరాహారుడై ఆఫీసుకువచ్చిన ప్యూన్" "క్షయ వ్యాధిగ్రస్తయైన భార్యగల గుమాస్తా" కండ్లకు కట్టినట్లు పాఠకునికి కనబడుచు స్వభావోక్తిద్వారా సన్నివేశములకు కావ్యత్వమును కల్పించినవి. దేశముయొక్క ఆర్థిక, సాంఘిక, సామాజిక దుస్థితి నీయుదాహరణ పరంప

రతో కవి చిత్రించినాడు. కవి యొక్క యశాంతియు నది యెప్పుడు తొలగునో, దేశాభ్యుదయ మెప్పుడు కలుగునో, కవి తెల్పినాడు. ఇప్పటి దేశ స్థితిలో "మానవత" లేదు. పేదతనము ఆకలి తాండవించుచున్నవి. అవి తొలగువరకు "నేను పాడలేనని" పాడుచున్నాడు. ఈ స్థితిని తొలగించుట కిప్పటి రాజకీయ వేత్తలును, భోగులును సమర్థులు కారని విలపించుచున్నాడు. కాని దేశపాలనము చేయువారి కొక ప్రశ్న వేయుచున్నాడు. "పైన దైవమునకును క్రింద మానవునకును సమాధానము చెప్పవలసినవాణ్ణి" అని తననుగూర్చి చెప్పుకొనుచు పాలకుల నుద్దేశించుచున్నాడు. మన పెద్దలు "చిత్ర శిల్ప కవితా ప్రసక్తి" తోను "తత్వశాస్త్రవాదోక్తితోను" "గత చారిత్ర యశః కలాప వివరణము"తోనూ కాలము గడుపుచున్నారు కాని యున్న "మూర్తీభవత్ దైన్యాన్ని", "హైన్యాన్ని" "క్షుభితాశ్రుకల్లోలనీరధుల్ని" గద్గదధ్వాంతకార కారుల్ని" మాటలేవని వాపోవుచున్నాడు రాజకీయముగా "నొక ఇజం" యీ దుర్దశను మార్చుటకు తగినదని కవియొక్క హృదయమున నున్నను, ఇప్పుడున్న రాజకీయవాదము (సామ్యవాదము)న దైవమునకుకూడ స్థానముండవలెనని కవి యుద్దేశమని, "పైన దైవమునకు" అను పదముల లోగర్భితముగనున్నది. ఇట్టి దైన్య హైన్యమున కాలవాలమై చూచువారికి కన్నీరు తెప్పించు పరిస్థితులలో "మీరెట్లు మానవులమని తలలెత్తుకొని తిరుగుచున్నారు? సిగ్గులేదా?" యని నాయకుల నుద్బోధించుచున్నాడు కవి. ఇదియేనా మీ నాగరకతకు "ఫలశ్రుతి" మీ విజ్ఞానమున "కుసంస్కృతి"? బుద్ధదేవుని జన్మస్థానమి యీ దేశమని గర్వించుచుందురే! ఇదియేనా యా గర్వమునకు కారణము? అని ప్రశ్నించుచున్నాడు. ఈ దైన్య హైన్య 'విపంచికకు" శ్రుతి కలుపలేనని వాపోవుచున్నాడు. భగవంతునికి కూడ యీ దేశ దుస్థితి కనపడలేదు — ఈ గీతమునను, నేటి అభ్యుదయ రచనలలో సామాన్యమైన "ఆకలి" పేదతనము మొదలైనవే వస్తువు అయినను అవి కొల్‌రిడ్జి, చెప్పినట్లు సాధారణ వస్తువు నసాధారణముగా నుదాత్తముగానుచేసి కవిదానికి కావ్య వస్తుత్వమును కలుగచేసినాడు, (*Thoughts translated into the language of poetry*). తన దేశము యొక్క యభ్యుదయమును వాంఛించుచున్నాడు. కాని యసమర్థుడైవిన్నవించుకొనుటకు తావులేక విలపించుచున్నాడు. ఈ గీతమునందును వాచ్యమే ప్రధానమైనను, నచ్చటచ్చట సూక్ష్మముగా వ్యంగ్యము గుణీభూతమై యున్నది. మొదటినుండి తుదివరకు నుదాత్తత యెచ్చటను లోపింపలేదు. కవి నమ్రత "రసాతలమునంట శిరస్సు వంచినవాణ్ణి" అను మాటలలో మూర్తీభవించినది. దురహంకార మెచ్చటను లేదు.

రెండును గీతము లని పిలువబడినను, గణమాత్రా ఛందస్సులలో నేదియు వానిలో లేదు. కాని యొక విలక్షణమైన లయమాత్రమున్నదని చెప్పక తప్పదు. ఆ లయయే వానికి కావ్యత్వమును కల్పించినది. వీనిని భావగద్యము లనదగును. రెండిటికికూడ రెండు పత్రిక లభ్యర్థిత స్థానము నిచ్చుట సముంజసము.

# గ్రంథ విమర్శనము

## భారతీయ తత్వశాస్త్రము

### 3, 4, 5 సంపుటములు

జగద్విఖ్యాత తత్వశాస్త్రవేత్త డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణుని 'ఇండియన్ ఫిలాసఫీ' (*Indian Philosophy*) అనే అర్ణవప్రాయమైన మహా గ్రంథానికి శ్రీ బులుసు వెంకటేశ్వరులు గారి ఆంధ్రానువాదం. ఈ అనువాదాన్ని మొత్తం అయిదు సంపుటాలుగా వెలువరించారు. మొదటి రెండు సంపుటాలూ లోగడనే ప్రకటింపబడి ఆంధ్రప్రజల మన్ననల నందుకున్నాయి.

ఇది అర్ణవప్రాయమైన గ్రంథమని మొదటనే చెప్పాం. సముద్ర తరంగాలను లెక్కించటానికి పూనుకోవటం ఎలాంటి హాస్యాస్పదమైన కార్యక్రమమో ఈ గ్రంథాన్ని సమీక్షించడానికి పూనుకోవటం కూడా అలాంటి హాస్యాస్పదమైన విషయం. మరొక రాధాకృష్ణన్ యెవరైనా ఉద్భవించి దీన్ని సమీక్షించవలసిందే గాని సామాన్యులకు సాధ్యమయ్యే పని గాదు. అందు చేత ఆ ప్రమేయానికి పోవటం లేదు.

కాగా యీ గ్రంథంయొక్క పరమ ప్రయోజనమేమిటో మనవి చేయటానికి కొంత ప్రయత్నించుతాం. గ్రంథాంతమందు 'సమాప్తి' అనే అధ్యాయంలో గ్రంథ ప్రయోజనానికి సంబంధించిన వివరణ కొంత వుంది. ఇంచుమించు అంగుల్లేఖింపబడిన విషయాలనే టూకీగా మనవి చేస్తాం.

భారత జాతికి ఇది అత్యంత ప్రధానమైన పరిణామ దశ; ఏ జాతి అయినా ఒక దశనుంచి మరొక దశకు పరిక్రమించు తున్నప్పుడు ఆజాతి ఆసంధి కాలములో సర్వ జీవన రంగాలలోనూ సంక్షోభయుతమైన మహా కల్లోలాన్ని ఎదుర్కోవలసి వుంటుంది. సర్వ జీవన రంగాలకూ తాత్విక రంగం మూలాధారం. ఇప్పుడు ఈ తాత్విక రంగంలో చెలరేగి వున్న కల్లోలం అనంతం.

దేశంలో ఇప్పుడు రెండు రకాల తీవ్రవాదులు కనుపించుతున్నారు. భారతీయ తాత్విక ప్రపంచమంతా అర్థరహితమైన వట్టి ఊహాగానమనీ ప్రయోజనరహితమైనదనీ దాన్ని మొత్తంగా విసర్జించితేగాని మనకు బ్రతుకు తెరువు లేదనీ వాదించే వర్గం మొదటిది.

భారతీయ తాత్విక విజ్ఞానమంతా దైవదత్తమైనదనీ, సనాతనమనీ అది సృష్ట్యాదినుంచీ నేటివరకూ ఒకేమాదిరిగా వున్నదనీ దానికి పరిణామదశలంటూ మార్పులంటూ ఎప్పుడూ వుండనే లేదనీ, వుండటానికి వీల్లేదనీ, దానికి మార్పుచేర్పులు వుండాలని యోజన చేయటమే మహా పాపమనీ వాదించేవారు రెండో వర్గం.

ఈ రెండు రకాల పిడివాదాలకూ కూడా కారణం, భారతీయ తాత్విక విజ్ఞానంతో యీషణ్మాత్రమైనా పరిచయం లేని భయంకరమూ అంధప్రాయమూ అయిన అజ్ఞానమని ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం స్థూలంగా పరిశీలించితే మనకు విస్పష్టంగా బోధపడుతుంది.

మన విజ్ఞాన శాస్త్రాలన్నీ సంస్కృతభాషలో వున్నాయి. సంస్కృత భాషాజ్ఞాన శూన్యత ఈ కల్లోలానికంతకూ ప్రధాన కారణంగా కనుపించుతుంది.

మొదటితరగతివారు ప్రాచీన విజ్ఞానంతో ఏ సంపర్క లేశమూ లేక పాశ్చాత్య విజ్ఞాన పరవశులైయున్నవారు. ప్రాకృతికవాదము పరమావధియని నమ్ముతున్నవారు. ప్రాచీన విజ్ఞానం కేవలం శృంఖలప్రాయమైనదనీ ఆ శృంఖలాలనుంచి బయటపడితేనే

తప్ప మనకు బ్రతుకు తెరువు లేదనీ వారి అభిప్రాయం. వీరికి సంప్రదాయంపట్ల పరమవిద్వేషం. ప్రాచీన విజ్ఞానంలో గల మంచి చెడుగుల పరిశీలించే సహనం గాని మనశ్శాంతిగాని వీరికిలేదు. ప్రాచీన విజ్ఞానానికి సంబంధించిన ప్రతి విషయాన్నీ వీరు ఆశంకించుతున్నారు. ప్రాచీన విజ్ఞాన సర్వస్వాన్ని సమూలంగా పెకలించివేయాలనీ దాని స్థానంలో పాశ్చాత్య విజ్ఞానాన్ని మక్కికి మక్కిగా నెలకొల్పాలనీ వీరి ఆవేశం. వీరు యోజించుతున్న పద్ధతి ఇది: విజాతీయుల దాడులనుంచీ, దోపిడులనుంచీ మన ఆత్మవిజ్ఞానం మనల్ని రక్షించలేకపోయింది. ప్రాచీన విజ్ఞానం జాతికి ద్రోహంచేసి ప్రస్తుత దురవస్థకంతకూ కారణమైంది. దీన్ని పూర్తిగా విసర్జించి పాశ్చాత్యుల భౌతిక విజయమార్గాలను సేకరించితే మనం బాగుపడటానికి వీలుంటుంది.

పాశ్చాత్యుల భౌతికవాదం యుద్ధజ్వాలల మహాసంక్షోభంగా పరిణమించి, బ్రతుకు తెరువుకోసం అక్కడి మేధావులంతా భారతీయ తాత్త్వికపథం వైపు ఆశతో చూస్తున్న ఈ దశలో మనదేశంలో నే కొందరు ఇలాంటి అభిప్రాయం కలిగివుండటం విచిత్రమైన విషయం. తాము ఇంతవరకూ ఏ ధర్మాన్ని అనుసరించి బ్రతుకుతూ వచ్చారో ఆధర్మాన్ని విసర్జించటం కూర్చున్న కొమ్మనే నఱుక్కోవటం వంటిదనీ, ఆత్మహత్యా ప్రయత్న సదృశమని ఇట్టివారు గమనించక పోవటం విచారించదగిన విషయం.

ఇక రెండవ వర్గం :

వీరు పశ్చిమ విజ్ఞాన సంపర్కం లేక దాన్ని గర్హించుతూ వుంటారు. రాజకీయ వాతావరణానికి దూరంగా నిల్చుంటారు. దాన్ని అర్థం చేసుకోవటానికైనా ప్రయత్నించరు. కానున్నది కాకమానదనే మంత్రాన్ని పఠించుతూ నిరాశావాదులై చేతులు ముందు పెట్టుకుని చూస్తూ కూర్చుంటారు, దేశంలో ఏ మహా కల్లోలం చెలరేగుతున్నా తమ కేమీ పట్టనట్టు. తాము ఇక నేర్చుకోవలసింది గాని, విసర్జించవలసింది గాని యేమీ లేదనే అహంకారంతో తమ చుట్టూ అంధకార బంధురమైన ఒక చెరసాలను నిర్మించుకుని దాని మధ్య కళ్ళుమూసుకుని కూర్చుంటారు. ఓడలూ, విమానాలూ, పొగబండ్లూ, తంత్రీ మార్గాలూ మానవుల్నందర్నీ ఒకే జాతిగా కలిపివేస్తున్న ఈ దశలో మనకు ఇలాంటి ఏకాంతవాసం సాధ్యం కాదని వీరు గమనించటం లేదు. ఇలాంటి మనస్థితి యేర్పడటానికి తగిన కారణాలు లేకపోలేదు.

ఈ గ్రంథం సముద్ధరించి చూపుతున్న సాక్ష్యాన్ని బట్టి, మహమ్మదీయ పరిపాలనకు పూర్వ మేదశలోనూ, భారతీయ మానసం సమాలోచనా సంస్కారాలకు వెనుదీసిన ఘట్టం యెక్కడా వున్నట్టు కనుపించదు. కాని గత మూడు నాలుగు శతాబ్దాల భారతీయ విజ్ఞానచరిత్రలో కారణాంతరాలచేత దురదృష్ట వశాత్తూ ఇలాంటి దుస్థితి కనుపించుతున్నది. తాను యిదివరకు వహించుతున్న ఆసియాఖండ విజ్ఞాన నాయకత్వానికి భారతదేశం తిలోదకాలిచ్చుకుంది. యుగయుగాలనుండీ అవ్యాహత వేగంతో వరదలై ప్రవహించుతూ వచ్చిన భారతీయ విజ్ఞాన మహావాహిని వేగముతగ్గి, చలనశక్తి నశించి, నిలువ నీటికి నిలయమై పాడుబడిపోయింది. ఈ జీర్ణదశకు చెందిన తత్త్వశాస్త్ర రచయితలు తాము సత్యారాధకులమని చెప్పకున్నారేకాని, నిజంగా పాక్షికవాద శాఖలకు చెందిన సంప్రదాయాగత సిద్ధాంతాలను బట్టుకుని ప్రాకులాడటమే సత్యాన్వేషణయొక్క పరమావధియని వ్యవహరించుతూ వచ్చారు. వాదలాలసులైన ఈ రకం తత్త్వకోవిదులు తమ కట్టెదుట కృశించి యెడారి భూములలో ఇంకి అంతరించిపోతున్న పిల్ల కాలువలను చూచి సువిశాలమూ గంభీరమూ అయిన భారతీయ విజ్ఞాన ప్రవాహినియని భ్రమించుతూ వచ్చారు.

మహమ్మదీయ పరిపాలనవల్ల వచ్చిన మార్పులు ప్రజామానసమును సంప్రదాయ సంకుచిత దృష్టికి బంధించివేసినై. సుస్థిర నిర్ణయాలనూ సాంఘిక స్థాయీ భావాన్నీ ప్రతిఘటించి, వ్యక్తిగతములైన సంకుచితాభిప్రాయాలను నిరంకుశంగా ప్రజల నెత్తిన వేసి రుద్దుతూ భావసాంకర్యాన్ని ఉద్భవింప జేస్తున్న దినాలలో ప్రమాణభూతమై శాసించగల విజ్ఞానావసరం కనుపించింది. మతప్రచార సంప్రదాయంతో కూడిన మహమ్మదీయ విజయము, అనంతరం వచ్చిన క్రైస్తవ ప్రచారకోద్యమమూ, హిందూ సంఘస్థాయీ భావాన్ని ఉద్ఘాతలూగించ ప్రయత్నించినాయి. అలాంటి సంచలనయుగంలో సంఘ ధర్మాలకు క్షేమం వుండాలంటే ప్రమాణ శాసనమనే నిశ్చల స్తంభాన్ని అంటిపెట్టుకుని ఉండటం యొక్కటే

మార్గమని అనుకున్నారు. ఈ సంఘర్షణ సమయంలో హైందవుడు తన ధర్మక్షేత్ర సంరక్షణార్థం నియమావళి అనేకంచె వేసుకుని విజాతీయ భావాలు దానిలో ప్రవేశించకుండా అరికట్ట జూచాడు. హిందూ సంఘం హేతువును నమ్మక వివాదములకు విసిగి, సంశయించటమే మహాపాపమనే సంకుచిత ప్రమాణాన్ని ఆశ్రయించుకు కూర్చున్నది. ఈవిధంగా తన్ను కట్టతాళ్లు తానే సమకూర్చుకుని హిందూ సంఘం అపజయంపొందింది. స్వతంత్రంగా యోజించగల విజ్ఞాన కర్తలంతరించారు. ప్రాచీన జ్ఞాన బలాన్ని సేకరించుకుని కొత్త బాటలు త్రొక్క సమర్థులైన పండితులు కనుపించలేదు. తమకు తెలిసింది మినహా మిగిలినదేమీ లేదని పండితులు శతాబ్దములపాటు ఆత్మవంచనకు లోనైనారు. తత్వశాస్త్రమంటే గతించిన తత్వశాస్త్రచరిత్రయేనని భ్రమించటంతో నిర్మాణశక్తి వారి నుండి తొలగిపోయింది. హిందూ సంఘం తన కర్తవ్యాన్ని దిగవిడిచి మిథ్యాభావ పాశబద్ధమై పోయింది హేతు పద్ధతికి మార్గదర్శి సంరక్షకురాలూ అయిన సంఘం దాని ప్రాణానిలాలను విడచివేసి ఆత్మహత్య చేసుకోవటానికి ప్రయత్నించింది. ఇప్పటి తిరోగమనవాదులైన ద్వితీయ వర్గంలో కనుపించుతున్న మన స్థితి ఇదే.

ఈ రెండువర్గాల అనౌచిత్య పంథాలనూ విసర్జించి భారతజాతి ముందుకు పరిక్రమించటానికి ప్రయత్నించాలి. అలా పరిక్రమించటానికి తనకున్న శక్తి సామర్థ్యాలేమిటో ముందు తెలుసుకోవాలి. అలాంటి విజ్ఞానాన్ని ఈ గ్రంథం సమకూర్చుతున్నది.

వేదవాఙ్మయంలో బీజప్రాయంగా వున్న భారతీయ విజ్ఞానం మొలకెత్తి క్రమవికాసాన్ని పొంది శాఖోపశాఖలుగా విజృంభించి పుష్పఫల సమన్వితమైన మహావృక్షంగా పెంపొందిన చరిత్ర యావత్తూ ఈ గ్రంథంలో సవివరంగా తెలుపబడ్డది. ఈ గ్రంథ పఠనంతో జాతికి పట్టివున్న సర్వ దుర్భ్రమలూ తొలగి వెలుగుబాట కనుపించుతుంది. ఇంతకంటే ఈ గ్రంథాన్ని గురించి యెక్కువగా చెప్పవలసిందేమీ లేదు.

ఈ సంపుటాలలో వివరింపబడిన ముఖ్య విషయాలు :

మూడవ సంపుటం: ఈ సంపుటంలో తొలుదొల్త బౌద్ధమత శాఖలు నాలుగూ, వాటి విజ్ఞాన సంప్రదాయాలు వివరింపబడినై. ఇది మూలగ్రంథంలోని ద్వితీయ భాగంలోని చివరి అధ్యాయం. ఇక్కడ నుంచి తృతీయభాగం ప్రారంభమవుతుంది. ఇందు ప్రథమాధ్యాయంలో షడ్దర్శనముల ఉత్పత్తి వాటికి వేదములతో గల సంబంధమూ వివరించారు. ద్వితీయాధ్యాయం న్యాయదర్శన సమీక్ష. తృతీయాధ్యాయం వైశేషికాణువాద వివరణ.

నాలుగవ సంపుటం: తృతీయభాగం చతుర్థాధ్యాయంతో ఈ సంపుటం ప్రారంభమవుతుంది. ఈ చతుర్థాధ్యాయం సాంఖ్య దర్శన సమీక్ష; పంచమాధ్యాయం పతంజలి యోగదర్శనం.

షష్ఠాధ్యాయం: పూర్వమీమాంస; సప్తమాధ్యాయం వేదాంత సూత్రములు. అష్టమాధ్యాయం శంకరుని అద్వైత వేదాంతం.

అయిదవ సంపుటము: అష్టమాధ్యాయమే కొనసాగింపబడి శంకరాద్వైతము సమగ్రంగా సమీక్ష చేయబడ్డది. నవమాధ్యాయం: రామానుజుని ఆస్తికతత్వము; దశమాధ్యాయం: శైవం శాక్తం, వైష్ణవమత పరిణామములు. ఏకాదశాధ్యాయం: గ్రంథ ప్రయోజనాదిక వివరణ.

ఈ ఉద్గ్రంథాన్ని ఆంధ్రభాషలోకి అనువదించి అందజేసిన శ్రీ బులుసు వేంకటేశ్వరులు గారికి ఆంధ్ర ప్రజలు ఋణపడివున్నారు. భారతీయ విజ్ఞాన సర్వస్వమైన ఈ గ్రంథం ఇంటింటినీ అలంకరించదగ్గది.

అనువాదంలో ఈ గ్రంథాన్ని సాధించటం సామాన్య విషయం కాదు. ఆయా శాస్త్రముల మూల గ్రంథాల విషయికమైన సమగ్రమైన పాండిత్యముంటేనే గాని ఇది సాధ్యం కాదు. ఈ విషయాలను ఆంగ్లభాషనుంచి అనువదించటంలో పెద్ద చిక్కు వుంది. ఆంధ్రభాషకూ సంస్కృత భాషకూ వున్న సన్నిహిత బాంధవ్యాన్ని బట్టి, ఆయా సంస్కృత మూలగ్రంథాలలో వాడబడిన సాంకేతిక పదజాలమంతా కరతలామలకమై వుంటేనే తప్ప ఇది ఆంధ్ర రచన అనిపించుకునే సావకాశం లేదు. శ్రీ వేంకటేశ్వరులు గారికి ఇట్టి పాండిత్యం వున్నది గనుకనే, ఇది అనువాదమైనా స్వతంత్రరచనగా కనుపించుతోంది. మూలగ్రంథం ఆంగ్లరచన కావటంచేత, భాషాక్లిష్టత కారణంగా దానిలో అందందు సువిశదంగా లేని కొన్ని అంశాలు అనువాదంలో వెలుగు తెచ్చుకున్నయ్. ఈ విషయాన్ని గమనించే, మూడవ సంపుటానికి ఉపోద్ఘాతము వ్రాస్తూ శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారు: 'మూలమున నున్న అర్థచ్ఛాయలకన్నిటికిది ముకురము' అన్నారు.

## మృత్యు రహస్యం

వైజ్ఞానిక చర్చ: రచన: శ్రీ వేమరాజు భాను మూర్తి; విజ్ఞానసాహితీ ప్రచురణలు, మద్రాసు-5; వెల 0.8 0.

## విపంచి

సారస్వత త్రైమాసిక పత్రిక; నిర్వాహకులు శ్రీ చ. నారాయణ రాజభట్; ప్రకాశకులు: ఆంధ్ర విజ్ఞానాభివర్ధనీ మాధ్యమిక పాఠశాలా సమితి; బచ్చన్న పేట; వెల 0.8 0.

## శరత్ జీవితము

రచన: శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య; ప్రచురణ: దేశికవితామండలి, విజయవాడ - 2. వెల 1-8-0.

## ముద్దుబిడ్డలు

పిల్లలకథలు. రచన: శ్రీ మద్దులూరి రామకృష్ణ; ప్రచురణ: ఆదర్శగ్రంథమండలి, విజయవాడ; వెల 0-8-0. ఈ సంపుటిలో గారడీ అబ్బాయి, భూమిపుట్టుక, అందాలపాపలు, నాన్నకోసం, ఆకాశం-గాలి చంద్రుడు-సూర్యుడు, వింత న్యాయం, అంతా మనమంచికే, బెస్తపిల్ల, మనసు మార్పు, ఏటావచ్చే గోరువంక — అనే 10 కథ లున్నాయి.

## దేవుడు ప్రత్యక్షమైతే

నాటికల సంపుటి: రచన-శ్రీకంచిభట్ల కృష్ణమూర్తి(ఆంధ్రా హైకోర్టు అడ్వొకేటు; గుంటూరు); అమూల్యం.

ఈసంపుటిలో 'దేవుడు ప్రత్యక్షమైతే', 'పెళ్లి సంబంధాలు', 'బీచ్', 'ప్రయివేటు మాస్టరు,' అనే అయిదు నాటికలున్నయ్. ఇవన్నీ లోగడ ఆ యా పత్రికలలో ప్రచురించిన నాటికలు. కొలది మార్పులతో గ్రంథరూపంలో ప్రచురించారు.

## రవీంద్ర జయంతి సంచిక

రవీంద్ర జయంతి మహోత్సవ సందర్భంలో 'టాగూర్ అకాడమీ, మద్రాసువారు (19 కాన్‌రాన్ స్మిత్ రోడ్, మద్రాసు - 6) ప్రచురించిన సంచిక. ఈ సంపుటిలో ఇంగ్లీషు, తమిళం, తెలుగు, బెంగాలీ నాలుగు భాషలలోనూ రచనలున్నయ్— నాలుగు భాగాలుగా. సంపాదకవర్గం: శ్రీయుతులు సి. యస్. యస్. తాతాచారి, పి. యస్. రాయ్, మల్లికార్జునరావు, టి. యన్. కుమారస్వామిగార్లు.

## జటాయువు

పద్యకావ్యము; రచన: శ్రీ కోటభట్టరు వెంకట రంగాచార్యులు; వెల 1-0-0; ప్రాప్తిస్థానము: కె. వి. రంగాచార్యులు, C/o, రాజన్ ఎలక్ట్రిక్ ప్రెస్, కాకినాడ.

## గాలిమేడల అమెరికాలో

రచన: శ్రీ ఎల్. ఎన్. రావు (సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ); మూల్యం 1-8-0; అమెరికా ప్రభుత్వమువారి సహాయంపొంది శ్రీ యల్. ఎన్. రావుగారు అమెరికాలో పర్యటించి వచ్చారు. వీరి పర్యటనానుభవాలను లేఖల రూపంలో తొలుత సాధన పత్రిక (అనంతపురం) ద్వారా వెలువరించారు. అనంతరం, ఆ లేఖల నన్నిటినీ సంపుటీకరించి ఈ గ్రంథంగా ప్రకటించారు. ప్రాప్తిస్థానం: శ్రీ యల్. యన్. రావు, సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ. కొఝికోడ్ (మలబారు జిల్లా).

## శ్రీ అద్భుతానందస్వామి

(లాటూ మహరాజ్ చరిత్రము)

రచన: శ్రీ దువ్వూరి రామకృష్ణరావు, ప్రచురణ: శ్రీ రామకృష్ణమఠము; మైలాపూర్, మదరాసు - 4; వెల 0-6-0.

## హృద్గీత

రచన: శ్రీయుతులు సంపత్కుమారాచార్య, సుప్రసన్నాచార్య; ప్రచురణ: రామలింగేశ్వర ప్రెస్, వరంగల్. అమూల్యం.

'సర్వేశ్వర' మకుటముగల శతకము. సమ్మోహన శిల్పముగల ప్రౌఢరచన; మచ్చుకు:

"ఎవరయ్యా! ఎవరయ్య నీవు! కవితా
హేలాకళా నీలకై
రవసంఫుల్లన మాచరించు నవచం
ద్ర శ్రీమహోరేఖవా!
అవునయ్యా! మృదుభావధాతగిరియం
దాసీనులైయుండి—ని
న్నవతంసించిన మాకవుల్ గిరిసుతే
ఆత్మేశ సర్వేశ్వరా!"

Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor: S. Sambhu Prasad.

Bharathi, 7th August 1955 Regd. No. M. 1856